Approved by the Text Book Committee for Nondetailed Study
vide Fort St George Gazette Page 20 D/ 14-5.46.

# ఇచ్ఛినీకుమారి

గ్రంథకర్త:
కేతవరపు వేంకట శాస్త్రి.

ప్రకాశకులు:
శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్కు డిపో,
రాజమండ్రి.

మూల్యము రూపాయ

# ఇచ్ఛినీకుమారి



( చరిత్రవిషయక నవల )



ఇది

రాయచూరు ముట్టడి, బొబ్బిలి ముట్టడి, తారాబాయి,
చిలారామ, లక్ష్మీప్రసాదము మున్నగు గ్రంథముల
రచించినవారును, విశాఖపట్టణమందలి
మిస్సెస్ ఏ. వి. యన్. కళాశాలా
ప్రధానాంధ్ర పండితులును నగు

కేతవరపు వేంకట శాస్త్రిగారిచే

రచియింపఁబడినది.

ఎనిమిదవ కూర్పు

ప్రకాశకులు:

శ్రీ తిరుపతి వేంకటేశ్వర బుక్కు డిపో,

రాజమండ్రి.

## FOREWORD

I esteem it a pleasure and privilege to write a foreword to this book. I have read through the whole book and may state without the least hesitation that it is very interesting. The author has succeeded in a large measure in breathing life over the dry bones of a few historical outlines gathered from the history of the XI century in Northern India. He has exhibited commendable skill in the delineation of characters. The heroine Ichinee-kumari, stands out as the type of a Hindu maiden always docile and at times spirited and bold to a degree. Her deep devotion to and unswerving loyalty and attachment for her future Lord are shown by the utter scorn with which she treats the overtures of a passionate but powerful monarch–Bheemadeva. Her constancy to Prithviraj is unparalleled. The other minor characters have been managed with wonderful dexterity.

The style is all that could be desired, simple sustaining and the language by no means bad. The book abounds in descriptions, both historical and geographical and let me frankly add that in most cases they are faithful, accurate and graphic.

I am quite confident that this novel will go a great way in meeting the modern requirements of Telugu in Secondary Schools and may therefore be safely prescribed as a Suitable Text-book, for non-detailed study in IV, V and VI Forms.

Cocanada, 1—5—19

M. HANUMANTHA RAO, B.A., L.T.,
P. R. College.

# కథాముఖము

తెలుఁగునాఁట వెలసిన తొలినాఁటి 'నవలా' రచయిత లలో శ్రీ కేతవరపు వేంకట శాస్త్రిగారు మహోత్తమమైన స్థాన మలంకరించిరి. విశేషించి, వా రేరుకొన్నవి కోరుకొన్నవి యగుగాథలు చారిత్రకములే. రాయచూరుముట్టడి, బొబ్బిలిముట్టడి; ఇత్యాదులు పెక్కు లరయునది. ప్రకృతము, ఈ 'ఇచ్ఛినీకుమారి' యుఁ జారిత్రకమే. ఇందలి కథ 'రాస మాల' యను ఘూర్జర దేశచరిత్రమునుండి సంగ్రహింపఁబడినది. అయిదాఱు పాత్రములు మాత్రము కల్పితములు. చరిత్ర—అచ్చముగా నున్నటులే వ్రాసికొనుచు వచ్చినచో నందమే యుండదు. కొన్ని మార్పులు చేర్పులు రచయిత చేయవలయును. శాస్త్రిగారు కూడ నీదారి నాశ్రయించినారు. కనుక నే యీ 'నవల' సుందరముగా నున్నయది.

ఇచ్ఛినికి నిజమైనహృదయము పృథ్వీరాజుమీఁద. భీమరాజు ఇచ్ఛినినిమోహించి, ఆమెను వలసింపఁజేయుటకుఁ బన్నుగడలు పన్నెను. ఎన్ని చేసినను, ఇచ్ఛినీ—పృథ్వీరాజుల వలపులే కడకు ఫలవంతములయినవి.

ధారావాహికమైన రచనతో నెంతో సంతనగా రస వంతముగా నున్న యీనవల క్లిష్టపదములు దీర్ఘసమాసములు లేక, ఉన్నతపాఠశాలావిద్యార్థులు పఠించుట కెంతయు ననుగుణముగా నున్నది.

రాజమహేంద్రవరము:<br>
విరోధి: మధుమాసము:

మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి.

# ఇచ్ఛినికుమారి

## మొదటి ప్రకరణము

### వేఁట

రాత్రి తెలతెలవాఱఁజొచ్చెను. వేఁగుఁజుక్క యను వార్తాహరునివలన దనమనోహరుఁడగు సూర్యభగవానుని రాకను విని పూర్వదిశాకాంతముఖమున వికాసము వహించెను. ఆసమాచారమును విని భయపడియే కాఁబోలును జుక్కలును, నంతవఱకును దట్టముగా వ్యాపించియున్న చీకటులును మెల్లమెల్లగా మాయ మగుచుండెను. ప్రాతఃకాలమలయమారుతములు వసంతకుసుమముల పరిమళమును వహించి దిశలను నించుచుండెను. లేమావియాకుల మెసవుటచే మదమెక్కినకోయిల సుఖముగాఁ బంచమస్వర మాలాపించుచుండెను. రాత్రించరము లగుమృగములును, బక్షులును దమతమనిలయములు చేరుకొనుచుండెను. అంతవఱకును నిద్రాగతమై నిస్తబ్ధత వహించిన ప్రాణికోటి తెలివి వహించి కలకలలాడుచుండెను. వ్యాపించియు వ్యాపింపని వెలుతురుతోను, నశించియు నశింపని చీకటితోను గూడిన

యాకసము గంగాయమునానదులుగూడిన ప్రదేశమువలె మనోహరముగా నుండెను.

ఇట్టిసమయమున ఘూర్జరదేశమున కీశాన్యదిక్కుగా నున్న మహాటవియం దిరువురుపురుషులు సంచరించుచుండిరి. వారు నఖశిఖపర్యంతమునువ్యాపించిన కవచమును దొడిగి కొనిరి. కావున వారి దేహచ్ఛాయ లెట్టివియో మనము చెప్పలేము. వారు మిక్కిలి యున్నతశరీరులు. మోపెట్టిన దృఢచాపములు వారికరములం దుండెను. వాడిబాణములు వారిరెండవచేత వెలయుచుండెను. సమున్నతము లగు నీటెలను,నతిదీర్ఘము లగు ఖడ్గములను, మఱికొన్ని మృగయాసాధనములను దాల్చి వారు చూపఱకు భీతి గొల్పుచుండిరి. ఎత్తగు చెట్లకొమ్మలందుఁ దగినతావు లేర్పఱచుకొని మృగములనిమిత్త మొక నదీతీరమున వారు గాచుకొని యుండిరి. చాపహస్తులగు నావీరులను జూచినప్పుడు సురపొన్నతరువునందుఁ బొంచియుండి సమాధినవలంబించి యున్నశంకరుని వేఁటాడనుంకించుచున్నమన్మథుఁడు మనకు స్ఫురింపకపోఁడు. కాని, యతనిబలె వీ రపాయములపాలఁ బడలేదు. అతనిబాణములవలె వీరిబాణములు వ్యర్థములుఁ గాలేదు. చక్కఁగా గుఱిచూచి ప్రయోగించిన వారిబాణములిదివఱ కొక్కొక్కటి యొక్కొక మృగమును గూల్పఁగలిగినవి. అందుచే వారు మన్మథునివలె వ్యర్థమనోరథులు కాలేదు. అయినను వారి శోకవిచారము లేకపోలేదు.

పురుషునిసాయమున నాపంది నతికష్టముతోఁ దిరుగ వేసెను. ఆబాణ మింకను దానిశరీరమును నాఁటుకొనియే యుండెను. ఆవీరుఁడు దాని నూడఁదీయవలెనని కదల్చి చూచెను. కాని, యది కదలలేదు. ఆబాణమును బ్రయోగించినవీరుని బలమున కతఁ డచ్చెరువొందెను. అతఁడు తనయావచ్ఛక్తిని వినియోగించి లాగఁబోయెను. కాని, యది యూడిరాలేదు. తాను వేసినబాణముకంటె నది యాపందిశరీరమును గాఢముగా నాఁటుకొన్నదని యావీరునకు బోధపడెను. తనబలముకంటె నావీరునిబలము హెచ్చని గ్రహించెను. అతఁ డచ్చెరుపాటుతో మరల నాబాణములపిడిని బట్టుకొని యిట్టటు కదలించి యావచ్ఛక్తిని వినియోగించి లాగెను. ఎట్టయిననేమి యాబాణ మూడివచ్చెను. అది రక్తముతోఁ దడిసియుండెను. ఆవేఁటకాఁడు సమీపమున నున్ననదిలో రక్తసిక్తములగు దనచేతులను గడిగికొని యాబాణమునుగూడఁ గడిగెను. అంత దానిపైఁ గొన్నియక్షరములు గానవచ్చెను. అతఁడాతురుఁడై వానిని జదివెను. 'ఇచ్ఛినీకుమారి' అని యున్నది. అతఁ డది చదివి యాశ్చర్యమున స్తంభించిపోయెను. మాటిమాటి కతనినోటనుండి 'ఇచ్ఛినీకుమారి' 'ఇచ్ఛినీకుమారి' అను శబ్దమే వెలువడఁ జొచ్చెను. అతఁడు రెండవవానితో 'ఓయీ! ఈబాణ మిచ్ఛినీకుమారిది. ఆమెకు విలువిద్యయందుఁగూడ మిక్కిలి నేర్పున్నట్లు తోఁచుచున్నది. ఆహా!

ఆమె యిదివఱకే సౌందర్యముచేతనే నన్ను లోఁగొన్నది. ఇప్పుడు ధనుర్విద్యచేఁగూడ వశపఱుచుకొన్నది. ఆహా! ఏమినేర్పు! ఎంతబలము! ఆమెబాణ మాపందిహృదయమును జీల్చినట్లు మన్మథుఁడు తనబాణములచే నాహృదయమును జీల్చుచున్నాఁ' డని పలికి యాబాణము నత్యాదరముతోఁ దనయొద్ద నుంచుకొనెను.

## రెండవ ప్రకరణము

---

### ఆబూగడము

హిందూదేశమున సుప్రసిద్ధిగాంచినపర్వతములలో నాబూపర్వత మొకటి. రాజపుత్రస్థానమున నుత్తరదక్షిణ దిశలకుఁ బెట్టఁబడినగోడవలె వెలయు నారావళీపర్వతమాలికలో నొకభాగమేయైనను, ఈపర్వతము కేవలము దానితోఁ జేరియుండక కొంచెము వేఱుపడియున్నది. అది రాజస్థానమునఁగల కొండలన్నిటికంటెను మిక్కిలి యున్నతమైనది దానిశిఖరములన్నిటిలోను గురుశిఖరము మిగుల నెత్తైనది. గురుశిఖరముపొడువు 5663 అడుగులు. ఆగిరియందుఁ బ్రశస్తమైన జలకుండలములును, మిగులఁ జక్కనిగుహలును, నానావిధఫలవృక్షములును గలవు. ఇట్టి సదుపాయము లుండుటచే నెల్లవారికిని వాసయోగ్యమై యానందదాయకమై యున్నది.

ఉత్తరహిందూస్థానమందలి జనులందఱు నాబూగిరిని దివ్యక్షేత్రముగాఁ బరిగణింతురు. దానియందుఁ బెక్కులు దేవాలయములు కట్టఁబడినవి. వానిలో నెల్ల నచలేశ్వరాలయము మిగుల గొప్పది. ఆయాలయము చిరకాలముక్రిందటనే కట్టఁబడినను నూతనముగా నిర్మింపఁబడినట్లు ధవళకాంతుల నీనుచు శిల్పచాతుర్యముచే వింతగొలుపుచుఁ, జూపఱకు దేవతానిర్మితమేమో యనుసందియముఁ గల్గింపక పోదు. అందలి యీశ్వరుని **ము**నికులపతియగు వసిష్ఠుండు ప్రతిష్ఠించెననియు,నా దేవుఁ డెక్కుడు మహత్త్వముగలవాఁడనియుఁ బెద్దలు చెప్పుదురు.

అచలేశ్వరాలయమునకుఁ దూర్పున నొక జలకుండము కలదు. అది తొమ్మిదివందలయడుగుల నిడివియు నిన్నూటనలువది యడుగుల వెడల్పును గల్గి సర్వదా జలపూర్ణమై యుండును. పూర్వము మహిషాసురునిచేఁ బీడితులై దేవతలు మిగుల భీతులై యీపర్వతముమీఁదికి వచ్చి యట గోళ్ళతోఁ ద్రవ్వి మఱుఁగు గావించుకొని దాఁగియుండిరఁట. నఖములచేఁ ద్రవ్వఁబడుటవలన నాజలకుండమునకు 'నఖి' యను పేరు వచ్చెను. దానినడుమభాగమునఁ జిన్నద్వీపము వంటి బండఱాయి యొకటి కలదు. దానిపై జగన్మాత యగు భవానీదేవియాలయము పూర్వకాలమున నుండెడిదఁట. కాని, యిప్పు డది పాడుపడి శిథిలము లగుగోడలు మాత్రము

మిగిలియున్నవి. ఆకుండమును గుఱించియు, నాజాతిని గుఱించియు, భవానీదేవియాలయమును గుఱించియు నొకవింతకథ చెప్పుదురు.

'పూర్వకాలమున నీపర్వతముపై వసిష్ఠమహాముని యాశ్రమ మొకదానిని గల్పించుకొని తపస్సు చేసికొనుచుండెను. అతని హోమధేను వొకనాఁ డాకుండముతీరమునఁ బచ్చికమేయుచు జాఱి దానిలోఁ బడెను. అప్పటి కాకుండములో నీరు లేదు. అగాధ మగు నాగోతిలోనుండి యాయావు వెడలి రాలేకపోయెను.

వసిష్ఠుఁడైన నాగోవునుద్ధరించుటకు సమర్థుఁడు కాక భక్తవత్సలుఁ డగు శంకరునిఁ బ్రార్థింప నతఁడు తనజటాజూటమం దున్నగంగాజలముతో నాకుండమును నిండించి యాగోవు నందుండి పైకి రప్పించెను. అందులకు వసిష్ఠుఁడు సంతసించి యాకుండమువలన మరల నెప్పుడైన నట్టియాపద సంభవించునేమో యని భయపడి యాకుండమును బూడ్చవలయునని యీశ్వరునిఁ బ్రార్థించెను. అతఁ డామునికోర్కెని దీర్చుటకై హిమవంతునికుమారులలో నొకనిఁ బిలిచి యాకుండమును బూడ్చివేయ నాజ్ఞాపింపఁగా వారిలోఁ గడగొట్టువాఁ డీశ్వరాజ్ఞను శిరసావహించి యందులో దుమికెను. కాని, వాఁడు చిన్నవాఁ డగుటచే నాకుండమును బూర్తిగాఁ గప్పలేకపోయెను. ఆచిన్నకొండయే యాకుండమున ద్వీపము

వలె వెలయుచుండెను. తాను దానిని గప్పిపుచ్చఁబ్రియత్నించియు నందుఁ గృతార్థుఁడు కాకపోవుటచే శంకరుఁడప్పని భగవత్సంకల్పితము కాదని యిఁక నాప్రయత్నమునుండి విరమించెను. అంత పార్వతి తనముద్దుతమ్ముని విడిచియుండలేక యచ్చటికి వచ్చి యీపిల్లగుట్టపై నివసించెను. సాక్షాత్పరమేశ్వరి వచ్చి యందు వెలయుటచే నది పుణ్యస్థలం బని యెంచ దేవతలును, మునులును నామె కట నాలయమును గట్టి పూజించుచుండిరి. కలి ప్రవేశించుటతోడనే దేవతలు భూమికి రాకపోవుటచేతను మునులు మాయమగుటచేతను నాయాలయము పాడయిపోయెను.

ఇట్టివింతలకు నిలయ మగుటచే జనులు వేనవేలు యాత్రార్థ మాగిరికి వచ్చుచుందురు. సంతతము జనులరాకపోకలుగల యాపర్వతముపై నెలకొని జైనులు తమతమమతమును హిందువుల కుపదేశించి తమలోఁ జేర్చుకొనుచుండిరి. అందుచే నాపర్వతమున హిందువులయాలయములే కాక, జైనమందిరములుఁ గూడఁ బెక్కులు గలవు. ఇట్లు నానావిధమందిరములతో నిండినయాపర్వత మెక్కినవారి కది లోకాంతరముగాఁ జూపట్టుచుండును.

ఆపర్వతపాదమందును, జటియలయందును బెక్కులు పల్లెలును, గ్రామములును, దుర్గములును గలవు. వానిలో నాబూగఢము మిగుల బలిష్ఠమగు దుర్గము. దానిని బరమారు వంశజులగు క్షత్రియు లేలుచుండిరి. మొదట నీక్షత్రియులు

చంద్రావతీపురమును రాజధానిగాఁ జేసికొని యాబూ రాజ్యము నేలుచుండిరి. దాని కెల్లపుడును శత్రువులరాపిడి సంభవించుచుండుటచే వారలు దానిని విడిచి శత్రువుల కభేద్యమగు నీకొండదుర్గమును రాజధానిగాఁ జేసికొని తమ రాజ్యమును బాలించుచుండిరి.

మనకథాకాలమున జైతపరమారుఁ డనురాజపుంగవుఁడు దానిఁ బాలించుచుండెను. అతఁడు మిగుల ధైర్యసాహసములు గలవాఁడు; వివేకశాలి; నిజమతమునం దెక్కుడుపట్టుదల గలవాఁడు. అతఁడు ధర్మయుక్తముగా ధరణిఁ బాలించి తొంటిరాజులకంటె నధికమగుకీర్తిఁ గాంచెను. అతని కొక కుమారుఁడును నొక కుమారియును గలరు. కుమారుని పేరు చళుకసింహుఁడు. కూఁతుపేరు ఇచ్ఛినీకుమారి. ఆమె రూపలావణ్యములం దసమానురా లని యాకాలమున వాసికెక్కినది. ఆయందమునకు వివేకమును, సుగుణసంపదయు, విద్యయుఁ దోడ్పడి వన్నెపెట్టుచుండెను. ఆమె తనయన్న యగుచళుకసింహునితోపాటు విలువిద్యఁ గూడ నభ్యసించెను. వింట బాణముసంధించి లక్ష్యమును భేదించుటయం దామెకుఁ గుదిరిననేర్పు మిక్కిలి కొనియాడఁదగినది. పర్వెత్తిపోవుమృగములను గుఱిచూచి కొట్టి చంపఁ గలదు. ఆమె యొకొక్కకమా యన్నగారితో వేఁట కరుగు నభ్యాసముగూడఁ గలదు. మిసమిసలాడుయౌవనవిలాసములచేఁ దులకించు నామెదివ్యరూపము యువజనహృదయము

లకు నిరంకుశమగు మదనబాణమువలె నొప్పుచుండెను. ఆ యువతి సుందరరూపము చేతనే కాక ధనుర్విద్యాపాటవము చేఁ గూడఁ బెక్కండ్ర రాజవీరులహృదయములను లోఁగొనెను. ఆకన్యను బెండ్లియాడి జన్మసాఫల్యముగావించుకొన రాజకుమారులు పెక్కురు ప్రయత్నించుచుండిరి.

## మూఁడవ ప్రకరణము

### చిత్రకారయువతి

శిల్పములకు మనహిందూదేశము ప్రసిద్ధిగాంచినది. చెక్కడఁపుఁబనియందును, చిత్రలేఖనమందును మన దేశము వారి కలవడిననేర్పు వేఱొకరి కలవడలేదు. శిలామయములగుద్వారబంధములందును, దేవాలయపుగోడలయందును, గోపురములందును, స్తంభములందును మనపూర్వులుచూపిన శిల్పచాతుర్య మిప్పటికిని చూపఱ కత్యాశ్చర్యమును, మహానందమును గల్గించుచున్నది. ఇందులకు దివ్యక్షేత్రములే దృష్టాంతములు. సోమనాథుని దేవాలయము, సింహాచలము, విశ్వనాథక్షేత్రము, మధుర మొదలగుపుణ్యక్షేత్రములను జూచినవారికి మనపూర్వులశిల్పచాతుర్యము తెలియకపోదు.

చెక్కడఁపుఁబనియం దెంత నేర్పు గలదో, చిత్రరచనయందుఁగూడ మనవారి కంత నేర్పుండెడిది. ఈవిషయమై

కూడఁ బుణ్యక్షేత్రములే నిదర్శనములు. ఒక్కొక క్షేత్రమం దుండినశిలావిగ్రహములను జూచిన నత్యాశ్చర్యము గొలుపకపోవు. పూర్వము రాజులకుఁ జిత్రకళయం దభిరుచి యెక్కుడుగా నుండెను. వారు స్వయముగా నేర్చుకొనుట యే కాక యంతఃపురస్త్రీలకుఁగూడ నేర్పించుచుండువారు. రాజులావిద్య నంతగా నాదరించుటచేతనే పూర్వ మది యంత యౌన్నత్యముఁ గాంచినది.

ఒకనాఁ డొకచిత్రకారయువతి కొన్ని చిత్రపటములను జేతఁబట్టుకొని కొన్ని పెట్టెలోనుంచుకొని యమ్ముకొనుటకై యాబూగడపురాజవీథినిఁబడి పోవుచుండెను. దానివయస్సు ముప్పదివత్సరములకు మించి యుండును. అయిన నది సౌందర్యమున సుంతయైనఁ గొఱంత వడలేదు. దానివాక్చాతుర్యము మృదుమధురముగా నుండెను. దానిపేరు రూపవతి. దానిఁ జూచినవా రాపేరు దానికిఁ దగు నని పలుకకపోరు. ఆయువతి చిత్రపటముల నమ్ముకొనుటకై యాపురమున కొకటిరెండుదినములక్రిందట వచ్చియుండెను. దాని కాపురమునఁ బరిచితులు లేరు.

ఆరూపవతి రాజగృహమునకుసమీపముగా నొకచోఁ గూర్చుండి యమ్ముకొనుటకై చిత్రపటములను దీసి యచ్చటివారికిఁ జూపుచుండెను. ఒక్కనిముసములోనే యాచిత్రములను జూచుటకు జనులు పెక్కురు ప్రోవైరి. ఆచిత్రములను జూచియు, నావనిత చెప్పుసరసవచనములు వినియు నచ్చటి

వారు మిగుల నానందించి యచ్చోటును గదలిపోలేకుండిరి. ఆచిత్రములను జూచుటకంటె నచ్చటికొందఱు కావనితముఖ పద్మమును జూచుటయందే మిక్కిలి యింపు జనించుచుండెను.

ఇంతలో నొక యువతి యచ్చటికి వచ్చి జనుల నొత్తి గించికొని యామెను సమీపించి "మారాజకుమారి నీచిత్ర పటముఁజూడ నభిలషించుచున్నది, రమ్ము; నాతో నంతః పురమునకు రమ్ము" అని చెప్పెను. ఆరూపవతి యందులకు సంతసించి కొనకపోయినను నెగాదిగఁజూచి యానందించు చున్న వారిచేతులలోనిపటములను లాగుకొని యాదాసితో నంతఃపురమునకుఁ బోయెను. తమయానందమునకు భంగము గల్గించినయాదాసిని దిట్టనివా రచ్చట నొక్కరును లేరు.

రూపవతి యాదాసిని వెంబడించి పెక్కుమందిరము లను గడచి పోయిపోయి శుద్ధాంతమును బ్రవేశించెను. ఆభవనము స్ఫటికశిలానిర్మితమై యెటుచూచిన నతిమనో హరమై యద్దమువలెఁ దళతళలాడుచుండెను. అందొక విశాల మండపమున రాజకుమారి సఖులతోఁ గూర్చుండియుండెను. చుక్కలనడుమ బాలచంద్రరేఖవలెఁ బొలుపాఱుచున్న యా రాజకుమారినిఁ జూచి భూమి కవతరించినదేవకాంతయేమో యని రూపవతి భ్రమింపకపోలేదు. అది పెక్కండ్ర నంతః పురస్త్రీలను జూచియుండెనుగాని యీరాజకుమారియంత సౌందర్యవతిని జూచియుండలేదు. ఒకమా ఱామెయందమును గన్నులారఁ జూచి రూపవతి యామెకు నమస్కారముచేసి

తనపెట్టె నచ్చట దింపెను. తోడనే చెలికత్తెలందఱు నా యువతినిఁ జుట్టుముట్టి యాచిత్రములను జూచుచుండిరి. ఇచ్ఛినీకుమారి కొన్నిపటములు చూచి దానితోఁ 'ప్రస్తుతము భూపాలనముఁ జేయుచున్న రాజులపటములు లేవా?' అని ప్రశ్నించెను.

రూపవతి 'అమ్మా! లేకేమి, ఉన్నవి' అని కొన్ని పటములుదీసి యామెచేతి కిచ్చెను. ఆరాజకుమారి వాని నెల్లఁ బరిశీలించెను. వానిలో నొకటి దానికిఁ జూపి 'యువతీ! ఈపట మెవ్వరిది' అని యడిగెను.

రూ—అమ్మా! సకలరాజకులాలంకారుఁడై, శత్రుభయంకరుఁడై, మహామహుఁడై ఘూర్జరదేశమును బాలించుచున్న చాళుక్యభీమదేవునిపట మిది.

ఇచ్ఛి—భీమదేవుఁ డితఁడా! ఇతని రూపమునకును, పేరునకును మిక్కిలి తగియున్నది. కాని, యువతీ! ఇతని నంతగాఁ బొగడుచున్నావు? ఇట్లు పొగడుమని యారాజు నీ కేమయిన నిచ్చెనా యేమి?

రూ—అమ్మా! ఇచ్చెడిదేమి? మహామహు లందఱును బొగడఁదగినవారే కదా? నే నతనిగుఱించి చెప్పినది వాస్తవకథనమే కాని యతిశయోక్తి యేమియును లేదు.

ఇచ్ఛి—అతిశయోక్తి యేమియును లేదా? పోనిమ్మా, దాని కేమి! కాని, పృథ్వీరాజుచిత్రపట మున్నదా?

రూ—ఉండెడివి. కాని, యవియన్నియు నమ్మఁబడినవి.

ఇచ్ఛ—అతని(గూర్చి నీ కేమయినను దెలియునా ?

రూ— తెలియ కేమి! కొంతకాలముక్రిందట నే చాళుక్య భీమదేవునకును, బృథ్వీరాజుజనకుఁడగు సోమేశ్వరునకును ఘోరయుద్ధము సంభవించెను. అందు భీముఁడు సోమేశ్వరుని జయించి విఖ్యా—

ఇచ్ఛ—యువతీ ! ఆ వృత్త మెందులకు ? దానివలన భీమదేవుఁడు సర్వాధికుఁ డని స్థాపింపఁబూనుచుంటివా ? ఈ మాటు భీమునియందు నీకుఁగల పక్షపాతము వెల్లడి యగుచున్నది. అంతమాత్రముచే నాతనికి వచ్చినమహత్త్వ మేమి ? తదితరులకుఁ గల్గిననీచత యేమి ? పృథ్వీరాజవృత్తము దెలియునా యని యడుగ ననవసరవృత్తాంతము తెచ్చి మాటాడెద వేల ?

రూ—అమ్మా! క్షమింపుము, నాయుద్దేశ మదికాదు. పృథ్వీరాజుతండ్రిని గూడ నెఱుఁగుదు నని చెప్పుటకు నా వృత్తమును ద్రవ్వితిని. అంతకుఁ దప్ప వేఱులేదు. పృథ్వీరాజుగూడ మహాత్ముఁ డనియె వినుచున్నాను.

ఇచ్ఛ—ఇంకను బక్షపాతబుద్ధిని వదలకున్నావు. భీముని పృథ్వీరాజుతో సమానునిగాఁ జేయ నెంచుచున్నావు? పోనిమ్ము, పృథ్వీరాజుప్రతిమను వ్రాయఁగలవా ?

రూ—అమ్మా! చిత్రలేఖనమందు నాకు మంచి నేర్పున్నది. సెలవయిన చో వ్రాసెదను.

ఇచ్ఛి—వ్రాయుము, తప్పక వ్రాయుము. అందులకుఁ దగిన బహుమతి నీ కీయకపోను.

అది విని రూపవతి యానందించుచుఁ దన పెట్టెలో నున్న రంగులను, కుంచికలను దీసి యొక ప్రతిమను వ్రాసి యామెకుఁ జూపెను. ఇచ్ఛిని దానిని బరిశీలించి (మందహాసము చేయుచు) "ఓయువతీ! భీమదేవునిచిత్రము వ్రాయుట యందుఁ జూపినంతచాతుర్యము నీచేయి వేఱొక చిత్రరచన యందుఁ జూపలే" దని తలంచెదను.

రూ—ఏమమ్మా! అట్లనుచున్నారు.

ఇచ్ఛి—ఏమియును లేదు. ఆపృథ్వీరాజుపోలిక సరిగా నిందు లేదు. మఱియు రచనకూడ నంత యందముగా లేదు. నీవు వ్రాయఁగలిగియు దీనినిఁ బాడుచేసితివేమో యని నా యనుమానము.

రూ—అమ్మా! మీ రట్లనుట ధర్మమా! నాచాతుర్యమును జూపి మీయనుగ్రహమును సంపాదించుకొని బ్రదుకవలెనని యున్నదాన నిట్లు చేయుదునా? పృథ్వీరాజునాకారము సరిగా మనస్సునకుఁ బట్టకపోవుటచే నట్లు వ్రాసితిని. అంతియకాని వేఱుగాదు.

ఇచ్ఛి—పోనిమ్మా!, పృథ్వీరాజుప్రతిమ నాయొద్ద నున్నది. దానిఁ జూచి సరిగా వ్రాయుదువా?

రూ—వ్రాసెదను.

ఇచ్ఛినీకుమారి యొకచెలికత్తెచేఁ దనపడకటింటిలో నున్న పృథ్వీరాజుపటమును దెచ్చి రూపవతి కిచ్చెను. ఆయువతి దాని నిదానించి చూచి చిత్రపటము వ్రాయ మొదలిడెను. అది తనచాతుర్యమంతయు నాచిత్రమునఁ జూపెను. ఆపటమును జూచి యిచ్ఛినీకుమారి మిగుల సంతసించి దానికిఁ దగినబహుమాన మిచ్చి 'ఓయువతీ! నీనేర్పు మిగులఁ గొనియాడఁ దగియున్నది. నీవలన నీచిత్రలేఖనవిద్య నేర్చుకొనవలె నని యున్నాను. నీవు నేర్పుదువా?' అని యడిగెను.

రూ—అమ్మా! అందుల కభ్యంతర మేమి? అంత కంటె నాకుఁ గావలసిన దేమున్నది?

ఇచ్ఛి—'సంతోషమే! ఇందులకు మాజనకునియనుమతి వడయవలెను. మఱియొకమారు నా కగపడుము.' అని చెప్పి దానిని బంపివేసెను.

## నాల్గవ ప్రకరణము

## దేశచరిత్రము

హిందూదేశమునఁ బడమటి సముద్రతీరమునందు ఘూర్జర మనుదేశము గలదు. దానినే యిప్పుడు గుజరాతని పిలుచుచున్నాము. క్రీ. శ. ౫ వ శతాబ్దప్రారంభమున వల్లభీపురమును రాజధానిగాఁ జేసికొని శిలాదిత్యుఁ డను రా

జా దేశమును బాలించుచుండినట్లు జైనమతగురువులు వ్రాసిన వ్రాఁతలవలనఁ దెలియవచ్చుచున్నది. అతఁడు మహాపరాక్రమవంతుఁడు. యుద్ధములందు మిగుల సమర్థుఁడు. అతఁడు సూర్యు నారాధించి యతనివలన నొకఖడ్గమును బడసి చిరకాలమునుండి యాదేశమున నివసించియున్న యాటవికలను బాఱఁదోలి రాజ్యము స్థాపించి పాలింపనారంభించెను. కొన్నియేండ్లు గడచెను. ఇట్లుండ మహాధనసంపన్నుఁ డగు 'రంకు' అను వర్తకునితో నమ్మహారాజునకు విరోధము సంభవించెను. ఆవర్తకుఁడు మిగులఁ బట్టుదల గలవాఁడు. అతఁడు తనపగ దీర్చుకొనుటకై శిలాదిత్యునకుఁ బూర్వవిరోధులగు నాటవికులతో స్నేహముచేసి వారికిఁ గోరినంత ధన మిచ్చి వల్లభీపురమును ధ్వంసముగావింపఁ బురికొల్పెను. వారును మహానందమొంది తమపగను దీర్చుకొనుటకై వల్లభీపురముపై గవిసిరి. శిలాదిత్యుఁ డది విని ధీరుఁడై తనసైన్యములను గూర్చుకొని వారి నెదిరించెను. కాని, దైవము ప్రతికూలమైనందున నతనికి జయ మబ్బలేదు. ఆయుద్ధమందే యతఁడు వీరమరణముఁ జెందెను. అతనికి సంతానము లేనందున నతనితోఁ దద్వంశ మంతరించెను.

అనంతరము రమారమి రెండుశతాబ్దములకాలము గుజరాతును బాలించువా రెవ్వరో మనము స్పష్టముగాఁ జెప్పఁజాలము. అందులకుఁ దగినయాధారములు లేవు. కాని, యేడవ శతాబ్దాంతమునఁ జోరవంశజుఁ డగుజయశేఖరుఁ

డా దేశము నేలుచుండినట్లు చరిత్రవలనఁ దెలియవచ్చుచున్నది. ఆరాజు మిగుల శూరుఁడు, విద్వాంసుఁడు, రాజనీతియందాఱితేఱినవాఁడు. పంచాసర మనుపట్టణ మతనికి రాజధాని. అతనిభార్య రూపసుందరి. అతనిబావమఱఁది శూరపాలుఁడను మహాశూరుఁడు. ఆతఁడు మహావైభవముతో ఘూర్జరమును బాలించుచుండ నాకాలమున కలియాపురమును బాలించువాఁడును, చాళుక్యవంశసంభవుఁడును నగుభూవరరాజు జయశేఖరునికీర్తి విని యతని జయింపఁదలంపుతో సైన్యములను జేర్చుకొని గుజరాతుపై దాడివెడలెను. జయశేఖరుఁడది విని సుంతేనియు జంకక శూరపాలునికిఁ గొంతసైన్యమిచ్చి భూవరుని నెదిరింపఁ బంపెను. ఆరెండు సైన్యములు నాబూపర్వతముయొద్దఁ గలసికొనెను. ఘోరయుద్ధము జరిగెను. ఆయుద్ధమున శూరపాలుఁడే జయమందెను. భూవరుఁడు పరాభూతుఁడై తనపురమునకు మరలిపోయెను.

రెండువత్సరములు గడచినపిమ్మట భూవరుఁడు వెనుకటిపరాభవమును దీర్చుకొననెంచి మహాసైన్యముతో వెడలి జయశేఖరుని రాజధాని యగుపంచాసరమును ముట్టడించెను. మహాసముద్రమువంటి శత్రుసైన్యమును జూచి జయముగల్గుట దుర్లభ మని నిశ్చయించి గర్భవతి యగుతన భార్యను శూరపాలుని కప్పగించి పురము వెడలిపొమ్మని యాజ్ఞాపించి జయశేఖరుఁడు శత్రువులతో వీరస్వర్గముఁ గాంచెను. అతనిరాజ్యము భూవరునికి వశమయ్యెను.

యుద్ధారంభమునకుఁబూర్వమే శూరపాలుఁడు తన సోదరిని దీసికొని యొకయరణ్యముఁ జేరెను. ఆయరణ్యమందే యామెకు గుమారుఁ డుదయించెను. వనమందుఁ బుట్టుటచే నాబాలునికి వనరాజని పేరు గల్గెను. ఆతఁడు క్రమముగాఁ బెద్దవాఁడై తండ్రివలె మహాశూరుఁ డయ్యెను. అతఁడు తండ్రి రాజ్యమును స్వాధీనము గావించుకొన నెంచి మేనమామతోఁ గూడి సమీపగ్రామములను గొల్లఁగొట్టి దానివలనఁ దగినంత ధన మార్జించి భిల్లసైన్యములను జేర్చుకొని భూవరుని జయించి తఱిమి గుజరాతును వశపఱుచుకొనెను. పూర్వపురాజధాని యగు పంచాసరము పాడుపడినందున దానిని విడిచి యతఁడు సరస్వతీనదీతీరమున విశాలసమప్రదేశమున నొకపురముఁ గట్టించెను. తనచిన్నతనమున వనవాసదినములలో 'అన్హిలుఁ' డను నొకజైనగురువు తన్నును, తనతల్లిని మిక్కిలి ప్రేమించి కాపాడినందున నాయుపకారమును మఱవక వనరాజు తాను గట్టించినపట్టణమున కాజైనునిపేర 'అన్హిలపుర' మని పేరు పెట్టెను. అదియే ఘూర్జరదేశమునకుఁ జిరకాలము రాజధానియై యొప్పెను. వనరాజు క్రీ. శ. 746 వ యేఁట గుజరాతుసింహాసనము నెక్కి యఱువదిసంవత్సరములు ప్రజలఁ బాలించి క్రీ. శ. 806 లోఁ గాలధర్మమునొందెను. అతని యనంతరమున యుగరాజును, క్షేమరాజును, భూయాడుఁడును, వీరసింహుఁడును, రత్నాదిత్యుఁడును, సామంతసింహుఁడును క్రమముగా నన్హిలపురసింహాసనమునఁ గూర్చుండి

గుజరాతును బాలించిరి. సామంతసింహునకు సంతతి లేదు. కాని, లీలాదేవి యను తోఁబుట్టువు మాత్రము కలదు. అతఁడామెను కలియాపురమును బాలించు భూవనాదిత్యునికుమారుని కిచ్చి పెండ్లిగావించెను. ఆదంపతుల కొక కుమారుఁడు పుట్టెను. అతని పేరు మూలరాజు. సామంతసింహునితోఁ జోరవంశ మంతరించుటచేఁ దల్లిమూలముగా నన్హిలపుర రాజ్యము మూలరాజువశ మయ్యెను. అతఁడు క్రీ. శ. 942 వ యేఁట రాజ్యభారము వహించి 997 వ వత్సరమువఱకును గుజరాతును బరిపాలించెను. గుజరాతును బాలించిన చాళుక్య వంశరాజులలో నితఁడే మొదటివాఁడు. మూలరాజునసంతరమున చాముండరాయఁడును, దుర్లభరాజును నన్హిలపురమునకుఁ బ్రభువు లైరి. దుర్లభరాజు సంతానహీనుఁ డగుటచే నతనితమ్మునికుమారుఁడగు భీమదేవుఁడు ఘూర్జరదేశప్రభు వయ్యెను. చాళుక్యవంశజులలో నీభీమదేవుఁడు మిగుల విఖ్యాతి గాంచిన మహాశూరుఁడు. మహమ్మద్గజనీ సోమనాథక్షేత్రమును ముట్టడించినప్పుడీమహావీరుఁడు సైన్యసమేతుఁడై పోయి గజనీని మార్గ్కాని ఘోరయుద్ధముచేసి యతనినోడించి తఱిమివేసెను. దానితో నతనికీర్తి యుత్తరహిందూస్థానమందంతటను వ్యాపించెను. అతఁడు 'ఉదయమతి' యనుయువతిని బెండ్లాడెను. ఆదంపతులకుఁ గరుణరాజుదయించెను. అతఁడు క్రీ. శ. 1072 మొదలుకొని 1094 వ సంవత్సరము దాఁకఁ బరిపాలించెను. అతఁడు కర్ణాటదేశపురాజగు జయకక్షికూఁతును 'మీన

దేవిని' పెండ్లియాడి యామెయందు సిద్ధిరాజనుకుమారునిఁ గనియెను. అతఁడే తండ్రియనంతరము ఘూర్జరదేశమునకు రాజయ్యెను. అతఁడు మిగుల బలశాలి, శూరుఁడు. అతఁడు తనపై దండెత్తివచ్చిన మాలవదేశరాజగుయశోవర్మ నోడించెను. మఱియు సూరతుపైకిఁ బలుసారులు దాడివెడలి దాని జయించి తన రాజ్యమునఁ గలుపుకొనెను. అతనికి సంతానము లేనందున త్రిభువనపాలునికుమారుఁడగు కుమారపాలుఁడు గుజరాతునకుఁ బ్రభు వయ్యెను. ఆత్రిభువనపాలుఁడు పెఱవాఁడు కాఁడు. అన్హిలపురమును బాలించిన భీమదేవునకు నకులాదేవియనెడి వేఱొకభార్యయందుఁ గల్గిన క్షేమరాజునకు మనుమఁడు. కుమారపాలుఁడు క్రీ. శ. 1143 వ వత్సరమున ఘూర్జరసింహాసనమెక్కి 1174 వ యేఁటివఱకును నిరంకుశముగాఁ బాలించి కీర్తిఁగాంచెను. అతఁడు మిగుల యుద్ధప్రియుఁడు. పెక్కండ్రితో యుద్ధముచేసి జయలక్ష్మిని వరించెను. అతఁ డొనర్చినయుద్ధము లన్నిటిలోను గొంకణదేశాధిపతియగు మల్లికార్జునునితోఁ జేసినది మిగుల భయంకరమైనది. కుమారపాలునకు సంతతి లేదు. కాని, కీర్తిపాలుఁడు మహీపాలుఁడు నను నిరువురు సోదరులు గలరు. వారిలో మహీపాలునికుమారుఁడగు జయపాలుఁడు కుమారపాలునసంతరమున నన్హిలపురరాజ్యమున కధీశుఁ డయ్యెను. అతఁ డొనర్చినఘనకార్యము లేమియును లేవు. అతనియనంతరమునఁ దత్కుమారుఁడు రెండవ మూలరాజు గుజరాతును బాలిం

చెను. అతఁడు సంతానహీనుఁ డగుటచే నతనితరువాత నతని పినతండ్రియగు రెండవ భీమదేవుఁడు ఘూర్జరమునకు రాజయ్యెను. ఇతఁడు గుజరాతును బాలించిన చాళుక్యవంశజులందఱిలోను మిక్కిలి ప్రసిద్ధిగాంచెను. ఇతనినే భోలాభీముఁడని కూడఁ బిలుచుచుందురు.

## అయిదవ ప్రకరణము

### భీమదేవుఁడు

అన్హిలపురమును బాలించిన కుమారపాలునికి మహీపాలుఁ డను తమ్ముఁడు గలఁడు. అతనికి జయపాలుఁడు, భీమదేవుఁడు నను నిరువురు కుమారు లుండిరి. వారిలోఁ బెద్దవాఁడగు జయపాలుఁడు రాజయ్యెను. అతనికి నాయకీదేవియందొక కుమారుఁ డుదయించెను. అతఁడు రెండవ మూలరాజను పేరుతో నన్హిలమును బాలించెను. అతఁ డసంతానుఁడగుటచేతను, దుర్బలుఁ డగుటచేతను, నతనిపినతండ్రియగు భీమదేవుఁడు వదినెగారియనుమతిచొప్పున రాజకీయవ్యవహారములందును, యుద్ధములందును మూలరాజునకు సాయమొనర్చుచుఁ గ్రమముగా నధికారమంతయుఁ దానే వహించి మూలరాజు నొకమూలకుఁ ద్రోచి యన్హిలమును స్వతంత్రముగా నేలఁజొచ్చెను. అతఁడు పరాక్రమవంతుఁడును, మాటచెల్లుబడిగలవాఁడు నగుటచే నతఁడుచేసిన యీయన్యా

యమును దిద్దకపోవుటయే కాక మంత్రిలును, సామంతు లును, ప్రజలును నతనిప్రభుత్వమున కంగీకరించిరి.

భీమదేవునిపరాక్రమము సాధారణమైనది కాదు. అతని పట్టుదలయు సామాన్యమైనది కాదు. అతఁ డారంభించినపనులు తుదముట్టువఱకు మిక్కిలి దీక్షతోఁ జేయును. అతనియధికారము నిరాటంకముగా సాగుచుండెడిది. అతని ప్రభావము కొనియాడఁదగినది. ఒకప్పుడు మాళవరాజయిన సహదేవుఁడు తనపై దండెత్తిరాఁగా నది విని భీమదేవుఁ డతని కిట్లు వార్తపంపెను. 'ఓరాజా! నీవు సూర్యవంశజుఁడవు. మీవంశకర్తయగు సూర్యునివలె మీరును దూర్పుదిక్కునమాత్రమె ప్రకాశింతురు. పడమట నట్లు ప్రకాశించుట పొసఁగదు. తుదకు నాశమే సంభవించును.'

భయపఱుచుచు నిట్లు పంపినవార్తకు మాళవరాజును, నతనికుమారుఁ డర్జునదేవును మిగుల క్రుద్ధులై భీమదేవుని రాజ్యమును ధ్వంసముచేయనారంభించిరి. భీమదేవుం డందులకు మిక్కిలి కినిసి సైన్యసమేతుఁడై పోయి వారలను జయించి తఱిమివేసెను.

ఒకప్పుడు భీమదేవునిప్రఖ్యాతి విని శహాబుద్దీనుఘోరి సముద్రమువంటిమహాసైన్యమును వెంటఁబెట్టుకొని భీముని జయించి గుజరాతును నోటవేసికొనవలె నని యువ్విళ్లూరుచు వచ్చి యుద్ధమునకుఁ దలపడెను. అందులకు భీముండించుకేనియుఁ జంకక చతురంగబలములను గూర్చుకొని

పోయి ఘోరీని జయించి పాఱఁద్రోలెను. ఈసంతతవిజయములచే ఘూర్జరరాజ్యము మధ్యందినసూర్యమండలమువలె శత్రువులచూపులకు దుస్సహమై యాకాలమున నుత్తర హిందూస్థానమునఁ బ్రసిద్ధికెక్కిన రాజ్యములలో నొక్కటియై పరఁగుచుండెను. అన్హిలపురమున కితనికాలమున వచ్చి నంతయశము మఱెవ్వ డెవ్వరికాలములందును సంభవింపక పోవుటచే నితనికి 'అన్హిలపురభూషణ'మని బిరుదము కల్గెను.

భీముఁడు జైనమతమం దెక్కుడభిమానముగల్గి పెక్కురు జైనగురువుల కాశ్రయమిచ్చి తనరాజ్యమున నామతము నభివర్ధించుటకు మిగులఁ బాటుపడెను. అయినను హిందువులనుగాని, తన్మతమునుగాని ద్వేషింపలేదు. ఆజైనులలో నమరసింహుఁ డీభీమరాజునకుఁ జెలియై, గురువై, చుట్టమై, సేవకుఁడై, సర్వకార్యములందును బాసటయై తోడునీడవలె వర్తించుచుండెను. అతఁడు మిగుల బుద్ధిశాలి. మాయోపాయములందును, మంత్రతంత్రములందును, నోషధులందును గడునేర్పరి. ఇన్నిగుణములుగలవాఁ డగుటచేతనే భీముఁ డతనిఁ బ్రాణపదముగాఁ జూచుకొనుచు నొకక్షణమైనను విడువలేకుండెను.

భీమదేవుఁ డొకనాఁ డొకదివ్యమందిరమున నొంటిగాఁ గూర్చుండెను. మలయమారుతములు ప్రసరించి మిగుల హాయిని గల్గించుచుండెను. ఏమూలఁ జూచినను నతిమనోహరములగువస్తువులు కంటఁబడి హృదయమున కానందము

గొలుపుచుండెను. కాని, యతఁ డట్టియానంద మనుభవించు చున్నట్టు లేదు. కాంతిరహితమగు ముఖమును వామహస్త మునఁ జేర్చి యతఁడు దీర్ఘాలోచనపరుఁడై మాటిమాటికిని వేఁడినిట్టూర్పులు పుచ్చుచుండెను. ఇది పరిశీలింప నతఁ డేదో భరింపరాని వేదనలకుఁ బాలయియుండె నని తోఁపకపోదు. అతఁ డట్లే కొంచెముసేపు గూర్చుండి చటాలున లేచి ప్రక్క గదిలోనికిఁ బోయి యొకవస్తువును గొనివచ్చి దానినే సదా నిదానించి చూచుచుండెను. ఆసమయమున నతఁ డెఱుఁగ కుండఁగనే యతనినోటనుండి 'ఆహా ! ఇచ్ఛినీ ! నీయాయుధ చాతుర్యము నెట్లు మఱతును ? నీగుణము లెంతని వర్ణింతును ? విలువిద్యయందు రెండవ సత్యభామ వగు నీ వేవీరుని హృదయమును గలంపఁజాలవు?' అనుమాటలు వెడలివచ్చెను. అతఁ డాబాణమునే యెగాదిగ చూచుచు నానందించుచుండెను. విరహులకుఁ దమప్రియురాండ్రవస్తువులు వినోదపాత్రములగుటచే నతని కాబాణమే దుస్సహమగుకాలమును బుచ్చుటకొక సాధన మయ్యెను.

అతఁ డట్లు వినోదించుచుండఁగా నమరసింహుఁ డచటఁ బ్రత్యక్ష మయ్యెను. భీమదేవుఁ డతనిఁ జూచి యుచితాసనమునఁ గూర్చుండ నియమించి యిట్లు సంభాషించెను.

భీమ—అమరసింహా ! మనకార్య మేమగునో యని విచారించుచున్నాను.

అమ—దేవా! ఈస్వల్పకార్యమునకుఁ దమ రింత విచారింపనేల? ఆయువతికిఁ దమయం దనురాగము గల్గింప నొకతె నిదివఱకే పుచ్చియుంటిమికదా! ఆమె యాయుచ్చిని ప్రోలఁ దమగుణములను వర్ణించి తదీయమానసమును మీ యం దీపాటికే లగ్నముగావించియుండును. మీయభిప్రాయ మును బరమారునకుఁ దెలిసినచో నధికానందభరితుఁడై తమ కిచ్చి పెండ్లిచేయును. పరమారునకుఁ దమవంటివాఁ డల్లుఁ డగుట మహాభాగ్యము గదా!

భీమ—నీ వన్నదానియందుఁ జాలవఱకు సత్య మున్నది. కాని, యారాజు జైనమతమును ద్వేషించును. జైనమతావలంబి నగునా కాకన్యక నతఁడు సంతోషపూర్వ కముగా నెప్పటికి నీయఁడు.

అమ—దేవా! తమ రిట్లమాయికముగా మాటా డెదరేల! మీ పేరు విని గడగడలాడనిరాజవీరుఁ డీయుత్తర హిందూస్థానమున నెవఁ డున్నాఁడు? తమకోరి,— నేరాజు విఫలముగాఁ జేయఁజాలును? ఒకవేళ నీపరమారుఁ డట్టి సాహసమునకే పూనికొనినచో దండోపాయముచేతనే కార్యము సాధించుకొనవచ్చును.

భీమ— ముందుగా జైతపరమారుని యభిప్రాయ మెఱిఁగి వచ్చుట మనకుఁ గర్తవ్యముకాదా?

అమ—అవును, దేవర సెలవిచ్చినది సత్యమే!

భీమ—అట్లయిన నీవె యాబూదుర్గమునకుఁ బోయి రావలయును.

అమ—దేవరయాజ్ఞచొప్పున నట్లే పోయెదను.

భీమ—నీవు పరమారుని దర్శించి మొదట సామము తోనే మాటాడుము. నే నతనికుమారిని గోరుచున్నా నని చెప్పుము. తరువాత నాసంబంధమునందుఁగలగొప్పతనమును వర్ణింపుము. అంగీకరించినసరియే! లేకున్న, రెండునిముసముల లోనే యాబూగడము నామావశేషమగు నని చెప్పుము.

అమ—రాజేంద్రా! అట్లే చేసెదను. తమరు నాకు మాటలు నేర్పవలెనా? ఈకార్య మెట్లయిన సాధింపఁగలనను నమ్మకము నా కున్నది.

అని చెప్పి యారాజుసెలవు గైకొని యప్పుడే యాబూగడమునకుఁ బోయెను.

## ఆ ఱ వ ప్రి క ర ణ ము

## అ భ య సిం గు

ఆబూగడమున నభయసింగ నెడి రాజకుమారుఁ డొకఁ డుండెను. అతఁడు జైతపరమారుని చెల్లెలికొడుకు. అతఁడు చిన్నప్పటినుండియు నాబూగడమున నే పెరిఁగెను. పరమారుఁడు తనసోదరియందలి ప్రేమాతిశయములను బురస్కరించుకొని యభయసింగు నెక్కువగా నాదరించి తనపుత్రీపుత్రులతో సమానముగా నభివర్ధించెను. అభయసింగును మేనమామ యందు మిగుల భయభక్తులు గలవాఁడై మెలఁగుచుండెను.

అతఁడిప్పుడిరువదియైదేండ్ల ప్రాయముగలవాఁడు. చళుక సింహునికంటె రెండుమూఁడేండ్లు మాత్రమే పెద్ద. కావునఁ, జళుకసింహాభయసింహులును, నిచ్ఛినీకుమారియుఁ గలసి చిన్నప్పు డొక్కచోటనే యుండి చదువుకొనిరి. నిద్రించు నప్పుడు తప్పఁ దదితరకాలమం దెల్లప్పు డాముువ్వురును గలసి వర్తించుచుండెడివారు. అస్త్రవిద్యాభ్యాసమునందుఁ గూడ వారు ముువ్వురును సహాధ్యాయులే! వారు క్రమముగా యౌవనవంతులై మహావీరు లైరి. ఇచ్ఛినీకుమారి యౌవన మంకురించినతోడనే వెనుకటివలె నలువురకంటనుబడక యంతఃపురముననే వర్తించుచుండెను.

యౌవనవంతుఁడై, మహావీరుఁడై, యఖిలవిద్యానిపుణుఁడై, యన్నికార్యములందుఁ దనకు సహాయుఁడై వర్తించు నభయసింగును జూచి పరమారుఁడు మిగులఁ బ్రేమించి యతనికి సేనానాయకపదవి నొసంగుటయే కాక యాంతరంగిక కార్యములం దతనియాలోచనముఁగూడ గైకొనుచుండెను. ఆమహారా జతని నెక్కుడుగా గౌరవించుటచే దుర్గములోని వారుగూడ నతనియందు గౌరవబుద్ధితోనే మెలఁగుచుండిరి.

ఇరువదియైదేండ్లప్రాయము వచ్చినను నభయసింగింకను బెండ్లిచేసికొనలేదు. ఇంతకుఁబూర్వమందే యతనికి వివాహేచ్ఛ యంకురించెను గాని కొన్నికారణములచేఁ దత్ప్రయత్నము మానివేసెను. అతఁడు చిన్నప్పటినుండియు నిచ్ఛినీకుమారితోఁగూడి చదివినవాఁ డగుటచే నామెసుగు

ణములకును, మునీంద్రులకైన మోహముపుట్టింపఁజాలు దివ్య రూపమునకును, సామాన్యవీరులకు లభింపని యస్త్రవిద్యకును బట్టుపడి క్రమముగాఁ దనచిత్తము నామెయందు లయింపఁ జేసెను. యౌవనవతియైనపిమ్మట నిచ్ఛినితో నతనికి సంబంధము లేకపోవుటచే నామెగుణస్వభావము లెట్లుండెనో యెఱుఁగకపోయెను. చిన్నతనమం దామె చూపుచున్న ప్రేమాతిశయమును దలంచుకొన్నపు డభయసింగునకుఁ దన కోర్కి ఫలించు నన్నదృఢవిశ్వాస మంకురింపకపోలేదు, తన మేనమామ చూపుచున్న గౌరవాదరములచే నతనియాశ మఱింత వృద్ధిచెందెను. తా నుత్తమవంశజుఁ డగుటచేతను, రాజునకు మేనల్లుఁ డగుటచేతను నారాజపుత్త్రి నభయసింగపేక్షించుట యన్యాయము కాదు. ఇట్టి యసాధారణకారణములచే నిచ్ఛినీకుమారిని వరింపవలె నన్నతలం పతని కధికమై యుండెను. కాని, తా నావిషయమును దన మేనమామకెఱింగించుట యయుక్తముకాదా! చిన్నప్పటినుండియుఁ దన గుణస్వభావము లెఱిఁగిన రాజునకుఁ దన్నుఁ దా నెఱింగింప వలసినయవసర మభయసింగునకు లేదు. కావున, నిచ్ఛిని యందుఁ గొండంతాస గలవాఁడైనను దానిని మనస్సులోనే యిఱికించుకొని పైసంబంధములనుగుఱించి ప్రయత్నములను మానివేసెను.

ప్రస్తుతమున నిచ్ఛినీరూపము తనకంటఁ బడకపోయినను చిన్నప్పుడు తనహృదయమునఁ బదిలపఱచుకొనియున్న

యాసుందరిరూపమును మాటిమాటికిని జూచుచు నిట్టూర్పులు పుచ్చుచుఁ గాలము గడపుచుండెను. కాని, యతఁ డెంతకాల మట్లు గడపఁగలఁడు? ఆసుందరిని వివాహమాడవలెనన్న కోర్కి- యగ్నిహోత్రితుల్యమై హృదయకుహరమును దహించుచుండ నెట్లు లోర్చియుండఁగలఁడు? కావున, నతఁ డూరకుండక యిచ్చినియభిప్రాయ మెట్లున్నదో, యామెజనకుఁ డామె నెవ్వరి కీయఁదలంచుచున్నాఁడో మొదలగుసమాచారములు తెలిసికొనవలెనని యెంచి యిచ్చిని యతఃపురమున వర్తించు దాసీజనముతో స్నేహముచేయుచు వారికిఁ దగిన బహుమతు లిచ్చుచు, వారి నొకపరిఁ దనయింటికి రప్పించుకొనుచు, మఱియొకపరి రాత్రిసమయములందుఁ దానే వారి యిండ్లకుఁ బోవుచు నీవిధమునఁ గాలము గడపుచుండెను.

ఒకనాఁ డభయసింగు నిశాసమయమున నొక యువతి యింటి కరిగెను. ఆమెయు నతని నుచితరీతుల గౌరవించి యాసనమునఁ గూర్చుండఁజేసి 'అయ్యా! మీ రెన్నోసారులు నాగృహంబునకు వచ్చినారు. మీవంటివారు మాయింటికి వచ్చుటచే మాయిల్లు పవిత్రస్థల మగుచున్నది. మేమును కృతార్థుల మగుచున్నాము. ఇందువలన నాకు మితిమీఱిన యానందము గల్గుచున్నది. కాని, మీ రిట్లు దయచేయుచుండుటకుఁ గారణ మరయ నేరక యాకులపడుచున్నాను. మున్ముందుగా మీ రాయాకులపాటును దొలఁగింపఁగోరుచున్నాను.' అని పలికెను.

అభయసింగందుల కానందించి రూపవతీ! నీవంటి బుద్ధిమంతురాలును, నుచితజ్ఞురాలును వేఱొకతి యుండదు. నీచిత్రలేఖనాచాతుర్యముగూడ మిగులఁ గొనియాడఁదగినది. కన్యాంతఃపురమున నీకున్నచనవు మఱియెవ్వరికిని లేదు. రాజపుత్రిగూడ నిన్ను బహిఃప్రాణముగాఁ జూచుకొనును. ఇంతస్వల్పకాలములోనే రాజకులమునందు నీవింత గౌరవ మార్జించుటకు నీగుణసంపత్తియే కాక వేఱుకారణ మేమి కలదు?

రూ—అయ్యా! నే నంత పొగడఁదగినదానను గాను. ఇఁక నాప్రసంగము విడిచి మీరు వచ్చినపనియేమో తెలియఁ జెప్పుఁడు.

అభ—యువతీ! ఏమియును లేదు. మీయంతఃపుర మునఁగల విశేషములను దెలిసికొనవచ్చితిని.

రూ—రాజపుత్రా! చెప్పఁదగినవిశేషము లేమి యును లేవు.

అభ—సుందరీ! నీవు మిగుల మంచిదానవు. నా కార్యమును నెఱవేర్పఁదగినశక్తి నీకుఁ దప్ప మఱియెవ్వరికిని లేదు. నాకు రెండవహృదయమువంటిదాన వగునీకు నారహస్యములు వెల్లడించిన నేమిచిక్కులు సంభవించును? కావున, నామనస్సునఁగలదంతయు వెడలఁబోసెదను వినుము. నేను జైతపరమారుని మేనల్లుఁడ ననువిషయము నీకుఁ దెలియునా?

రూ—విన్నాను, రాజునకు మీయం దెక్కుడను గ్రహము గలదఁట కాదా?

అభ—అనుగ్రహమే కాదు, గౌరవమో!

రూ—అవును, అదియును గలదఁట. ఆరాజు మిమ్ము మంత్రికంటెనుగూడ నధికముగా గౌరవించునఁట గాదా?

అభ—అం దసత్యమేమియును లేదు. ఇచ్ఛినీకుమారియును, చళుకసింహుఁడును, నేనును గలసి చదువుకొన్నామని కూడ నీవు వినియే యుందువు.

రూ—అవును, విన్నాను.

అభ—సుందరీ! చిన్నప్పటినుండియు నామన స్సిచ్ఛినీకుమారియందు నాఁటియున్నది.

రూ—అది యుక్తమే? అట్టి సౌందర్యవతియం దెవ్వరి మనస్సు నాఁటుకొనదు?

అభ—కాని, యామెను బెండ్లాడుటయందు నాకందఱికంటె నెక్కు డధికార మున్నదికాదా?

రూ—నిశ్చయమే! మేనఱికము. ఇట్టిదాని నతిక్రమించి పెఱవారికిఁ బిల్లనిచ్చినవా రెచ్చటనో కాని యుండరు.

అభ—నాగుణములను, సత్ప్రవర్తనమును, రాజువలనను బ్రజలవలనను నాకుఁగల్గుచుండిన గౌరవమును నీ వెఱుఁగకపోవు. నే నారాజపుత్రి నభిలషించుట న్యాయముకాదా! నీమనస్సున నున్న దున్నట్టు దెలుపుము.

రూ—రాజపుత్రా! నీమేనమామకూఁతును నీ వభిలషించుట యెవ్వ రన్యాయ్య మనఁగలరు!

అభ—యువతీ ! నేను గోరునది మఱేమియును గాదు. నీవు నాపక్ష మవలంబించి యారాజపుత్రియనురాగమునకు నన్నుఁ బాత్రునిగాఁ జేయుము. ఇందులకుఁ దగినప్రతిఫలము నీవు చెందకపోవు.

రూ—న్యాయ్యపక్షము నవలంబించుట కభ్యంతర మేమున్నది ? తప్పక ప్రయత్నించెదను.

అభయసింగందులకు సంతసించి వెంటనే లేచి తాఁ గొనివచ్చిన ముత్యాలహారమును న్యాయువతిమెడలో వేసి "రూపవతీ ! ప్రస్తుత మిది బహుమానముగాఁ గైకొనుము. కార్యసాధనానంతరమున ని న్నింతకంటె నెక్కుడుగా సంతసింపఁజేసెదను" అని పలికి వెడలిపోయెను.

## ఏడవ ప్రకరణము

### భీమదేవుని సందేశము

జైతపరమారుఁ డొకనాఁడు కొలువుదీర్చి యుండెను. మంత్రులును, సామంతులును, సేనానులును, హితులును, బురోహితులును సభయం దుచితాసనములఁ గూర్చుండిరి. ఉదయకాలమందలి తామరకొలఁకువలె నాసభయంతయుఁ గలకలలాడుచుండెను. అపుడు ద్వారపాలకుఁ డొకసందేశకునిఁ గొనివచ్చి రాజసన్నిధిని నిలిపి వెడలిపోయెను.

ఆరాయబారియు జైతునకు వినయపూర్వకముగా సమస్కరించి తదనుమతిని బడసి యుచితాసనమునఁ గూర్చుండెను. పరమారుఁ డతనిఁ జూచి 'భీమదేవుఁడు నాకు రాయబార మంపియున్నాఁడా? ఇది మిక్కిలి వింతగానున్నది. మాకును, నతనికిని వ్యవహారము లేమియును లేవే! ఏదీ! వినిపింపుమా, నీవృత్తాంతము' అని పల్కఁగా నాతఁడు లేచి నిలువఁబడి రాజేంద్రా! నేను భీమదేవుని స్నేహితుఁడను. నన్నమరసింహుఁ డందురు. మారాజుననుమతి ననుసరించి తమ్ముఁ దర్శింపవచ్చితిని. మారాజేంద్రుఁడు తమసన్నిధిని బల్కవలయునని చెప్పినమాటలు యథానుపూర్విగా వినిపించుచున్నాను. దేవరవా రవధరింపుఁడు. "ఓరాజేంద్రా! పరమారువంశజులు రాజపుత్రులలో సుప్రసిద్ధులు. మీవంశ్యులందఱిలోను నీవు చుక్కలలోఁ జంద్రునివలెఁ బ్రకాశించుచున్నావు. జాతిచేతను, నీతిచేతను, విఖ్యాతిచేతను నీ పీకాలమున వాసిఁగాంచినావు." అని చెప్పుచుండ నతనికడ్డువచ్చి పరమారుఁ డిట్లనియె.

'ఓయీ! ఇవి భీమదేవుఁడు పల్కినవచనములే!' అని యడిగెను.

అమ—దేవా! 'అవును, అతనినోటనుండి వచ్చిన మాటలే తు, చ తప్పకుండఁ జెప్పుచున్నాను' అని చెప్పెను.

జైతుం డాశ్చర్యమును సూచించుచు 'ఆఁ, ఏమీ! భీమదేవునోటనుండి వచ్చినమాటలేయివి! ఆశ్చర్యమాశ్చ

ర్యము ! అగ్నిహోత్రము చల్లనియమృతబిందువులను గురియు చున్న దే! దారుణమగు పిరంగి కోమలములగుపుష్పగుచ్ఛముల వెదచల్లుచున్న దే! క్రూరహృదయమగు పెద్దపులి సాధుత్వమును వెల్లడించుచున్న దే! 'మంచిది, కానిమ్ము! చెప్పవలసినది చెప్పుము' అని పల్కెను.

ఇంతకుఁబూర్వము భీమదేవుఁడు జైతపరమారునకు గర్భశత్రువై పత్రికలోనిబల్లెమై, పరమారునిపేరు విన్న తోడనే బగ్గునమండిపడుచుండెడివాఁడు. అట్టివాఁ డిపు డిట్టి మృదుమధురవచనములు పలుకుచున్నందులకుఁ బరమారుఁ డాశ్చర్యపడి యిట్లు పలికెను.

అమరసింహుఁడు మరలఁ దనప్రసంగ మారంభించెను. 'భూపాలా! అత్యుత్తముఁడవగు నీతోఁ జుట్టఱికము చేసికొనఁ మనస్సువ్విళ్ళూరుచున్నది. నీకుమారికను (ఇచ్ఛినీకుమారిని) సంతోషముతో ఘూర్జరరాజ్యలక్ష్మికి సపత్నిగాఁ జేయుదువు గాక ! నీపుత్రిక తనసౌందర్యవిలాసములచే నీభీమదేవునంతఃపురము నలంకరించుఁగాక !' అని పల్కుచుండఁ బరమారుఁ డడ్డుపడి యిట్లనియె.

తెలిసెఁ దెలిసె! ఈమంచిమాటలు, ఈస్తోత్రములు నిందులకా ? 'ఓయీ ! మీరాజుకోర్కె యెప్పటికిని నెఱవేఱదు. పరమపవిత్రమగు హిందూమతమును విడిచి జైనమతావలంబియగు నతనికి నాకూఁతు నిచ్చెద నన్నమాట వట్టిది. అట్లొనర్చి నిర్మలమగు నావంశమును నకళంకముగాఁ

జేయ నీపరమారుఁ డంత బుద్ధిహీనుఁడు కాఁడు. భీమరాజు పరాక్రమవంతుఁడు; అఖండసైన్యముగలవాఁడు. విస్తారమగు రాజ్యముగలవాఁడు. చాళుక్యవంశము లోకమునఁ బ్రసిద్ధి గాంచినది. అట్టివానికి నాకూఁతు నర్పించుట కెంతయో సంతసించియుందును. నీజైనసంబంధముచేఁ దన్నును దనవంశమును గలుషితము గావించుకొన్న యీరాజునకు నాకుమారి నెట్లిత్తును? పోయి యీవృత్తాంతము నీప్రభువునకు విన్నవింపుము.'

అమరసింహుఁ డావచనములు విని 'రాజేంద్రా! అట్లె విన్నవించెదను. కాని, తమ రతనికోర్కెని దీర్పనిచోఁ జెప్పుమన్నవి కొన్నిమాటలు మిగిలియున్నవి. మీ రతనికి విరుద్ధముగా నడవనున్నారు.. కావున, నావచనములు తెలియఁ జెప్పెదను. 'ఓరాజా! నీవు నాకోర్కెని విఫలముగావించితి వేని నీరాజ్యమున కకాలప్రళయము సంభవించినదని యెఱుంగుము. భీముఁడు మయిమయిఁ బోవువాఁడు కాఁడు. అపార సైన్యములతో వచ్చి రెండునిముసములలో నాబూగడమును మంటఁగలిపి, మిమ్ముల నవలీల జయించి; విజయలక్ష్మితోను, నాబూగడరాజ్యలక్ష్మితోను నీకూఁతును వరింతును. శత్రువులపాలిటఁ బ్రళయకాలయమునివంటి భీమదేవు నెదిరించువాఁ డెవ్వఁడో చూచెదనుగాక!' అని పల్కుచుండఁగనే పరమారుఁడు మిగులఁ గోపోద్దీపితుఁడై 'ఓయీ! జైతపరమారుఁడు మీ రాజువీరాలాపములకు జంకెడిపిఱికిపంద గాఁడు.

పరమారుఁ డంతపరాక్రమహీనుఁడుఁ గాఁడు. ఆబూరాజ్య మంత గొప్పదోవలేదు. లక్షలకొలఁది వీరు లున్నారు. వీరాధివీరులగు పదునెనమండ్రు సామంతప్రభువు లెల్లప్పు డాబూగడము నఱచేతిలోఁ బెట్టికొని రక్షించుచుండఁగ దీనిని గన్నెత్తి చూచువా రెవ్వరు ? నాకంఠమున జీవితమున్నంత కాలమును నారాజ్యముగాని, నాకుమారిగాని యాభీమునిపా లగుట యసంభవము. మఱియు, నేమహాత్ముఁ డుత్తరగర్భములోనిబాలకునిఁ బరీక్షితుని గాపాడెనో, యేభక్తవత్సలుఁడు దేవేంద్రుఁ డతిభయంకరముగాఁ గురియు జాలవానలవలన గోపాలకులరక్షింపఁగోరి గోవర్ధనగిరి గొడుగువలె ధరించెనో యాపరమేశ్వరుఁ డారాధాకాంతుఁడు మమ్ముద్ధరింపకపోఁడు. ఎవఁడు త్రిపురాసుర గజాసుర భస్మాసుర ప్రముఖులగుదుష్టులను సంహరించి లోకోపద్రవము లడంచెనో, యేకరుణాకరుఁడు భక్తులకష్టములఁ దొలఁగించి దర్శనమాత్రమున నే మోక్ష మొసంగ నీయాబూపర్వతశిఖరమున నెలకొనెనో యాయచలేశ్వరుఁ డాదేవదేవుఁడు మమ్ము రక్షింపకపోఁడు' అని నుడివెను.

అతనిధీరవచనములు విని సభ్యులందఱును సంతోషముచేఁ బులకితశరీరులైరి. తావలచిన కన్యకామణి యేమగునో యని యంతవఱకును దడదడకొట్టుకొనుచున్నచిత్తముతో నుండిన యభయసింగు పొందిన యానందమునకు మేరయే లేదు. అమరసింహుఁడు రాజునొద్ద సెలవుగైకొని సభనుండి వెడలిపోయెను.

అనంతరము కొంతసేపటికి జైతునికోపము తఱిగి పోయెను. సభచాలించి యంతఃపురమునకుఁ బోయెను. అట నొక రమణీయప్రదేశమునఁ గూర్చుండి నాఁటిసభావృత్తాంతమును దలపోయ నారంభించెను. జైనమతావలంబియగు భీముఁడు పరమపవిత్రమగు హిందూమతముచే బద్ధుఁడగు తనకూఁతు నడుగుట పెద్దపరాభవముగాఁ దలంచి పరమారుఁడు వికటముగా సమాధానముచెప్పి భీమునిరాయబారిని బంపించివేయుట మిగులఁ బ్రమాదకర మని యప్పుడతనిమనస్సునకుఁ దట్టెను. అతఁ డెంతధైర్యవంతుఁడైన నా విషయము నాలోచించునపు డతనిహృదయము చెల్లాచెదరు గాకపోదు. జైతునిరాజ్యము మిగులఁ బెద్దది కాదు. అతని సైన్యము గూడ స్వల్పమైనదే! ఎవనితోఁ దాను విరోధమవలంబించెనో యాభీమదేవుఁడన సామాన్యుఁడు కాఁడు. అతఁడు మిగులఁ బరాక్రమశాలి.

దానికిఁదోడ నపారమగుసైన్యముగలవాఁడు. తలంచిన కార్యము నెఱవేర్చుకొనుటలో నతనికున్నపట్టుదల వేఱొకరికి లేదు. అట్టిభీమునితో వైరమూనుట పులితోఁ జెలగాటము వంటి దనియు, నతిభయంకరమగు మృత్యువునోటిలోనికోరనూడలాగయత్నించుటవంటి దనియు జైతపరమారుఁ డెఱుఁగును. తానంపినప్రత్యుత్తరము విన్నతోడనే భీముఁడు కోపోద్దీపితుఁడై యఖండసైన్యమును గూర్చికొని తనపై కెత్తివచ్చుననియుఁ గొలదికాలములోనె తనరాజధానిపై

మృత్యుదేవత తాండవముసల్పు చున్నదనియు నతఁడు నిశ్చయింపకపోలేదు. అయిన, నతఁ డిప్పు డేమి చేయును? తనకూఁతు నర్పింతునని భీమునకు వార్తపంపిన వెనుకటి యపాయ మొక్కక్షణములోనే మాయ మగును. కాని, పౌరుషవంతుఁడును, క్షత్రియవంశసంభవుఁడును నగుపరమారుఁడు తనకు సంపూర్ణనాశనము రానున్నను నట్టినీచకృత్యమున కిష్టపడునా? కులక్రమాగతమగు నాబూగడరాజ్యలక్ష్మి తనతరమున శత్రుగతమయిన నగుఁగాక! పుత్రమిత్రసమేతుఁడై సైన్యముతోఁగూడ యుద్ధరంగమునఁ బ్రాణము లర్పింపవలసినసమయము సంభవించిన సంభవించుఁగాక! గుణరూపసంపదలచే రెండవ లక్ష్మీదేవివలెనున్న తనకూఁతునిచ్ఛినీకుమారిని జైనమతావలంబి యగు భీమునకర్పించి పరమపవిత్రమగు తనహిందూమతమునకుఁ గళంకము తెచ్చునా? అట్లెన్నఁడును బరమారుఁడు చేయలేఁడు, చేయఁడు.

## ఎనిమిదవప్రకరణము

---

## పృథ్వీరాజు

ఉత్తరహిందూస్థానమునఁగల పురములలో ఢిల్లీనగరము తలమానికమువంటిది. అదియే పూర్వము ధర్మరాజునకుఁ బ్రధాననగరమై యింద్రప్రస్థ మనుపేరితో వాసిఁగాంచి

నది. దానికి ఢిల్లీ యను పే రెప్పుడు వచ్చెనో మనము స్పష్టముగాఁ జెప్పలేము గాని హిందూదేశముపై దాడివెడలి వచ్చిన మహమ్మదీయులలో మొదటివాఁడగు గజనీకాలమునకుఁబూర్వమందే యాపురమున కాపేరు గలుగుటమాత్రము నిజము. మిక్కిలిపాటుపడిన యింద్రప్రస్థమును దిల్లియుఁ డను రాజు బాగుచేయింప నతని పేరుననుసరించి యానగరమునకు ఢిల్లీ యనునామము గల్గినట్లు గొందఱుపండితులు చెప్పుదురు. అది యెంతవఱకు నిజమో మనము చెప్పఁజాలము.

క్రీ. శ. 1750 వ వత్సరమున, తూరువంజుఁ డగు ననంగపాలుఁడు ఢిల్లీపురమును బాలించుచుండెను. అతనికిఁ బురుషసంతతిలేదు. ఇరువురు కూఁతులు మాత్రము గలరు. ఆకాలమున రహతూరువంశజుఁడగు జయపాలుఁడు కాన్యకుబ్జపురమును (కనౌజి) పరిపాలించుచుండెను. అతఁడు ఢిల్లీశ్వరునియశక్తతను గనిపట్టి యతనిజయించి యారాజ్యము నాక్రమించుకొనవలెననుతలంపుతో ఢిల్లీపై దాడివెడలెను. అనంగపాలుఁ డది విని మనస్సులో జంకియు, లేనిపోనిధైర్యమును దెచ్చుకొని విజయపాలు నెదిరింప నిశ్చయించుకొనెను.

ఆకాలమున చోహానవంశజుఁడగు నానందదేవుకుమారుఁడు సోమేశ్వరుఁ డజమీరురాజ్య మేలుచుండెను. అతఁడు విజయపాలుని దాడినిగూర్చి విని సైన్యములతోఁ బోయి యనంగపాలునకుఁ దోడయి విజయపాలు నెదిరించి పోరి జయముగాంచెను. విజయపాలుఁడు పరాజితుఁడై పాఱి

పోయెను. అనంగపాలుఁడు సోమేశ్వరునితో స్నేహమునకు సంతోషించి తనకూఁతులలోఁ బెద్దదానిని గమలాదేవి నతని కిచ్చి వివాహము చేసి తగినబహుమతు లొసంగి పంపివేసెను. సోమేశ్వరునకుఁ గమలాదేవియందుఁ బృథ్వీరా జుదయించెను.

అతివృద్ధుఁడగు ననంగపాలుఁడు తన దౌహిత్రుఁడగు పృథ్వీరాజును ఢిల్లీ రాజ్యమున నభిషిక్తునిఁ గావించి రాజర్షియై బదరికావనమునకుఁ బోయెను. తండ్రియగు సోమేశ్వరుఁ డజమీరును బాలించుచుండఁగాఁ బృథ్వీరాజు ఢిల్లీపురము నేలుచుండెను. ఇట్లుండ గుజరాతును బాలించు భీమదేవుఁ డజమీరురాజ్యముపై దాడివెడలి సోమేశ్వరునితోఁ బోరు సల్పెను. సోమేశ్వరుఁడును నతనితో ఘోరముగాఁ బోరి వీరమరణమునందెను. పృథ్వీరా జది విని తండ్రిమరణమునకు విచారించి యుత్తరక్రియలు గావించి యజమీరురాజ్యమును ఢిల్లీతోఁ గలపి పాలించుచు భీమదేవుని జయించి తనతండ్రిని జంపిన పగను దీర్చుకొనవలె నని నిశ్చయించి తగినసైన్యమును గూర్చుకొని సమయమున కెదురుచూచుచుండెను.

ఢిల్లీశ్వరుఁ డొకనాఁడు కొలువుదీర్చియుండెను. సింగపుఁ గొదమలవంటి రాజకుమారు లతనిఁ బరివేష్టించియుండిరి. చాందుభట్టను మహాకవి చోహానువంశజులసద్గుణములను, బరాక్రమమును వర్ణించి సభ్యులను సంతసింపఁజేసి యథాస్థానమునఁ గూర్చుండెను. అంతట ద్వారపాలకుఁడు రాజానుమతిఁ చొప్పున నేడ్వురు రాజకుమారులను సభలోనికిఁ

గొనివచ్చెను. వారిశరీరములు మిగుల దీర్ఘములుగా నుండెను. వారిబాహుదండములు బలిసి యేనుగుతుండముల ననుకరించుచుండెను. వారిచూపులు మిక్కిలి ధీరములై యుండెను. పెక్కేల! వారియాకారములు చూచినచో వారు మహావీరులన్నబుద్ధి పొడమకపోదు. ఆవీరు లల్లంతదూరమునుండియే వినయముతో రాజునకు నమస్కరించిరి. అంతఁ బృథ్వీరాజు వారి నెదుర్కొనివచ్చి యాసనములఁగూర్చుండ నియమించి యాదరించెను. రాజుచేసిన గౌరవమునకు వారు మిగుల నానందించిరి. వారిలోఁ బెద్దవాఁడగు ప్రతాపసింగు లేచి రాజసన్నిధిని నిలువఁబడి యెల్లరు విన నిట్లు పల్కెను.

'ఓమహారాజా! మావృత్తాంతము యథార్థముగాఁ జెప్పుచున్నాను, అవధరింపుఁడు. మా కాఁపురము ఘూర్జరదేశము. మేము చాళుక్యవంశమునఁ బొడమినవారము. ఇప్పుడు గుజరాతును బాలించుచున్న భీమదేవునికి జ్ఞాతులము. మా జనకుని పేరు సారంగదేవుఁడు. భీమరాజు గర్వముచేఁ గన్నుగానక మమ్మును, మాతండ్రిని ధిరస్కరించి తన రాజ్యమునుండి తఱిమివేసెను. మేము చేయునదిలేక మా జనకునితోఁగూడ కొండలకేగి యచ్చటనే కాఁపురముండి మాకిట్టియిడుమలు గల్గించినభీమదేవునకుఁ దగినప్రతీకారము చేయవలెనని నిశ్చయించికొంటిమి. మే మతనిరాజ్యములోని గ్రామములఁ గొల్లఁగొట్టి యింతవఱకును జీవించుచుంటిమి. కొన్నిదినములక్రిందట నాభీమునకుఁ బ్రాణపదమైన పట్టపు

డేనుఁ గొక కొలనిలో విహరించుచుండ నేనును నాతమ్ముఁడగు నీయరిసింగును గలసి దానిని జంపితిమి. మే మొనర్చిన యీయుపకారమున నారాజు మిగులఁ గుపితుఁడై మ మ్మా కొండలందుఁగూడ నుండనీరాదని నిశ్చయించుకొని సైన్యములతో వచ్చి మమ్ముఁ దఱిమివేసెను. మాజనకుఁడు పరలోకగతుఁ డయ్యెను. చేయునదిలేక మే మేద్వారమును మహారాజునెవ్వని నేని యాశ్రయించి జీవింపఁదలంచి నీవు మహావీరుఁడవనియు, మంచివాఁడవనియు విని నీ చెంతకు వచ్చినారము. మాకొలువు నంగీకరింపుము. సమయమువచ్చినపుడు మాప్రతాపాదులను గనుఁగొనుము' అని పలికి తనస్థానమునఁ గూర్చుండెను.

పృథ్వీరాజు మంత్రులతో నాలోచించి వారిని జూచి 'రాజపుత్రులారా! చాళుక్యవంశసంభవుఁడగు భీమదేవునకును, మాకును విరోధము ప్రబలుచున్నది. పుట్టుకచే శత్రుకోటిలోనివారగు మీ కాశ్రయ మిచ్చుట రాజనీతికి విరుద్ధము. అయినను మీరు భీమదేవునితో బద్ధశత్రుత్వ మవలంబించియున్నారని యిదివఱకే చారులవలన వినియున్నాము. మీ మాటలయం దసత్య మేమియు లేదు. కావున, మీ కాశ్రయ మిచ్చితిమి. మీరు సుఖముగా మాపురమున నుండి మా గౌరవ మందుచుండుఁ' డని పల్కి వారిఁ జేరఁదీసెను.

ఆకాలమునఁ బృథ్వీరాజు ధైర్యసాహసములచేతను, సద్గుణములచేతను, దేశాభిమానముచేతను మిక్కిలి ప్రసిద్ధి

గాంచెను. అజ్మీరు-ఢిల్లీ రాజ్యములు గలసి యొక్కటియగుటచే నుత్తరహిందూస్థానమున నతఁడు మిగులఁ బ్రబలుఁడయ్యెను. రాజ్యము విస్తరించుటచేతను, సైన్య మెక్కుఁడగుటచేతను నతని నెదిరించుట కెట్టివారును జంకుచుండిరి. అప్పటివారలలోఁ బ్రబలుఁడగు భీమదేవుఁడుగూడఁ బృథ్వీరాజు నెదిరించుటకు వెనుదీయుచుండకపోలేదు. మఱియుఁ దండ్రినిజంపినపగ దీర్చుకొనుటకుఁ బృథ్వీరా జెప్పుడో తనపైకి దండెత్తి రాకమానఁడని నిశ్చయించుకొని భీమదేవుఁ డతిజాగరూకుఁడై యుండెను.

పృథ్వీరా జిదివఱకే యిచ్ఛినీకుమారిగుణరూపములను విని యామెను వరింపఁదలఁచియుండెను. తన కొమారినిమ్మని యడిగిన జైతపరమారుఁ డత్యాదరముతోఁ దనకోర్కె దీర్చునని పృథ్వీరా జెఱుంగును. అయినను, రాజకుమారియనురాగలత యెటు ప్రాఁకుచున్నదో తెలియకుండ నందులకై ప్రయత్నించుట వ్యర్థమని యూరకుండెను. కాని, యాతఁ డామె వృత్తాంత మెప్పటికప్పు డరయుచుండకపోలేదు.

## తొమ్మిదవ ప్రకరణము

## సంభాషణము

కాలవశమున ముదుసలియైనసూర్యుఁడు పడమటికొండ శిఖరమునఁ దిరుగుచుఁ బ్రమాదవశమునఁ గాలు జాఱి సముద్రమునఁ బడి యదృశ్యుఁ డయ్యెను. తనప్రియునికి సంభవిం

చినయూపదఁ దెలిసికొని పడమటిదిశ జేయుచున్న గోదనధ్వనులవలెఁ దనుతమ కులాయములకుఁబోవు పక్షులనినాదము లంతటను వ్యాపించెను. పతివియోగమున కోర్వలేక యేడ్చుట చేతనే కాఁబోలుఁ బడమటిదిశముఖ మెఱ్ఱవాఱి యుండెను. దుఃఖవివశురాలగు నాదిశాకాంత విప్పిడినతలవెండ్రుకలో యనఁ జీకట్లు వ్యాపించెను. ఆమె నోదార్చుటకై వచ్చుచున్న బంధుజనులవలెఁ జుక్కలొక్కొకటిచొప్పున గానవచ్చుచుండెను. ప్రజలు తమతమకార్యములనుండి మరలి సాయంకాలపుఁజల్లగాలుల ననుభవించుచుండిరి. ప్రదోషసమయమగుటచే శిష్టజనులు కాలుసేతులు గడిగికొని సంధ్యావందనాదులు చేయుచుండిరి. దేవాలయములందు ఘంటాధ్వనులు వినవచ్చుచుండెను.

అట్టితఱి నచలేశ్వరాలయము భక్తజనులతో నిండిపోయెను. కొందఱు దేవిని నుతించుచుండిరి. కొందఱు శంకరునకుఁ బ్రియతమమగుబూది నొంటినిండఁ బూసికొనుచుండిరి. కొందఱు భక్తిచే నిమీలితనేత్రులయి ధ్యానించుచుండిరి. కొందఱీశ్వరప్రసాదమును స్వీకరించి పైకివచ్చి యగ్నికుండముతీరమునఁ గూర్చుండి మాటాడుకొనుచుండిరి. కొంతసేపటికి వచ్చినవారందఱును స్వామి నారాధించుకొని వెడలిపోయిరి. అర్చకులుగూడ దేవాలయపుతలుపులు బంధించి తమయిండ్లకరిగిరి. అట్లందఱును వెడలిపోయినను నొకయువతియు, నొకపురుషుఁడును మాత్ర మచ్చటినుండి కదలకుండిరి.

దేవదర్శనార్థము వచ్చినప్రజలందఱును వెడలిపోఁగానే వా రిరువురు నొకచోఁ గూర్చుండి యేదియో ప్రసంగించుకొను చుండిరి. చీకటిలో నుండుటచే వారెవ్వరో గుఱుతింపలేము గాని వారిసంభాషణమునలన వారియుదంత మేమయినను దెలియునేమో చూతము. వా రిట్లు సంభాషించుచుండిరి.

పు—యువతీ! నీవు సుఖముగా నున్నావా? నీ ప్రయత్నము లెట్లున్నవి?

యు—నాకు సుఖమే! కాని, నాయత్నము లేమియు సాగుచున్నట్లు లేదు.

పు—ఆరాజకుమారియభిప్రాయ మెట్లున్నది?

యు—శ్రీలీశ్వరుని వరింప నువ్విళ్ళూరుచున్నది.

పు—ఆమెమనస్సును ద్రిప్పుటకుఁ బ్రయత్నింపలేదా?

యు—లేకేమి! ఎంతప్రయత్నించినను లాభము లేదు. పృథ్వీశ్వరునిపై నామెకుఁ జనించినయనురాగప్రవాహము నడ్డుట యసాధ్యము. అయినను బరమారునియభిప్రాయ మెట్లున్నది?

పు—కన్యక కిష్టములేనపుడు పరమారునియభిప్రాయముతో నేమిపని? అయిన నాతనికిఁగూడఁ దనకూఁతును మనప్రభువున కీయవలెనని లేదు. జైనమతసంబంధముచేఁ జెడిపోయినవాఁడఁట మనరాజు. నయముననను, భయముననను నెంతచెప్పినను నతఁ డిష్టపడలేదు.

యు—అట్లయిన నాబూగడమునకుఁ గాలము సమీపించుచున్నట్లున్నది.

వృ—సందేహమేమి ? ఈవార్త విన్నతోడనే మన రాజు మంత్రిపడి సేనావారముతోఁ గూడివచ్చి యీదుర్గము నవలీలనే మంటఁ గలిపివేయును.

యు—ఇట నుండ నేమిపని ! నీతో వత్తునా ?

వృ—రావద్దు, ఇంకను నీ విట నుండవలెను. ఎట్లయినను గార్యము నెఱవేర్పవలసి యున్నది. నేను కొలఁదికాలములోనే మరలి వచ్చెదను.

యు—మంచిది, నీయిష్టప్రకారమె నడచెదను.

అంత నాయిరువురు నాప్రదేశమును విడిచి వెడలి పోయిరి.

## పదవ ప్రకరణము

## భీమదేవుని వీరావేశము

కామ మంతశ్శత్రువులలో నొకటి. దానికి లోఁబడని వాఁడే ధన్యుఁడు. దాని నగ్నితోఁ బోల్తురు. ఆపోలిక దానికిఁ దగియున్నదనుటకు సందియము లేదు. అగ్ని తానాశ్రయించిన వస్తువును దహనముచేయును. కామముగూడ నెవ్వరిని దానాశ్రయించునో వారినే చెఱచును. ఎన్నికట్టియలు దెచ్చి వైచినను నగ్నికిఁ దృప్తి లేదు. ఎన్నిసుఖము లనుభవించినను దృప్తి లేదు. అగ్ని నీటిచేఁ జల్లారునట్లు కామము జ్ఞానముచే నశించునని తెలిసికొని యెవఁడు జ్ఞానమునభివర్ధించుకొని

కామమును నిగ్రహించునో వాఁడే లోకములో సుఖవంతుఁడగును. లేనిచో వానిజన్మము దుఃఖభాజనమే!

భీమదేవుఁ డిచ్ఛినీకుమారిసౌందర్యాదులు విని యామెను వరింపవలెనన్నకోర్కెకి లోఁబడి పలుపాట్లు పడఁజొచ్చెను. ఆబూగడమున కరిగినయమరసింహుఁ డెప్పుడు వచ్చునో, ఇచ్ఛిని దన్ను వరింపనున్నదన్నశుభవార్త యెప్పుడు దనచెవిని వేయునో యని కాచుకొని యుండెను.

ఒకనాఁ డొకచారుఁడు వచ్చి నమస్కరించి చేతులు జోడించి నిలువఁబడెను. భీమదేవుఁ డతనిఁ జూచి 'ఓరీ! నీ వెవఁడవు? ఎక్కడికిఁ బోయివచ్చితివి?' అని యడిగెను.

చారు—దేవా! తమపినతండ్రికుమారులు ప్రతాపసింహాదు లెచ్చటికిఁ బోయిరో తెలిసికొనిరావలయు నని నా కాజ్ఞాపించినారు. దేవరయాజ్ఞచొప్పున నావృత్తాంత మరసివచ్చితిని.

భీమ—వార్త లేమి?

చారు—మహాప్రభూ! ప్రతాపసింహాదులు ఢిల్లీశ్వరు నాశ్రయించి యున్నారు. ఆమహారాజు వారి నెక్కుడుగా నాదరించుచున్నాఁడు.

భీమ—చీ! తుచ్ఛులు, తుచ్ఛులు. చాళుక్యవంశసంభవులగువారు తమవంశమునకుఁ బరమశత్రువగు చోహానవంశజుని పృథ్వీరాజు నాశ్రయించినారా? దురాత్ములు మా వంశమున కప్రతిష్ఠఁ గల్గించిరి. చీ! చీ! అధమాధములు.

ఎంతపని చేసినారు. అంతకంటె ముష్టియెత్తుకొని జీవింపరాదా? ఇంకను వార్త లేమి?

చారు—దేవా! పృథ్వీరాజు గొప్పసైన్యమును గూర్చుచున్నాఁడు. తండ్రిని జంపిన తమపైఁ బగసాధింపుకొన మిగులఁ ద్వరపడుచున్నాఁడు. స్వల్పకాలములోనే మన దేశముపై దాడివెడలివచ్చునట్లు తోఁచుచున్నది.

భీమ—మంచిది, నీ విఁకఁ బొమ్ము. అని వానిని బంపివేసి 'ఈవార్త మిగుల భయంకరమైనదియే! అజ్మీరురాజ్యము ఢిల్లీతోఁ గలయుటచేఁ బృథ్వీరాజురాజ్యము ప్రబలమై మావంటివారికి హృదయశల్యమగుచున్నది. దానిబలమును గొంత యణంచినఁగాని మావంటివారికి సౌఖ్యము గలుగదు. నేనందులకై తగినప్రయత్నము చేసెదను' అని యాలోచించుకొనుచుండ సమరసింహుఁడు వచ్చి నమస్కరించి యాబూగడవృత్తాంతము సంతయును విన్నవించెను.

అది విన్నతోడనే భీమదేవునకుఁ గామాగ్నితోపాటు క్రోధాగ్నికూడఁ బ్రబలి మండఁజొచ్చెను. హృదయమునందున్న క్రోధాగ్నిజ్వాలలు మీఁది కెగయుటచేఁ గందిపోయిన యతనిముఖమును, నేత్రములును మిక్కిలి జేవురించెను. బొమముడిచే నతనిలలాటము కడుభయంకరముగా నుండెను. అతఁ డమరసింహునిఁ జూచి 'ఆఁ! ఏమీ! పరమారుఁ డేమనెను. జైనమతసంబంధముచే నేను చెడిపోయితిననియా? నావంశము మలిన మయినదనియా? ఇట్లు

నిశ్చయముగాఁ బల్కిన యాజైతునినాలుక నీఖడ్గముచేఁ తుత్తునియలు చేయవలదా ? ఏమీ ! భీముఁ డాతనికంటె కొక వలుసునవాఁ గన్పడుచుండెను గాఁబోలు ! భీముని మాటకోప మతనికి మఱపునకు వచ్చెనా ? ప్రళయకాల భీమునివంటి యీభీమునికోపమునకుఁ బాత్రుఁడగు నీయుపాత్రునిఁ బరమాను నెవ్వరు రక్షింతురో చూచెదనుగాక ! నాప్రచండసైన్యము లనుసముద్రముచేఁ జుట్టఁబడి యాయుధహాతులనెడి తరంగముల దెబ్బలుదినుచు నడుగంటుటకు సిద్ధముగానున్న యీ యాబూదుర్గమనెడినౌక నెవ్వఁ డుద్ధరించునో చూతము. తనవంటివాఁ డెంతప్రయత్నము చేసినను దుర్లభమగు నాసంబంధము సులభముగా లభించినందుకు సంతసించుటకుమాఱుగా నాదురాత్ముఁడు దోషారోపణము చేసి నిరసించెనా ? ఇందులకుఁ దగినదుష్ఫలమును జైతుఁడు స్వల్పకాలములోనే పొందఁగలఁడు. ఆరాజకుమారి పృథ్వీరాజునే వరించునా ? నన్నుఁ గాదని యామె యారాజాధము నెట్లు వరించునో కనుఁగొందము. పరమారుఁడు నాసంబంధమున కేల యియ్యకొనఁడో, యాయిచ్ఛిని నాకేల భార్య గాదో చూతము ! అమరసింహా ! ఇఁక నాలస్యమేల ? మంత్రులను బిలువనంపుము. దిగ్గజముల చెవులు చెవుడుపడ మనరణభేరుల మ్రోయింపుమనుము.

మనసేనానాయకులను వేగిరింపుము. స్వల్పకాలములోనే మనచతురంగబలములు కాళ్ళత్రొక్కుళ్ళచే భూతల

మును జీర్ణముగావించుచుఁ బోయి యాబూగడమును ముట్టడించుఁగాక ! మనవీరుల సింహనాదముచేతను, ఏనుఁగుల ఘీంకారములచేతను ఆబూగడములోని యతఃపుర మందిరములు రాఁబోవునాపద కేడ్చుచున్నట్లు ప్రతిధ్వనులు చేయుఁగాక ! అని యిట్లు కోపావేశముచే నోడ లెఱుఁగక పలుకుచుండ నమరసింహుఁ డతని కిట్లనియె. 'దేవా ! తా మింతయాగ్రహము చూపనవసరములేదు. పరమారునిమాటలతో మనకుఁ బ్రయోజనమేమి ? అతనిరాజ్యలక్ష్మిని మన మాసింపలేదు. కావునఁ, బోడుసల్పి యాబూగడమును జయించుటకుఁ బ్రయత్నింపనేల ? ఇక్కార్యమును సాధింప దండోపాయముదక్క వేఱుపాయములు లేవా ? ఏవిధినైన మీ రిచ్ఛినీకుమారిని బెండ్లియాడినఁ జాలును. అదియే మనకు ముఖ్యకార్యము. ఈస్వల్పకార్యమున కంత ప్రయత్నమా ? గోళ్ళతోఁ జీల్చుదానికి గొడ్డళ్ళేల ? కావునఁ, దమరు కొంచెము శాంతివహించి యుండుఁడు. సర్వమును నేఁ జక్కఁ జేసెద' అని పల్కి యప్పటి కతని యుద్రేకము తగ్గించెను.

## పదునొకండవ ప్రకరణము

## అభయసింహుని ప్రయత్నములు

జైతపరమారుఁడు తనకూఁతు నియ్య నని చెప్పి భీమదేవుని సందేశము నిరసించినప్పటినుండియు నభయసింగుని

కిచ్ఛినీకుమారియం దాశ మఱింత వర్ధిల్లెను. అది హెచ్చుచున్నకొలఁది నతఁ డక్కార్యసాధనమునకై ప్రయత్నము లనేకములు చేయఁదొడఁగెను. సమర్థురాలగు రూపవతి తనకార్యము నెఱవేర్పఁజాలునన్న నమ్మక మున్నను నతఁ డంతటితో సంతుష్టిచెందక తనతల్లిని లలితాదేవిని గూడ నందువిషయమై ప్రోత్సాహించెను. తనమేనగోడలిని దన కొడుకున కిమ్మని యడుగుట కామె యెంతయు స్వతంత్రురాలు. మఱియు; యోగ్యురాలు, గుణవంతురాలు, సౌందర్యవంతురాలు నగు నిచ్ఛినీకుమారివంటిదానిని కోడలుగాఁ గైకొన నెవ్వరి కిష్టముండదు. కావున, లలితాదేవికిఁ గూడ నిందువిషయమై యాశ లేకపోలేదు. కాని, యిచ్ఛినికిఁ బృథ్వీరాజునందు దృఢానురాగముండుట నెఱిఁగినది గావున నిఁక నందులకై ప్రయత్నింప వ్యర్థమని యూరకుండెను. లలితాదేవి బుద్ధిమంతురాలు గావున లోకములోని సామాన్యస్త్రీల వలె మేనఱికము చేసికొనుటయందు మొండిపట్టుదల వహింపలేదు.

కాని, యభయసింగామె నూరకుండనిచ్చునా? రాత్రిందినము లామె చెవి నిల్లుగట్టుకొని చెప్పిచెప్పి యతఁ డెట్లయిన నేమి, తనతల్లిని తనకార్యసాధన కభిముఖురాలినిగాఁ జేసెను. లలితాదేవి కుమారునియందలి ప్రేమాతిశయముచే నప్పని కొప్పుకొన్నను దాని నెట్లు సాధించుట? ఇచ్ఛినీకుమారికి బోధించుట కామె సమర్థురాలును గాదు. స్వతంత్రురా

లును గాదు. తనయన్నయగు పరమారు నడుగుటతప్ప నామెకు సాధనాంతరము లేదు. మఱియు, నామె యంతవఱకే స్వతంత్రురాలు. కుమారునికోర్కి దీర్చుట కామె యొకనాఁ డన్నగారినిజూచి తనయభిలాష మెఱిఁగించెను. అందుల కతఁ 'డమ్మా! అదియు నాకును సంతోషమే! పెండ్లికూఁతురు చిన్నపిల్ల కాదు. పెండ్లివిషయమై యామెమనస్సుననుసరించి మనము నడవవలెను. కాని, యామెను మనయిష్టప్రకారము నడవుమనుట భావ్యము కాదుగదా! నే నేమి చేయఁగలను? నీవు మాకుఁ గ్రొత్తదానవు కావు. ఎట్లయిన, నీవు పోయి నీమేనగోడలి నొప్పించి నీకొడుకునకుఁ జేసికొనుము. నా యాటంక మేమియును లేదు' అని పలికెను.

లలితాదేవి యతనివచనములు నిష్కపటములనియు, సత్యములనియు నెఱుఁగును. ఆమె వెంటనే యింటికి వచ్చి పరమారుఁడు చెప్పినమాటలు వినిపించి 'కుమారా! నీకోర్కి నెఱవేఱుట యసాధ్యము. ఇచ్ఛినికిఁ బృథ్వీరాజునందున్న యనురాగ మనివార్యమైనది. దానిని ద్రిప్పుట యీశ్వరునకుఁ గూడ నలవికాదు. చిన్ననాఁటిప్రేమనుబట్టి యామె నిన్ను వరించునని యనుకొనుచున్నావు. అది పొరపాటు. చిన్నప్పటి గుణములును, చేష్టలును, భావములును యౌవనమంకురించిన తోడనే మాఱిపోవును. ప్రేమకూడ నానావిధములు. చిన్ననాఁటిప్రేమ వేఱు; యౌవనకాలముననావిర్భవించునది వేఱు. ఇఁక నీ వాప్రయత్నము విడిచి వేఱొకతెను వరించి సుఖిం

పుము' అని యుపదేశించెను. అది విని యభయసింగ చోప్పటు గదలిపోయెను. తల్లి హితోపదేశము లతనిచెవి కెక్కలేదు. రూపవతి చెప్పుచున్నమాటల నాలోచింప నిచ్ఛనియును రాగము తనపైకి మరలుచున్నదని స్పష్టమగుటచే నిఃకం గొలఁదిదినములు వేచియుండిన తనకోర్కె సఫలముగావచ్చు నని యభయసింగు తలపోయసాగెను. అంతియకాని, రూప వతి తన్ను వంచించి తనధనమంతను నపహరింపఁ దలఁచు కొనియే యిట్లు పలుకుచున్నదని యెఱుఁగఁడు. కావున, నభయసింగు రూపవతియనుగ్రహమునుగోరి నానావిధబహు మానము లిచ్చి యామెను సంతసింపఁజేయుచుండెను. రూప వతియందితని కెక్కుడు నమ్మకము గుదురుటకు వేఱొక కారణముఁగూడ నున్నది.

ఒకనాఁడతఁడచలేశ్వరుని దర్శింపఁబోయెను. అచ లేశ్వరాలయ మెల్లప్పుడును బైరాగులతోను, గోసాయీల తోను నిండి యుండును. వారిలో నొకబైరాగి నెగడియొద్దఁ గూర్చుండి మంటవెలుఁగున నొకపురుషునిచేతిని బరిశీలించి సాముద్రికరేఖలననుసరించి ఫలములు చెప్పుచుండెను. అభయ సింగది చూచి కొంతసే పచ్చట నుండి యాపురుషునిఫల ములు పూర్తిగాఁ జెప్పినపిమ్మటఁ దనకుఁగూడ ఫలములు చెప్పుమని బైరాగిని గోరెను. పరోపకారియగు నతఁడారాజ కుమారునిచేతిని బరిశీలించి 'కుమారా! నీకోర్కె మిగుల గొప్పది. ఒక యువతిని బెండ్లాడ నీవు విశ్వప్రయత్నము చేయుచున్నావు, అవునా? కాదా?' అని యడిగెను.

అభయసింగాశ్చర్యచకితుఁడై వికసించినముఖముతో 'అయ్యా! అవును, సత్యమే' అని పలికెను.

బై—నీ కార్యమువిషయమై యొక యువతి నిష్కపటచిత్తముతోఁ బాటుపడుచున్నది కాదా?

అభ—చిత్రము, చిత్రము.

బై—నీ వామె చెప్పినచొప్పున నడపుము. నీకార్యము నెఱవేఱును.

అభ—(సంతోషముతో) నాకోర్కె యీడేరు నని తమకు నమ్మక మున్నదా?

బై—ఉన్నది, కాని, కష్టసాధ్యము.

అభ—ఎట్లయిన, నెఱవేఱును గదా?

బై—తప్పక నెఱవేఱును.

అనంతర మభయసింగు బైరాగికి నమస్కరించి వెడలి వచ్చెను. త్రికాలజ్ఞులగు బైరాగులమాట లెప్పుడును వ్యర్థములు గావని యతనికి నమ్మక ముండెను. అప్పటినుండియు నభయసింగునకు రూపవతియందు మఱింత గుఱి కుదిరెను. అందుచే నతఁడు దానిచేతిలోని కీలుబొమ్మవలె వర్తించుచుండెను.

## పండ్రెండవ ప్రకరణము

---

### ఇచ్ఛినీకుమారి

ఇచ్ఛినీకుమారి తనతండ్రి భీమదేవునిసందేశమును నిరసించినందుల కానందించుచున్నను వెఱ్ఱిపట్టుదలగలవాఁ

డును, నపారసేనాసమేతుఁడును నగు నా భీమునివలనఁ దమకు రానున్న దుర్నివార్యము లగునాపదలఁ దలంచుకొన్న పుడు విచారమును గూడ నొందక పోలేదు. భీముఁ డచిరకాలములోనే తమపురమును ముట్టడింపక మానఁడనియు నాతనిఁ బాఱఁద్రోలి యాబాగడమును రక్షింపఁజాలినశక్తి తమకు లేదనియు నామె యెఱుంగును. తనతండ్రిరాజ్యమునకును, దనబంధుగులకును దనమూలమునఁ దీఱనికష్టము సంభవించుచున్నందుల కామె యొక్కొక్కపుడు చెందుచున్న దుఃఖమునకు మేరయే లేదు. ఆమహాపదను దప్పించుకొనుటకు రెండే మార్గములు. భీమదేవునిఁ బెండ్లియాడుట యొకటి, రెండవది, తమపై నెత్తివచ్చిన భీమదేవు నెదిరించి పాఱఁద్రోలఁ జాలుబలవంతు నాశ్రయించుట. ఇం దేదియుక్తము? అన్ని విధములఁ దనకుఁ బ్రతికూలవర్తనుఁ డగువానినిఁ జేపట్టి యావజ్జీవమును దనజన్మమును దుఃఖభాజనము గావించుకొనుట యుక్తమా! కాదు. అంతకంటె వెంటనే ప్రాణత్యాగము చేసి తానుసుఖించి తనవారిని సుఖింపఁజేయుటయే మేలుకదా! కాని, యాత్మహత్య సజ్జనగర్హితముకావున మొదటిపక్షము చేకొనఁదగినది కాదు. ఇఁక, రెండవపక్షమాలోచించిన నదియు సంఘటించునట్లు లేదు.

భీమదేవు నెదిరించి తమ్ముఁ గాపాడఁజాలు బలవంతుఁ డెవఁ డున్నాఁడు? అక్కాలమునఁ బృథ్వీరాజుతప్ప వేఱొకఁ డతని నెదుర్కొనలేఁడు. కాని, పృథ్వీరా జందుల కంగీకరిం

చునా? పరులప్రాణములఁ గాపాడుటకుఁ గ్రూరసర్పమునంటి భీమదేవుని యుద్ధములో నెదుర్కొని యనవసరముగాఁ దీఱని కష్టము తెచ్చిపెట్టుకొనునా? పరోపకారు లట్టికష్టములకు వెనుదీయరు. కాని, యీరాజచంద్రునకుఁ బరోపకారబుద్ధి యున్నదో లేదో, అతనియభిప్రాయ మెట్లుండునో? అది తెలిసికొనునంతవఱకు నికార్య మెట్లు నిశ్చయించుట? భీమదేవుఁడు తమపై దండెత్తివచ్చులోపున నీకార్యము చక్కఁబెట్టుకొనవలయును. అందుచే ముందుగా విశ్వాసార్హుఁడగువాని నొకదూతను బృథ్వీరాజుచెంతకుఁ బుచ్చవలెను. ఈవిషయమై యామె తనలోఁ జింతించి తుద కిట్లనుకొనెను. 'నాకుఁ దెలిసినవారిలో నట్టివాఁ డెవఁ డున్నాఁడు? నాకు విద్యోపదేశముచేసిన యీశ్వరభట్టిందుల కన్నివిధములఁ దగినవాఁడు. అతనిఁ బ్రార్థించి యెట్లో యిందుకు సమ్మతింపఁ జేయుదును. తండ్రియనుమతి వడయకుండ స్వతంత్రురాలనై యతని నారాజునొద్దకుఁ బుచ్చినచో లోకులు నన్ను నీతిబాహ్యురాలని నిందింతురా? వెనుక రుక్మిణి, శిశుపాల జరాసంధాదులను జయించి తన్నుఁ గొనిపోవలయునని కృష్ణునకు సందేశ మంపెను. ఆమె నెవ్వరు నిందించిరి? అట్లే నేనును భీమదేవుని జయించి నన్నుఁ గొనిపోయి పెండ్లాడుమని ప్రార్థించుచు నారాజునకు సందేశమంపిన నిందు దోష మేమున్నది? కాని, కృష్ణునివలె నారాజసత్తముఁడు దీనస్త్రీరక్షణమునకు బద్ధకంకణుఁ డగునో కాఁడో? ఏమయిన, మా

కిప్పట్టున నతనిసాయము నడయుట ముఖ్యము. మాయుపాధ్యాయులవారి నిందులకై పంపెదను'' అని యీవిధమున నాలోచించుకొనుచు నిచ్చినీకుమారి యతికష్టముతోఁ గాలము పుచ్చుచుండెను.

మానవులు సౌఖ్యము లనుభవించుచున్నంతకాలమును భగవంతుని స్మరింపరు. తానో, తనయాత్మబంధువులో దుస్సహరోగపీడితులై మంచముబట్టి మందులవలన నుపయోగముగానక యమలోకమునుజూడ సిద్ధపడియున్నపుడు దేవుని స్మరించుకొందురు. ముడుపులు గట్టుదురు. దేవతలకుఁ గోడిపుంజులనో, గొఱ్ఱెపోతులనో మ్రొక్కుకొందురు. ఇట్లు చేయుట లోకస్వభావము. ఆబూగడమునకుఁ దనమూలమునఁ దీఱనియాపదరానుండుట కనిపట్టి యిచ్చినీకుమారి యచలేశ్వరునిదర్శనము గావించుకొని తదీయానుగ్రహమును సంపాదించి తన్మూలమునాపదనుండి తప్పించుకొనన నూహించెను. ఆమె యిట్లాలోచించుచున్న సమయమున రూపవతి యచ్చటికి వచ్చి సమీపమునఁ గూర్చుండి 'అమ్మా! ఏదో యోజించుచున్నట్లున్నది; అది యేదో మీహితురాల నగు నాకుఁ దెలుపరాదా?' అని యడిగెను.

ఇచ్చి—చెలియా! రాఁబోవునాపదను దప్పించుకొనుట యెట్లోయన్న యోజనము తప్ప నాకు మఱియొకటి యేమున్నది?

రూప—అమ్మా! ఈయుపాయమును నిముసములో మాయము చేయవచ్చును; నావిన్నప మాలకింపుము. భీమదేవుని బెండ్లాడుము. అతఁ డందమున నేమి, చందమున నేమి, సంపదలం దేమి, రాజ్యవైభవమం దేమి సుంతైనను గొఱంత లేనివాఁడు; నే నెంత చెప్పినను నావచన మాలోచింపకున్నావు. తల్లీ! వేఱాలోచనము మాని, భీముని వరించి ఘూర్జరరాజ్య మేలికొమ్మా. నీతండ్రిని, నీయాబూగడ రాజ్యమును సుఖపడ నిమ్మా.

ఇచ్ఛి—రూపవతీ! నీవన్నది బాగుగా నున్నది. కాని, యాభీమరాజు నీకంటి కగపడినట్లు నాకంటి కగపడలేదు. అట్లయినఁ దప్పక యతని వరించియే యుందును. ఇఁక నా ప్రసంగము నాయొద్దఁ దేవద్దు. అతని పేరైనను వినుటకు నా కిష్టము లేదు.

రూప—పోనిమ్మా; ఆపదను దరించుట కుపాయము చెప్పితిని. అంతియకాని వేఱు గాదు.

ఇచ్ఛి—అంతకుఁదప్ప నాపదను దరింప నుపాయము లేదా?

రూప—ఏ మున్నది?

ఇచ్ఛి—భీమరాజునుజయింపఁజాలిన యొక రాజేంద్రునిసాయ మపేక్షించిన నీయుపాయము తొలఁగిపోదా?

రూప—అట్టివాఁ డెవ్వఁ డున్నాఁడు?

ఇచ్ఛి—ఏమీ, ఢిల్లీశ్వరుఁడు లేఁడా?

రూప—చిఱునవ్వు నవ్వి యూరకుండును.

ఇచ్ఛి—(కొంచెము కోపముతో) ఎందులకే యట్లు నవ్వుచున్నావు ?

రూప—లేదమ్మా ! ఊరకే నవ్వుచున్నాను.

ఇచ్ఛి—కారణము చెప్పెదువా ? చెప్పవా ?

రూప—చెప్పిన నీకుఁ గోపము వచ్చునేమో ?

ఇచ్ఛి—రాదు, చెప్పుము.

రూప—అమ్మా ! నీ వింత యమాయికురాల వేమి! తనతండ్రిని జంపినభీమదేవు నెదుర్కొనలేక పరాక్రమ హీనుఁడై వర్తించిన పృథ్వీరా జెక్కడ ! వచ్చి మనయాపద తొలంగించు టెక్కడ ?

ఇచ్ఛి—ఏమీ ! ఢిల్లీశ్వరుఁడు పరాక్రమహీనతచేత నె భీము నెదుర్కొనలేఁ డందువా ?

రూప—వేఱుకారణ మేమి గలదు ?

ఇచ్ఛి—తగినసమయము లభించునందాఁకఁ బగతుర నోర్చియుండుట రాజనీతిజ్ఞుల లక్షణము గదా !

రూప—రాజనీతిజ్ఞులలక్షణ మనుటకంటెఁ జేతకాని వానితనమనుట యుచిత మని తోఁచుచున్నది.

ఇచ్ఛి—తగిన సమాధానము చెప్పలేక యారాజేంద్రుని నిందించుట యెందుకు ? ఇఁకమీఁద నాతని నిందించిన నే నంగీకరింపను.

రూప—లేదమ్మా కోపింపకుము, అతఁ డూరకుండుటచే నట్లనుకొన్నాను.

ఇచ్ఛి—ఏమయినను సరియే! నే నాతనికి వార్త పంపుదును.

రూప—అట్లే చేయుము.

ఇచ్ఛి—సరియే! దానికేమి? కాని, యొకమా అచలేశ్వరుని దర్శనము చేసి రావలయును.

రూప—అమ్మా! అది మంచిదే, భగవంతుఁ డాపదుద్ధారకుఁడు. కాన, నాపదలో మునుఁగుచున్న మనల రక్షింపక పోఁడు. నే నందులకై నిన్నుఁ జాలదినములనుండి ప్రియాణము చేయుచున్నానుగదా!

ఇచ్ఛి—ఇందులకు మాతండ్రియనుమతి వడయవలయును.

రూప—అట్లయిన మనము వెళ్ళినట్లే!

ఇచ్ఛి—ఏమీ?

రూప—మీతండ్రి నిన్నింటనుండి కదలనీయఁడు!

ఇచ్ఛి—ఏమి చేయుమందువు?

రూప—ఏమియును లేదు. ఒరులకుఁ దెలియకుండ మనము పోయివత్తము.

ఇచ్ఛి—రాత్రిసమయమున మన మొంటరిగాఁబోయిన నేమయినను బ్రమాదము సంభవించు నేమో?

రూప—ఏమియును సంభవింపదు. పల్లకీలోఁగూర్చుండి వెళ్ళి రావచ్చును. మన కభయసింగు సహాయుఁడై వచ్చును. మన కపాయ మెట్లు రాఁగలదు? మఱియు, నమ్మా! మఱియొక సమాచారము. అచలేశ్వరునియాలయమున కొక

బైరాగి వచ్చినాఁడఁట. అతఁడు త్రికాలజ్ఞుఁడఁట. అడిగిన ప్రశ్నములకుఁ దగిన సమాధానములు చెప్పునఁట. అభయసింగు నాతోఁ జెప్పినవాఁడు. అంతటిమహానుభావుఁడు లోకమందు వేఱొకఁ డుండఁడఁట. మనకు రాఁబోవునాపదను గుఱించి యతని నడిగి తెలిసికొనుట మంచిదని నాయభిప్రాయము. అతఁ డిట నెన్నో దినము లుండఁడఁట. కనుక, మన మీరాత్రియే పోయివచ్చుట మంచిది.

ఇచ్ఛి—ఈరాత్రియే! మాతండ్రిగారు గ్రామాంతరము వెళ్ళియున్నారు. ఆయన వచ్చినపిమ్మట వారియాజ్ఞను బొంది వెళ్ళఁగూడదా!

రూప—అమ్మా! అట్లు కాదు, మీా కేవిధమైన భయమును లేకుండ మిమ్ము రక్షించుభారము నాది. ఈదినమైనచో బైరాగిదర్శనముగూడ మనకు లభించును. లేనిచో నది యసంభవము.

ఇచ్ఛి—పోనిమ్ము, అట్లే పోవుదము. అందులకుఁ దగినప్రయత్నములు చేయుము.

ఇచ్ఛిని మొదట జనకాజ్ఞను బొందకుండ స్వామిదర్శనార్థముబోవ నిష్టపడలేదు. కాని, తనకు సమీాపబంధు వగు నభయసింగు తమకు రక్షకుఁడుగా వచ్చుచుండుటచే వేఱొక ప్రమాదము సంభవింపదన్న నమ్మకముండుటచేతను, మఱి యొకప్పుడైన బైరాగిదర్శనము లభింపదన్న హేతువుచేతను రూపవతి చెప్పినచొప్పున నీశ్వరునిసందర్శింపఁబోవసమకట్టెను.

## పదమూఁడవ ప్రకరణము

## దేవతాదర్శనము

సాయంసమయమునకు రూపవతి కన్యాంతఃపురము నుండి యింటికి వచ్చునప్పటికి వాడుకచొప్పున నభయసింగు వచ్చి తనయింటియరఁగుపైఁ గూర్చుండెను. రూపవతి యతని నల్లంతదూరముననె చూచి మందహాసము చేసి 'రాజకుమారా ! నీవే ధన్యుఁడవు ధన్యుఁడవు' అని పలికెను.

అతఁడది విని యధికానందభరితుఁడై లేచి యామెకెదురుగఁ బోయి 'రూపవతీ ! చెప్పుము చెప్పుము, విశేషములేమయినఁ గలవా ? ఆయువతి నాకు లభించునో, లభింపదో యన్నవిచారముచే శుష్కకాష్ఠమువలె నెండిపోయిన నా హృదయమున కమృతబిందువువంటివార్త యేదయినను గలదా ! చెప్పుము' అని యత్యాసక్తితో నడిగెను.

'రాజకుమారా ! నీపుణ్యము పుచ్చినది. నీకోర్కె యీడేఱినది. సార్వభౌముఁడనఁదగుభీమదేవుని నిరసించిన యిచ్ఛిని నీదయను గోరుచున్నది. ఇఁకఁ గావలసినదేమి ! అదృష్టవంతుఁడవన్న నీవే యదృష్టవంతుఁడవు తెమ్ము, ఏదీ! నాకిచ్చెడిబహుమానము తెమ్ము'అని యామె యతని నడిగెను.

'బహుమానమున కేమి ? ఇదివఱకే నీ కది ముడుపు గట్టియున్నాను. ఆమె నన్ను వరించుట కిష్టపడినదా ! ముందామాట చెప్పుము' అని యభయసింగామెను జూచుచుఁ బలికెను.

'ఓయీ ! నీవు వట్టి వెఱ్ఱివాఁడవు సుమా ! ఇట్టి వెఱ్ఱిని జూపితివా యిచ్చిని నిన్నుఁ బెండ్లాడదు. నాప్రయాసమంతయును వ్యర్థమగును. అట్లు చేయకుము. స్త్రీ లెప్పుడును నే నీతనిఁ బెండ్లాడుదునని నోటితోఁ బల్కరు. తమయభిప్రాయమును జేష్టలచే సూచింతురు; వినుము, ఆరాకుమారి యీ రాత్రి యచలేశ్వరునిదర్శింప నిశ్చయించుకొని నిన్ను సహాయునిగా రమ్మని కోరుచున్నది. ఇఁక నింతకంటె నేమి కావలయును. నీయందుఁ బరపురుషబుద్ధియే కల్గిన నిన్నామె రానిచ్చునా ? మఱియు, నేను నీగుణములు వర్ణించి చెప్పితిని. ఆమె యన్నియు నత్యాదరముతో విన్నది. ఇఁక నిన్నామె చేపట్టుట నిస్సంశయము. నే నింత కష్టపడినందులకు నా కీయఁ దలఁచిన బహుమాన మీరాత్రియే యిమ్ము' అని యామె పల్కెను.

'తప్పక యిచ్చెదను. ఇప్పుడే తెచ్చెదను. ఈరాత్రియె వెళ్ళవలయునా ! నీవుగూడ వచ్చెదవా ?' అని యతఁ డడిగెను.

'వచ్చెదను. ఆమె దేవతాదర్శనమునకుఁ బోవుచున్న విషయము నీకుఁ దప్ప మఱెవ్వరికిని దెలియనీయఁగూడదని యారాజకుమారి యభిప్రాయము. నీ వెవ్వరికిని దీనిని జెప్పకుము. ఆమె యాలయమునకుఁ బోయివచ్చుటకు సవారి నొక దానిని సిద్ధపఱుపుము. నేఁడు నీవు చేసిన యేర్పాటుల కామె యెంతయు సంతసింపవలయును. నీవు త్వరగాఁ బోయి భుజించి రమ్ము. వచ్చునప్పుడు నాబహుమానము మాత్రము మఱవ

కుమా!' అని పల్క నభయసింగు తన్నుఁ గృతార్థునిగాఁ దలంచుచు నింటికి వెడలిపోయెను.

ఆహా! లోకములో నెంతలేసిమాయావు లున్నారు! ఈరూపవతి యిచ్ఛినీకుమారియెదుట నేఁడు తప్ప నభయసింగును వేఱొకప్పుడు స్మరించినపాపమునఁ బోలేదు. అభయసింగునియభిలాషమైనను నామె కెప్పుడును దెలుపలేదు. ఇట్లుండ నతనికార్యము నెఱవేర్చినట్లే మాటాడి యభయసింగును మోసపుచ్చి యది ధనము లాగుచున్నది. ఇచ్ఛినీకుమారి తనతోఁగూడి యచలేశ్వరాలయమునకుఁ బోవనుండుటచేఁ దనయందామె కభిలాషయే లేనిచో ధనసాయము నడయుట కిష్టపడ దని తలంచి యాయువతి తన్నుఁ బెండ్లాడుట నిశ్చయమేయని యభయసింగానాఁడే యామె కీయఁదలఁచినబహుమాన మిచ్చివేసెను.

రాత్రి జామున్నఱ కావచ్చినది. అభయసింగుచితములగు వస్త్రాలంకారములు ధరించి ఖడ్గపాణియై యిచ్ఛిని యంతఃపురద్వారమునొద్దకుఁ బోఁగా నక్కడ రూపవతి ప్రత్యక్ష మయ్యెను. వా రేదియో సంభాషించుచుండ నా రాకుమారి చక్కఁగా నలంకరించుకొని మేలిముసుఁగు వైచికొని వచ్చి సవారిలోఁ గూర్చుండెను. బోయీలు సవారీ నెత్తుకొని నడవసాగిరి. రూపవతి సవారీకొకప్రక్క నడచుచుండెను. అభయసింగు జాగరూకుఁడై ఖడ్గపాణియై యాసవారీని వెంట నంటి పోవుచుండెను. వారు కొలఁదికాలములోనే యచలేశ్వ

రునియాలయమును బ్రవేశించిరి. అభయసింగదివఱకే వార్త పంపుటచే నర్చకు లారాకుమారిరాకకై వేచియుండిరి. సవారీ నక్కడ దింపఁగానే యామె రూపవతితోఁగూడి యాలయ మును బ్రవేశించెను. సవారీనుండి పైకి వచ్చునపు డామె సుందరరూపము నొకమాఱు కన్నులారఁ గాంచవలెనని యభయసింగు ప్రయత్నించెను. కాని, తదీయశరీరమంతయు మేల్ముసుఁగుచేఁ గప్పఁబడియుండుటవలన నతనిమనోరథము సిద్ధింపలేదు. వారిని వెంబడింప మన స్సొంతపీకుచున్నను మర్యా దకు వెఱచి యారాకుమారుఁ డచ్చటనే నిలిచిపోయెను.

ఇచ్ఛినీకుమారి దేవునికి భక్తిపూర్వకముగ నమస్క రించి నిమీలితలోచనయై చేతులుజోడించి పలువిధముల నీశ్వ రుని స్తోత్రముచేసి 'ఓదేవా! ఓపరమేశ్వరా! ఓభక్తవత్సలా! ఆపన్నులరక్షింప నీకంఁ దక్క నెవ్వరికి శక్తిగలదు. ఇంద్రాదు లునుగూడ నీకరుణాలేశమునకుఁ బాత్రులుగానిచో నిరపాయ ముగా సుఖింపఁజాల రనునప్పుడు మావంటి మనుష్యమాత్రుల సంగతి చెప్పనేల! అనాథనాథా! నీపాదపద్మములందలి మకరందమును ద్రావుటకు నాచిత్తమధుకరమును బురి కొల్పుము. నీ కిదె నమస్కారముగావించి వేఁడుకొనుచున్న యీదీనురాలిని రక్షింపుము. భక్తురాల నగు నాకోర్కె దీర్చుట నీకు విహితముగదా! హాలాహలముచేఁ బీడితులగు దేవతలమొఱ లాలించి యావిషమును మ్రింగి లోకములను గాచిన కరుణాకటాక్షము నీదీనురాలిపైఁ బఱపుము. మృత్యువు

గుండెలను జీల్చి మునిబాలకుని మార్కండేయుని రక్షించిన దయారసము నీదాసురాలిపైఁ జిల్కుము. నామూలమున నాబూగడమునకు వచ్చుచున్నయుపద్రవముఁ దప్పింపుము. నాకోర్కె లీడేర్పుము' అని వేఁడి మరల నమస్కరించి తత్ప్రసాదమును స్వీకరించి మరలివచ్చి సవారీలోఁ గూర్చుండి త్రికాలజ్ఞుఁడగు బైరాగిదర్శనము గావించి రాఁబోవుస్థితిగతులను దెలిసికొనఁగల్గిన నందులకుఁ దగినప్రతిక్రియ నాలోచించుకొనవచ్చునని నిశ్చయించి సవారీని బైరాగిమఠమునకుఁ గొనిపో నియమింప నాబోయీ లట్లు గావించిరి.

ఆమఠము దేవాలయమున కెంతో దూరము లేకపోయినను నొకమూలయం దుండుటచేఁ బ్రియత్నించి సమీపించినవారికిఁగాని యది కంటఁబడదు. బోయీ లాసవారీని నా మఠముగుమ్మమునొద్ద దించిరి. ఇచ్ఛానీకుమారి దిగి రూపవతి వెంటనంటి పోయి నెగడియొద్ద జపముగావించుకొనుచున్న బైరాగిని దర్శించెను.

అతనిశరీరము విభూతిపూఁతచే మిక్కిలి తెల్లనయి యుండెను. అవయవపటుత్వము కొంచెమేనియు సడలినట్లు లేదు. కాని; జడలును, గడ్డమును నెఱసి ముదుసలివాఁ డని చెప్పుచుండెను. అతనిశాంతరూపమును, బూడిదపూఁత చే మిక్కిలి తెల్లగానున్నశరీరమును, జటాకలాపమును జూచి తనయభిలషితములను దీర్చుటకై బైరాగివేషమునవచ్చిన యాయచలేశ్వరుఁడేమో యని సందేహించుచు నా రా

కుమారి యతనిని సమీపించి నమస్కరించి యతఁడు చేసైగ చేఁ జూపిన యొకపులిచర్మముపైఁ గూర్చుండెను. రూపవతియు నామెకు దగ్గఱగా నిలువఁబడెను.

అప్పుడు బైరాగి మంటవెలుఁగున నాయువతిహస్త రేఖలు పరిశీలించి కొంచె మాలోచించి యామెముఖమును నిదానించిచూచి యిట్లు సంభాషించెను.

బై — కుమారీ! నీమనోరథము నాకుఁ దెలియవచ్చినది. నీ వొక రాజాధిరాజును వరింపఁ దలఁచుకొన్నావు కదా?

ఇచ్ఛా — అవును, నాకోర్కె నెఱవేఱునా, లేదా? సెలవిండు.

బై — నీవు కోరునట్టిరాజు నీకు భర్తయగునట్లు లేదు. కాని, యతనికంటె గొప్పవాఁడగు మఱియొక రాజు లభించును.

ఇచ్ఛా — స్వామీ! నేను గోరుకొన్న పురుషుఁడు లభింపనిచో నా కీజన్మముతోఁ బనియేమి? అప్రియుఁడగు పురుషుని వరించి కష్టములబారిఁ బడుటకంటె మరణించుటయే యుత్తమము గదా!

బై — తల్లీ! స్థితిగతుల నాలోచింప నట్లు తోఁచుచున్నవి. ఏమిచేయుదును! అమ్మాయి! మఱియొక సమాచారము. నీమూలమున మీతండ్రిరాజ్యమునకు గొప్పయుపద్రవ మొకటి రానున్నది.

ఇచ్ఛా — యోగీంద్రా! తమ వాక్యము నిజము. ఆయుపద్రవమును దలంచుకొనియే మేమును విచారించు

అభ—అంతవఱకు నీరాజపుత్రి నిచ్చట నొంటరిగా వదలిపోవుటకు భయపడుచున్నాను.

బై—అట్లయిన మఱియొకనాఁడు వత్తువా ?

అభ—వచ్చెదను. కాని, యెప్పుడు రమ్మందురు ?

బై—ఒకనెల పోయినతరువాత రమ్ము.

అభ—అమ్మయో, అంతకాలమే !

బై—మఱి, యేమిచేయుదును ! ఈలోపల మంచి దినము లభింపలేదు.

అభ—నేఁ డయినచో ?

బై—చెప్పెడిదేమి ! ఇంతటిమంచిదినము మఱి లభింపదు. కాని, నిన్ను నమ్ముకొనివచ్చిన రాజకుమారిని విడిచి నావెంటవచ్చుట యుక్తముకాదు కదా !

అభ—స్వామీ ! రూపవతి రాజకుమారిని భద్రముగాఁ గొనిపోవుదు నన్నది. మన మామూలికను సంపాదింపఁ బోవుదము.

బై—అట్లయిన సంతోషమే, అని పలికి రూపవతిని జూచి 'యువతీ ! నానిమిత్తము మీరు వేచియుండ నవసరము లేదు. రాజకుమారిజపము పూర్తి కాఁగానే మీ రింటికిఁ బొండు' అని చెప్పి యతఁడు మఠమునువిడిచి నడవసాగెను. అభయసిం గతనిననుసరించి పోవుచుండెను.

రూపవతి కొంచెముసే పచ్చటఁ గూర్చుండి బైటికి వచ్చి బోయీలను మేల్కొలిపి 'ఓరీ ! రాజకుమారి తొందర

పడుచున్నది. లెండు లెండు' అని పల్కఁగా వారు లేచి నిద్దురచే మూఁతపడుచున్నకన్నులతోనే యాసవారీని మోసి కొనిపోయిరి.

## పదునాల్గవ ప్రకరణము

## ఢిల్లీపురములోని కుట్ర

ఢిల్లీపురమున నొక విశాలరాజభవనమందుఁ బృథ్వీరాజొకనాఁడు నిండుకొలువుదీర్చియుండెను. అతనికిఁ గుడిప్రక్కన నతనిపినతండ్రి కరుణారాజును, నతనికుమారుఁడును, మఱికొందఱు రాజులును గూర్చుండిరి. ఆసింహాసనమున కెడమపైపున మంత్రులును, సేనానాయకులును, చాళుక్యవంశజులగు ప్రతాపసింహాదులును గూర్చుండిరి. తక్కిన సామాన్యజనులు యథోచితస్థానముల నుండిరి. దాడిమిబీజములవలెఁ గిక్కిఱిసిన ప్రజాసమూహముచే నాసభాభవనము నిండి పున్నమనాఁటిసముద్రమువలెఁ దొణఁకులాడుచుండెను.

ఆసమయమున చాందుభట్టనెడి మహాకవి లేచి రాజేంద్రున కెదురుగా సభామధ్యమున నిలిచి మేఘగర్జనమువలె గంభీర మగు కంఠస్వరముతోఁ జోహానవంశజులకీర్తిని, బరాక్రమమును, సాహసమును, ధైర్యమును బొగడుచుండెను. ఆగుణవర్ణనము విని సభ్యులందఱును సంతోషించుచుండిరి. కాని, చాళుక్యవంశసంభవుఁ డగు ప్రతాపుఁడు లోకములోని

రాజమండలమునకెల్ల మిక్కిలి యవమానకర మగునావర్ణనమును విని సహింపలేకపోయెను. దుస్సహ మగు కోప మతని మనస్సున నావరించెను. ఆకోపలక్షణములు పైవారి కగపడకుండునట్లు చేయవలెనని యతఁడు ప్రయత్నించెను. కాని, యతనికి శక్తి లేకపోయెను. తక్కినవారికివలె నా కట్టి ప్రతాపునిముఖమందు వికాస మంకురింపలేదు. అతనిచూపులు సంతోషమును వెలిపుచ్చలేదు. ముఖమందు వ్యాపించిన క్రోధాగ్నిజ్వాలలకు ధూమరేఖవలె నున్నమీసముతో నతని కుడిచేయి మంతనమాడుచుండెను. ప్రతాపసింహునివికారలక్షణములను గనిపట్టి కరుణరాజు మిగులఁ గోపోద్దీపితుఁడై సింగపుఁగొదమువలె నాతనిపై లంఘించి 'ఓరీ, దురాత్మా! మాచోహానవంశజులగుణములను వినుటకు నీ కంత కష్టముగా నున్నదా ? నిన్నుఁ బోషించుప్రభువర్ణనము విని యానందించుటకు మాఱుగాఁ బొగచూఱినమోముతో నిటు కటకటంబడ నేల ? చోహానులప్రతాప మెట్టిదో రుచిచూచెదవు ? పిడుగువంటి యీకత్తిదెబ్బను గాచుకొను' మని కత్తి మీఁదికెత్తెను. అదివఱకే మండుచున్నక్రోధాగ్ని కాకరుణరాజు వచనములు నేతిధారలు కాఁగా నాప్రతాపుఁడు చటాలునఁ గత్తిదూసి యతని నెదుర్కొనెను. వా రిరువురును బోరుచుండిరి. అది చూచి సభ్యులందఱును నివ్వెరపడి చూడసాగిరి. పృథ్వీరాజుగూడ నేమిచేయుటకును దోఁపక సింహాసనమునఁ గూలఁబడెను. కొన్ని నిమిషములలోఁ బ్రతాపుఁడు కరుణరాజుఖడ్గమున కెరయయ్యెను.

అది చూచి ప్రతాపునితమ్ముఁ డరిసింగు, కరుణరాజు నెదుర్కొని పోరనారంభించెను. కాని, మహాపరాక్రమశాలి యగు కరుణునియెదుట నాతఁ డెంతోసేపు నిలువఁబడలేక పోయెను. అతఁడుగూడ నిహతుఁ డయ్యెను. అందులకుఁ గినిసి తక్కినసోదరు లైదుగురు ఖడ్గపాణులై కరుణునిపైఁ గవిసిరి. అది చూచి పృథ్వీరాజు చటాలున లేచి తనపినతండ్రిని వారించి యారాజకుమారులనుగూడ మంచిమాటలాడి యాకలహ మప్పటికిఁ జల్లార్చెను, అకారణకలహమునకుఁ గారకుండగు పినతండ్రిని జీవాట్లుపెట్టి పృథ్వీరా జతనితోఁగూడ నంతఃపురమునకు వెడలిపోయెను. చాళుక్యవంశజులుగూడఁ గ్రోధవిచారములచే సంతప్తములగుహృదయములతోఁ దమ యింండ్లకుఁ బోయిరి. అనంతరము పృథ్వీరాజు వారియిండ్లకుఁ బోయి తగినమాటలచే వారివిచారము లడఁగించుటకుఁ బ్రయత్నించెను. కాని, భయంకరముగా నుద్రేకించినకార్చిచ్చు మంచువానచేఁ జల్లాఱునా? రాజువచనములకు వారికోపము శమింపలేదు. కాని, వారు శాంతులయినట్లు చూపట్టిరి.

ఇది జరిగిన కొంతకాలమునకు ఢిల్లీపురములో నొక మందిరమున నైదుగురుసోదరులును గూర్చుండిరి. వారిచెంత మఱియొకపురుషుఁ డుండెను. వారు కొంతసేపు మౌనముద్రాధారులై యుండిరి. అపు డాసోదరులలో నొకఁడు మెల్లగా 'అమరసింహా! మాభీమదేవునకు మాయం దింత యకారణ వాత్సల్య ముదయించుటకు హేతు వేమి? మంచిమాటలచేఁ

జేరఁదీసి తుదముట్టింపవలె నని యున్నదా యేమి ?' అని యడిగెను.

అమ—రాజపుత్రులారా ! మీ రెంతమాత్రి మట్లు తలంపకుఁడు. భీమరాజుది వెఱ్ఱికోపము. ఒక్కమా టు దే్రకించి యప్పటికప్పుడే యది చల్లాఱును. ఈవిషయము మీ రెఱుఁగనిది కాదు. లోకమున మిక్కిలి ప్రసిద్ధమయిన చాళుక్య వంశమునఁ బుట్టిన మీరు పరరాజులను సేవించుట యతని కిష్టములేదు. దానివలనఁ జాళుక్యవంశము గౌరవము పోవు నని యతనితలంపు. అందులోఁ జాళుక్యవంశసంభవులకు, సహజవైరులగు చోహానవంశజుల సేవించుట మఱింత యవ మానకరము. మీ రీ పృథ్వీరాజును సేవించుచున్నా రని యతఁడు మిగుల ఖేదపడుచున్నాఁడు. మిమ్ము తఱిమివేసినం దుల కతఁడు మిక్కిలి పశ్చాత్తాపము చెందుచున్నాఁడు. మి మ్మాదరించి చేరఁదీయవలెనని తలంచి యారాజు న న్నిచ్చ టికిఁ బంపెను. ఈనడుమ మీయన్న లిద్దరును గరుణరాజుచేఁ జంపఁబడి రని విని యతఁడు చెందుచున్నవిచారమునకు మేరయేలేదు. వీరులారా ! ఈపృథ్వీరాజు మీవంశమున కంతటికిని బగవాఁడు. మీ కీ నడుమ నెట్టియాపద గల్గించెనో మీ రెఱుఁగుదురు. కరుణరా జన్యాయముగా మీయన్నలను జంపుచున్నప్పు డీరాజు చూచి యూరకుండెను. వాని వారిం చుటకైనను బ్రియత్నింపలేదు. ఆశ్రయించినవారిని జంపిం చుట యన్యాయము. ఈవిషయము పృథ్వీరా జెఱుఁగఁ

డందురా! అట్లన వీలులేదు. తనకన్నులయెదుట నేకదా యీ ఘోరము ప్రవర్తిల్లినది. అతని కీపనియే సమ్మకము కాని చో వెంటనే లేచి తనపినతండ్రిని వారించియే యుండును. మీ రెంత మంచిగాఁ బ్రవర్తించినను నతఁడు మిమ్ము నమ్మఁడు. మీయందున్న ద్వేషబుద్ధి విడువఁడు. కావున, మీరు భీమ రాజుపక్షము నవలంబింపుఁడు. ఈరాజునకును, భీమునకును గానున్న యుద్ధమున నతనికిఁ దోడుచూప నంగీకరింపుఁడు. అతనివలన గౌరవమును, సంస్థానములను బొంది సుఖముగా జీవింపుఁడు. నా వచనములు నమ్ముఁడు. నా పల్కినదానియం దనృతము కొంచెమైనను లేదు. మిమ్ము వంచించుటకు రాలేదు. భీమదేవునిమనస్సు మీయం దెంత ప్రసన్నత వహించినదో యొక్కమాఱు వచ్చి చూచిన మీకే బోధ పడును.

అనిపల్కుచున్న యమరసింహునివాక్యములు విని వా రధికాశ్చర్యము పొందిరి. తమతండ్రికాలమునుండియుఁ దమతో మహావిరోధ మవలంబించిన భీమదేవుఁడు తమపై నేఁ డింత ప్రసన్నత వహించుటకుఁ గారణమేమో వారికి బోధపడ లేదు. అగ్నికిఁ జల్లదనమట్లు భీమున కంతసాధుత్వ మబ్బుట యసంభవ మని వారి తలంపు. మంచిమాటలాడి తన చెంతకు రప్పించుకొని భీముఁడు తమ్ముఁ జంపునేమోయన్న యనుమానము వారిని వదలలేదు. వేఱొకచోటికిఁ బోయి వా రయిదుగురు నేమేమో కూడఁబలికికొని మరలివచ్చి 'అయ్యా!

అమరసింహా! మమ్మేల బలాత్కరింతువు? మాభీమన్న పరివర్తన మాలోచింప మా కతనియందు దించుకేనియు నమ్మకము వొడమకున్నది. ఏదో యొకమూలఁ బడి బ్రతుకుచున్న మమ్మిట్లు బ్రతుకనిమ్ము' అని పలికిరి.

అది విని యమరసింహుఁడు 'రాజకుమారులారా! మీ రన్నది నేను కాదనను. భీముని వెనుకటివర్తన మరయ మీ రట్టి దురభిప్రాయము నొందుట తప్పుగాదు. ఇదిగో! దైవసాక్షిగాఁ బల్కుచున్నాను వినుఁడు. భీమదేవుఁడు మిమ్మాదరించుట కాటంక మేమియును లేదు. అతనివలన మీ కగౌరవముగాని, యపాయముగాని సంభవించిన నాప్రాణముల నిచ్చియైనను దప్పించెదను. మీ కేమయిన ననుమానమున్నచో మీలో నొకరు నాతో ఘూర్జరదేశమునకు వచ్చునది. ఈవిషయమై భీమున కెంత పశ్చాత్తాపమున్నదో తెలిసికొనునది. మీ కతనియందు నమ్మకము గల్గినచో వచ్చి యతనిఁ జేరుఁడు, లేనిచో మీ యిష్టమువచ్చినట్లు నడవుఁడు. మఱియొక సమాచారము, నే నిట్లనుచున్నానని కోపింపకుఁడు. అయ్యా! మీరు రాజపుత్రులు గారా? మీకుఁ బౌరుషము లేదా? బుద్ధిపూర్వకముగా మీ కపకార మొనర్చిన యీ రాజును సేవించుట కష్టమనిపింపలేదా? భీముఁడుకూడ మీ కపకారియే కానిండు. అయినను, మీరందఱొక కుటుంబములోనివారు. మీలో మీ రేమనుకొన్నను దప్పుకాదు. ఇంతకును గృతమునకై భీముఁడు పశ్చాత్తాపము నొందుచునే

యున్నాఁడు. కావున, నా మాట వినుఁడు; ఈరాజును విడువుఁడు' అని నచ్చఁజెప్పి వారిలోఁ బెద్దవాఁడగు గోకులదాసును దనతోఁగూడ నన్హిలపురమునకుఁ గొనిపోయెను.

## పదునారవ ప్రకరణము

## అన్వేషణము

దాసీజనము వాడుక చొప్పునఁ బ్రాతఃకాలముననే వచ్చి కన్యాంతఃపురమునఁ బనులు చక్కఁబెట్టుకొనిరి. ఇచ్చినీ కుమారిపడకటింటితలుపు బంధింపఁబడియుండెను. ఎల్లప్పుడును దమకంటె ముందుగానే మేల్కొనియుండు రాజకుమారి నాఁడంతసేపేల నిద్రించుచున్నదో వారికి బోధపడలేదు. రాత్రి చాలభాగమువఱకును మేల్కొనియుండుటచే నామె యింకను నిదురపోవుచుండవచ్చు నని వారెల్లో మనస్సమాధానము చేసికొని యామెనిమిత్త మచ్చటనే వేచియుండిరి. రాజకుమారి మేల్కొనునంతవఱకును దాసీజన మామెశయన గృహమును బ్రవేశించువాడుక లేదు. అందుచే నాగృహమును బ్రవేశింప నెవ్వరు సాహసింపరయిరి. పనులన్నియు నెఱవేర్చుకొన్నవా రగుటచే నచ్చటచ్చటఁ గూర్చుండి యేమియో పరిసంగించుకొనుచుండిరి. క్రమముగా సూర్యభగవానుఁడు తనకిరణజాలమును లోకముపైఁ బ్రసరింపఁజేయుచు గగనసౌధము నెక్కి వచ్చుచుండెను. కాని, యిచ్చిని

యింకను మేల్కొనలేదు. నాఁ డెందుచేతనో రూపవతిగూడఁ బైని గన్పట్టకపోవుటచే నామెయు నాకుమారిచెంతనే నిద్రించి యుండు నని తలంచుచుండిరి. ఇంతలో నీశ్వరభట్టచ్చటికి వచ్చెను. అతఁ డిచ్ఛినికి గురువు. ప్రస్తుతము సంస్కృతభాష నామెకు నేర్పుచుండువాఁడు. అందుచే నతఁడు వాడుకను బట్టి సంస్కృతమును జెప్పుటకై వచ్చెను. అతనిఁ జూచి దాసీజనమందఱును లేచి నమస్కరించిరి. అతఁడు వారిని జూచి 'రాజకుమారి యెక్కడ?' యని యడిగెను.

దా—ఆమె నిద్రపోవుచున్నది.

ఈ—ఇంత సేపటిదాఁక నిద్రించుట యేమి! ఇట్టి యసందర్భ మెప్పుడును లేదే!

దా—అయ్యో! ఈపురమునకు రానున్న కష్టములను గూర్చి తలపోయుచు నామె రాత్రియందుఁ జాలవఱకు మేల్కొనియుండును. అందుచే నింకను నిద్రించుచున్నది కాఁబోలును!

ఈ—అగుఁగాక! సూర్యుఁ డుదయించి యిప్పటికిఁ నాల్గయిదు గడియలు కావచ్చినది. ఇంకను నిద్రించుట యేమి? పోయి మేల్కొలుపుఁడు.

దా—ఆమె యాగ్రహించునేమో?

ఈ—మీ కాభయము వలదు. ఆమెకు సమాధానము నేను జెప్పెదను గాదా!

అనంతరము రాజకుమారియొద్ద నెక్కుడు చనవుగల యొకదాసీ వెళ్ళి యిచ్చినిపడకటింటితలుపును ద్రోసెను. లోపలగడియ వేయకపోవుటచేఁ దలుపులు తెఱవఁబడెను. అంతట నాయువతి మెల్లగా నడుగులిడుచుఁ బోయి రాజకుమారితల్పమును సమీపించి చూచెను. కాని, యం దామె లేదు. అందుల కది యచ్చెరువంది గది నలుప్రక్కలను వెదకి యామెకనఁబడకుండుటకు మిగుల విచారమును, దొట్రుపాటును గని పైకివచ్చి రాజకుమారి యందు లేదని తెల్పెను. అంత దాసీజనమందఱును దిగులునొంది హాహాకారములు చేయుచు నంతఃపురమునాలుగుమూలలందును వెదకిరి. కాని, లాభములేకపోయెను. కొందఱు రూపవతియింటికిఁ బోయి చూచిరి. కాని, యది యింట లేదు. రూపవతియు నిచ్చినియుఁ గలసి యెచ్చటికో పోయియుందురని వా రనుకొనిరి. ఇంతలో నావార్త పురమందంతటను బ్రాఁకుటచే జనులు గుంపులుగట్టి యంతఃపురమునకు రాఁదొడంగిరి. చళుకసింహుఁ డావార్త విని దుఃఖితుఁడై పర్వుపర్వునఁబోయి దాసీజనమును బిలిచి నానావిధములఁ బ్రశ్నించుచుండెను.

భీమదేవుని సందేశహారునిఁ దిరస్కరించి పంపివేసినది మొదలు యుద్ధప్రయత్నములు చేయుచున్నవాఁ డగుటచే జైతుఁ డొకనాఁడైన నింటిపట్టున లేఁడు. రాజపుత్రులసాయమును గోరుటకై గ్రామాంతరములకుఁ బోవుచుండెను. కావునఁ, దొలినాఁడే యెచ్చటికో పోయిన జైతపరమారుఁడు

మఱలి తనపురమున నడుగు పెట్టియుఁబెట్టకమునుపే యెవరో యీదుర్వార్త యాతనిచెవిని వేసిరి. ఇది విని యతఁడు పిడుగడఁచినట్లు క్రిందఁ గూలఁబడియు నట నుండుటకుఁ దోఁచక వెంటనే కన్యాంతఃపురమునకుఁ బోయెను. అచట నావృత్తాంతమంతయును విని ధైర్యమును విడిచి బోరున నేడ్వఁదొడంగెను. ఇచ్ఛినియం దాతనికిఁగల ప్రేమ నిరవధికమైనది. ఆపిల్ల చిన్నతనమందే యతఁడు భార్యావియోగము నొందినను మాఱువివాహము చేసికొనక యామెను జూచుకొనియే జీవించుచుండెను. ఆబాలికయుఁ జదువుచేతను, దెలివితేటల చేతను దండ్రిమనమును బూర్తిగా లోఁబఱుచుకొని యతని ప్రేమ కగ్రస్థాన మయ్యెను. అట్టి గుణవంతురాలును, ప్రాణాధికయు నగు కుమారి యాకస్మికముగాఁ గనఁబడలే దని విన్నప్పు డారాజుమన స్సెంత కలఁతఁజెందెనో యెవరు చెప్పఁగలరు ? అతఁడు కొంతసేపు దుఃఖమున మునిఁగియుండి యెట్టకేలకు ధైర్యమవలంబించి దాసీజనమును బిలిచి యాసమాచారమంతయు నడిగెను. తొలినాఁడు జామురాత్రివఱకు నామెయు, రూపవతియు మాటాడుచు నంతఃపురమున నున్నారనియుఁ దరువాతివృత్తాంతము మాకుఁ దెలియ దనియుఁ జెప్పిరి. పిమ్మట నతఁ డంతఃపురద్వారరక్షకులను బిలిచి యడుగ వారిట్లు చెప్పిరి. 'మహాప్రభూ ! నిన్నరాత్రి జామున్నఱ కడచినపిమ్మట రూపవతి యొకసవారీని లోనికిఁ గొనిపోవుచుండ నే న దేమని యడిగితిని. 'ఓయీ ! ఇదేమియును

గాదు. రాజకుమారి యచలేశ్వరునిఁ జూడఁబోవుచున్నది. అందులకై యీసవారిని గొనిపోవుచున్నాను. ఈవృత్తాంత మెవ్వరితోను జెప్పవల దని రాకుమారి కోరుచున్నదని చెప్పి రూపవతి లోపలికిఁబోయెను. కొంత సేపటికి సవారీలోఁగూర్చుండి రాజకుమారి స్వామిదర్శనార్థ మరిగెను. కాని, యామె మరల సవారితోఁ గొలఁది కాలములో నే యంతఃపురమునకు వచ్చెను. ఇంతకుఁ దప్ప మా కేమియుఁ దెలియదు.'

'సవారితో మరలివచ్చినచో రాకుమారి యేల కన్పడదు ?' అని వారిసందియము. అంత నొకపరిచారకుఁడు పోయి యచలేశ్వరస్వామియర్చకుని దీసికొనివచ్చెను. అతఁడు రాజును సమీపించి నమస్కరించి యుచితాసనమునఁ గూర్చుండెను. అపుడు బెదరుచున్నచిత్తముతో రాజావిష యమై యతని నడుగఁగా నాపూజారి చేతులుజోడించి మహా ప్రభూ ! నిన్న యభయసింగు వచ్చి 'ఈరాత్రి రాజకుమారి స్వామిదర్శనార్థము వచ్చును గాన మఱికొంతసేపు వేచి యుండు' మని నాతోఁ జెప్పెను. నే నట్లే వేచియుంటిని. రాత్రి రెండవయామము ముగియుచుండ రాజకుమారి యాల యమునకు వచ్చినది. ఒక చెలికత్తెయు, నభయసింహుఁడును నామెతో వచ్చిన ట్లున్నది. ఆమె స్వామిని దర్శించి ప్రసా దమును స్వీకరించి సవారీలోఁ గూర్చుండి యింటికి మరలి వచ్చెను. ఇంతకంటె నా కేమియును దెలియ దని మనవిచేసి కొనెను.

అంతట బరమారుఁడభయసింగునకు వార్తపంప నతఁడు రాత్రినుండియు నింటికి రాలేదని యచటివారు చెప్పిరి. ఇవన్నియు ముడివేసి చూడఁగా రాజకుమారియు రూపవతియు నభయసింగును గలసి యెచ్చటికో పాఱిపోయి యుందు రని తోఁపకపోదు. మఱియు నభయసింగు సర్వదా రూపవతి నాశ్రయించుటచేఁ జతురురాలగు నాయువతి రాజకుమారి కభయసింగునం దనురాగము గల్గించి వారికిఁ బెండ్లి గావించి పరమారునివలన భయముచే నెక్కడికో పాఱిపోయిరనికూడఁ దట్టకమానదు. కాని, యీ యూహ విశ్వాసార్హము కాదు. అభయసింగు జనప్రియుఁడు, గుణవంతుఁడు, విశేషించి రాజు నకు మేనల్లుఁడు, రాజగౌరవమునకుఁ బాత్రుఁడు. ఇట్టివానిని రాజకుమారి వరించినచో రాజు సంతోషించు గాని యామెను గోపింపఁడు. జైతుఁడు తనసోదరికిఁ జెప్పినసమాధానము నాలోచింప నీయంశము తెల్లముకాకమానదు. ఇట్లుండ నామెకుఁ బురమును విడిచి పోవలసినంత యవసరమేమి ? మఱియు, నిచ్ఛినిప్రవర్తన మరసినవా రామె యంతసాహసము పూనునని తలంపరు.

ఇట్లెంతసేపు గూర్చుండి యాలోచించినను రాజ కుమారి యేమయినదో వారికి బోధపడలేదు. జైతపర మారుఁడు చిరకాలము దుఃఖించి యెట్టకేలకు ధైర్యమవలం బించి వేఁడినిట్టూర్పులు దందడింప నచ్చటివారిని జూచి 'మంత్రులారా ! హితులారా ! సేవకులారా ! మాయిచ్ఛిని

ధూర్తురాలు కాదు. సద్గుణవతి, యోగ్యురాలు. ఆమె తనంతఁ దా నిల్లువిడుచుట కంగీకరించియుండదు. శత్రువు లెవ్వరో యామెనుగొనిపోయి యుండవలయును. అభయసింహుఁడును, రూపవతియు, నిచ్ఛినియు శత్రువులచే వంచింపఁబడియుందురు. దేవాలయమునుండి యీదుర్గమునకు వచ్చులోపలనే యీ ఘోరము జరిగియుండవలయును. రక్షకభటులు సవారీ మరల నతఃపురమునకు వచ్చినదని చెప్పుచుండుటచే నదియు నసంగతముగానే యున్నది. నాకుఁ బ్రాణపదమగు కుమారిజాడ లెవ్వరు తీయుదురో వారికి గొప్ప బహుమాన మిచ్చెదను. పోయి చుట్టుపట్ల దేశములు వెదకి యామెవృత్తాంత మరసి వినిపించి నన్ను బ్రదికింపుఁ' డని పలికెను.

## పదునారవ ప్రకరణము

---

## బాటసారులు

ఆబూపర్వతమునకుఁ బడమటిదెసను సమీపముగా నొకదుర్గము కలదు. అదిఘూర్జరరాజ్యములోనిది. ఆసమీపారణ్యముల నివసించుదొంగలు గ్రామములపైఁ బడి కొల్లఁగొట్టి దేశమునకు మహాపద్రవముఁ గల్గించుచుండ దాని నడంపఁజాలినసైన్య మాప్రాంతమున నివసించియుండుటకు భీమునిపూర్వు లెవ్వరో యాదుర్గమును గట్టించిరఁట. మన కథాకాలమున నాకోటలో సామాన్యమగుసైన్యము కలదు.

మధు వచ్చుట విశేషముగా లభించుటచే దానికి మధుమంత మని పేరు వచ్చెను.

ఒకనాఁటి తెల్లవాఱుజామున నొకపురుషుఁ డాదుర్గము నుండిబయలుదేఱి యచ్చటికిఁ బోవుచుండెను. వానిభార్య కొంతదూరముదాఁక వానిని వెంబడించి పోయెను. అది భర్తతో 'మన యదృష్ట మిప్పుడు తెల్లముగావలెను. ప్రభువున కభీష్టకార్యమును నెఱవేర్చుటలో మిక్కిలి తోడ్పడితిమి. మనకుఁ దగినబహుమానము లభింపక తీఱదు. మన గురువుగా రీయుత్తరమునఁగూడ వ్రాసినారఁట! మిగులఁ గష్టపడిన మనకు బహుమాన మిప్పింపఁ దలంచియే నిన్నుఁ బ్రభువు చెంతకుఁ బంపుచున్నాఁడఁట. గురువుగా రీమాట నాతో స్పష్టముగాఁ జెప్పినారు. నీవు భద్రముగాఁ బోయి బహుమాన మందుకొని రమ్ము' అని చెప్పి యతనిఁ బంపి యాయువతి యింటికి మఱలెను.

వాఁ డుత్సాహభరితుఁడై యుండుటచేతను, నేదే ఫలాపేక్షగలవాఁ డగుటచేతను,మార్గము శిలామయ మైనను, విషమమైయున్నను సరకుగొనలేదు. భార్యను విడిచి వాఁడు పదిబారలదూర మేగకమున్నె మఱియొక బాటసారి వానిని గలసికొని యిట్లు సంభాషించెను.

రెండ — ఓయీ! నీ వెక్కడికిఁ బోవుచున్నావు?

మొద — నేనా! చాలదూరము పోవలయును.

రెండ — అదే! ఏ యూరునకుఁ బోవుదువు?

మొద—పశ్చిమసముద్రతీరముననున్న యొక పల్లెకు.

రెండ—మంచిది, నేను గూడ నీతోఁ జాలవఱకు వచ్చెదను.

మొద—ఎంతదూరము ?

రెండ—వల్లభీపురము వఱకును.

మొద—సరియె! మనము కలసియె పోవుదము.

అని వారు కూడఁబలికికొనుచుఁ బోవసాగిరి. మహారణ్యములచేతను, గుట్టలచేతను దుర్గమ మగు నామార్గము వారిని మిగుల శ్రమపెట్టెను. కొంతదూర మేగినతరువాత వా రొక చెట్టునీడను విశ్రమించిరి. రెండవ బాటసారి యాయాసముచే మాటాడక మొదటివానివంకఁ జూచుచుఁ గూర్చుండెను. మొదటి బాటసారి మార్గాయాసమునకు సుంతయైన బడలినట్లు గనఁబడలేదు. అతని మొగ మెప్పుడును సంతోషపూర్ణమైనట్లు గనుపట్టుచుండెను. అందులకుఁ గారణ మేమైయుండు నని రెండవవాఁ డూహించెను. ఏమియు గ్రహింపలేకపోయెను. కాని, మొదటివాఁడు భార్యతోఁ జేసిన సంభాషణము విన్నందున నా రెండవ బాటసారి బరిశీలించి యాపురుషుఁ డేదియో ఘనకార్యము నెఱవేర్చియున్నట్టును, వాఁ డొనర్చినపని కేదో పెద్దబహుమానము నొందఁ దలంచుచున్నట్టును మాత్రము దెలిసికొనెను. అయిన, నతఁ డందువిషయమై యేమియుఁ బ్రసంగింపలేదు. మార్గాయాసము కొంచెము తఱిగినందున వారు మరల నడవనారంభించిరి.

అప్పుడైనను రెండవ బాటసారి యతనివృత్తాంతమునుగూర్చి తరచి యడుగలేదు. మొదటివాఁడు గూడ నెన్నియో పూర్వ వృత్తాంతములును, దేశసమాచారములును జెప్పుచుండెను. కాని, తనసంతోషమునుగుఱించి యేమియును మాటాడలేదు. అప్పటికి సూర్యుఁడు గగనమధ్యముననుండి యగ్గి గురియించు చుండుటచే నెండవేఁడిమికిఁ దాళఁజాలక మఱియొకమాఱు చెట్టునీడను విశ్రమించిరి. మొదటివాఁడు కొంతసేపటివఱకు రెండవవానితో సరిగా మాటలాడుట మానివేసినను గ్రమముగా స్నేహము ముదురుటచేఁ దనకష్టసుఖములనుగుఱించియు, గృహవిషయములనుగుఱించియు రెండవవానితోఁ జెప్పుచుండకపోలేదు. మఱియు, రెండవవాఁడు సత్ప్రవర్తనునివలెఁ గన్పట్టుటచే వానియందు మొదటివానికి విశ్వాసము గూడ హెచ్చెను.

అందుచే వాఁడు తనమూటలోని యొక యుత్తరమును దీసి 'అయ్యా! నేను జదువెఱుఁగనివాఁడను. దీనిలో నాకెంత బహుమాన మిమ్మని వ్రాయఁబడినదో తెలుపుఁ'డని కోరెను. అంత రెండవవాఁ డతనితో నీకు రెండువేలరూపాయలు బహుమాన మిమ్మని వ్రాసినారని చెప్పి యాయుత్తరము మఱఁచి మొదటివానికిచ్చివేసెను. వారు తెచ్చుకొన్న తినుబండము లచ్చటఁ దినివేసి యాతపబాధ కొంచెము కొంచెము తఱిగినందున మరల నడచి పోవసాగిరి. మార్గాయాసము పూర్తిగా నడఁగిపోవుటచేతనో, యప్పుడే తృప్తిగా

నాహారము దిన్నవాఁ డగుటచేతనో రెండవవాఁడుకూడ నిప్పుడు మొదటివానివలెనే సంతోషమున వర్తింపఁదొడఁగెను. మొదటివాఁడు మాటిమాటికిని బహుమానమునే తలంచుకొనుచు నిజముగాఁ దనవంటి బీదవానికొక్కమాఱంత ద్రవ్యము లభించుట గొప్పయదృష్టమనియు నాధనముతోఁ దనకోర్కెలును, దనభార్య కోర్కెలును గూడ ఫలింపఁజేసికొనవచ్చుననియు నేమయినను నాధనముతో ముందుగాఁ దగినగృహము నొకదానిని గట్టవలయుననియు నిట్లు మనోరథపరంపరలచే నాకాశమున నొకహర్మ్యముఁ గట్టుకొని యందు విహరించుచుండుటచే వానిసంతోషమును గూర్చి వర్ణింప నవసరమేలేదు.

వా రట్లు పోవఁగాఁ, బోవఁగా నొకమహారణ్యము తారసిల్లెను. వారు దానిని దాఁటి పోవలసియున్నది. అపుడు రెండవవాఁడు ప్రథమునితో 'ఓయీ'! సాయంసమయము గావచ్చినది. మనముగూడ మిక్కిలి బడలిక చెందియున్నాము. ముందుమార్గము కంటకశిలామయమై, క్రూరమృగములకు నిలయములగు నరణ్యములచే నావృతమై యెట్టివానికైనను భయము పుట్టింపకపోదు. ఇట్టితఱి నీయరణ్యములోనుండి పోవనెంచుట మహాప్రమాదకరము. అదిగో! నా కానవచ్చు గ్రామమున నాస్నేహితుఁ డున్నాఁడు. వాఁడు మిక్కిలి మంచివాఁడు. మనలను జక్కఁగా నాదరించును. ఈరాత్రి యక్కడ నిలిచి యచట భుజించి నిద్రించి తెల్లవాఱుజామునఁ

మరలఁ బ్రయాణము సాగింతము' అని పలుక మొదటివాఁ డందుల కంగీకరింపక కార్యావసరమునుబట్టి తాను మార్గ మధ్యమునఁ గాలముపుచ్చవీలులేదనియు, రెండవబాటసారి వెనుకకుఁ జిక్కినను దనప్రయాణము తాను మాననదనియుఁ జెప్పెను. కాని, రెండవవాఁడు సమీపగ్రామమున నుండుటకు నిశ్చయించి యచటి కేగుచున్నప్పుడు మాత్రము మొదటివాఁడుకూడఁ దా ననుకొన్నట్లు చేయక వాని ననుసరింపక పోలేదు. ఆచీకటిలో నాగాఢారణ్యములోఁ బడి వాఁడు మాత్రము పోఁగల్గునా! రెండవవానిసాయ మున్నచో వాఁడు జంకకపోవును. కాని, వాఁడు పెడదారిఁ ద్రొక్కుటచే మొదటివాఁడు గూడఁ జేయునదిలేక యారాత్రి యచట నిలిచిపోయెను. రెండవవాఁడు మొదటివానిని వెంటఁబెట్టుకొని తనమిత్రునియింటికిఁ బోయెను. ఆమిత్రుఁ డతని నెక్కుడుగా నాదరించి యాయిరువురకును నతిథిసత్కారముచేసి పండుకొనుటకు వేఱు వేఱుశయ్యల నమర్చెను. బాటసారు లిద్దరును నిద్రించిరి. ఆగృహస్థుఁడుగూడ మిత్రునితోఁ గొంతసేపు సంభాషించి నిద్రించెను. రెండవబాటసారి నిశీథసమయమున లేచి గాఢముగా నిద్రపోవుచున్న మొదటిబాటసారియొద్దకుఁ బోయి వానిమూటలోనున్నయుత్తరమును మెల్లగా సంగ్రహించి తనమిత్రుని మేల్కొలిపి 'ఓయీ! ఈబాటసారి నాకు శత్రుకోటిలోనివాఁడు. నే నెందులకై తిరుగుచున్నానో యాకార్యము నెఱవేఱినది. నేనును, వీఁడును

డెల్లవాఱుజామున మధువంతమునుండి బయలుదేఱితిమి. వీనికిని, నాకును నిదివఱకుఁ బరిచయము లేదు. మార్గము సాగి వచ్చుచు భార్యతో వీఁడొనర్చినసంభాషణమువలన నాకుఁ గొంచెము సందియముగల్గినది. ఆసందేహమును దీర్చుకొనుటకే యీదినమెల్ల వీనిని వెంబడించితిని. నాసందేహము తీఱినది. నాకోర్కి ఫలించినది' అని పలికి మిత్రునిసాయమున నా మొదటివానిని బంధించి వీనిని సవారీలోఁ బడవేసి రహస్యముగా మాయూరికిఁ బంపుమని చెప్పి వెడలిపోయెను. ఆగృహస్థుఁడు మిత్రుఁడుచెప్పినట్లు చేసెను.

## పదునేడవ ప్రకరణము

## భీమదేవుని పశ్చాత్తాపము

పండువెన్నెలలు జగమును నిండించుచున్నసమయమున మలయమారుతము ప్రసరించుతావున నాసౌధోపరిభాగమునందు భీమదేవుఁ డాసనాసీనుఁడై యుండెను. ఇచ్ఛినీకుమారిని వరింపవలెనన్న కోర్కి యతనిమనస్సున నతిశయించి చెప్పఁదరముగానివ్యథలఁ బెట్టుచుండెను. సంతతవిచారముచే నా రాజు మిగులఁ గృశించియుండెను. ఎన్ని శైత్యోపచారములు చేసినను నతనిదేహ మగ్నిహోత్రపుంజమువలె స్పృశింపఁ దరముగాకుండెను. ఎప్పు డాబూదుర్గమును ముట్టడింతును, ఎప్పుడు సౌందర్యదేవతవలెనున్న

యిచ్చినీకుమారిముఖచంద్రదర్శనము గల్గును, ఎప్పుడు నామనోరథము లీడేరు ననువిచారము తప్ప భీమునకు వే ఱాలోచన మేమియును లేదు. ముందుముందు జరుగఁబోవు కార్యములనుగూర్చి మనస్సులో నేమేమియో యోజించు కొనుచు బాహ్యప్రపంచమును మఱచియుండెను.

అప్పు డమరసింహుఁ డొకపురుషునితోఁగూడ నచ్చ టికి వచ్చి భీమదేవునకు నమస్కరించెను. ఆ రా జతనిని విశేషముగా నాదరించి కూర్చుండనియమించి 'ఆరెండవ పురుషుఁ డెవఁ' డని యడుగ మీ పినతండ్రికుమారుఁడు గోకులదా సని యమరసింహుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. అది విని భీముఁ డానందముతోను, నాదరముతోను లేచి సోదరుని గౌఁగిలించుకొని యొక యాసనమునఁ గూర్చుండఁ బెట్టి 'సోదరా! మీతండ్రి సారంగదేవుఁ డన్యాయముగా నొకసామంతరాజును జంపుటచేతను, నతఁడు నేనుజెప్పినట్లు నడవకపోవుటచేతను మా యాగ్రహమునకుఁ బాత్రుఁ డయ్యెను. అన్యాయప్రవర్తకుని రాజ్యమందుండనిచ్చినఁ బ్రజానురాగమునకు భంగముకలుగునేమో యని భయ పడి యతనిని దూరముగాఁ బంపింపవలసివచ్చెను. అట్లు చేసిన తరువాతనైనను మీతండ్రి పశ్చాత్తాపమునొంది యనుకూలముగాఁ బ్రవర్తించిన నింతవఱకును రాకపోయి యుండును. కాని, సమీపగ్రామాదులను గొల్లఁగొట్టి నారాజ్యమునకును, నాకును స్వస్థత గలుగనీయక మఱింత

యన్యాయముగాఁ బ్రవర్తించెను. తనతప్పు స్పష్టముగాఁ దెలియవచ్చుచుండ దానిని దిద్దుకొనకుండుట మీతండ్రికిఁ దగనిపని. అతనిని మంచిమార్గమునకుఁ దేవలెనని నాతలంపు. మనుష్యులు పలుకష్టము లనుభవించినఁగాని మంచిమార్గము నను ద్రొక్కరు. అందులకే నేను మీతండ్రిని బరదేశములకుఁ బంపించి యంతలేసికష్టములు గలిగించితిని. ఏమైనను మహాభినివేశముగల యతఁడు యావజ్జీవమును దనపట్టు వదలఁడయ్యెను. అందుచేతనే మీరు పలుకష్టములు పడవలసివచ్చెను. ఇఁక గతమును ద్రవ్వనేల? నాకు మీయందు ద్వేషబుద్ధి యెప్పుడును లేదు. మిమ్ములను జేరఁదీసికొనవలెననియే నాతలంపు. తండ్రియనంతరమున మనప్రతాపసింహాదులయినను నాతో నేకీభవింప నిష్టపడక నాపైఁ బగ సాధింప బద్ధకంకణులై నాబహిఃప్రాణ మగు నేనుఁగును జంపివైవకుండిన నేను మీజోలికి రాకపోయియుందును. మీరు పృథ్వీరాజునాశ్రయించి జీవించుచున్నారని విని మిగులఁ బరితపించుచున్నాను. ప్రసిద్ధమగు చాళుక్యవంశమునఁ బుట్టి యఖండ రాజ్యాధిపతినగు నాయట్టివానికి సోదరులై యుండి మీరు జీవనార్థము పరులను – శత్రురాజును –మన వంశమునకెల్లఁ బరమశత్రువగు చోహానవంశజుని నాశ్రయించి యుండుట మిక్కిలి శోచనీయము. ఆవిషయము తలంప నాచిత్త మెల్లప్పుడును విశేషమగు పరితాపమును జెందుచున్నది. సోదరా! మీరు వేఱాలోచన విడిచి

నాతోఁజేరి సుఖింపుఁడు. మన వంశమునకు సంభవించిన యాకళంకమును దుడిచి వేయుఁడు. మనమందఱ మేకమై శత్రువుల జయించిన మన కెంతకీర్తి సంభవించును! మన వంశమున కెంతప్రతిష్ఠ వచ్చును! మనశౌర్యాదు లెంత రాణించును! నా కిప్పుడు పృథ్వీరాజుతో గొప్పయుద్ధము సంభవింప నున్నది. మీ రిప్పుడైన నాపక్షము జేరి యాత నితో యుద్ధము చేసి రణరంగమున నతనిఁ జంపి మీసోదరు లనుజంపినపగను సాధించుకొనుఁడు. తమ్ముఁడా! నిజముగాఁ జెప్పుచున్నానుసుమా! కరుణారా జన్యాయముగా మన పరితాపారిసింహులను జంపినట్లు విన్నప్పుడు నేను జెందిన విచారమునకు మేరయే లేదు. అది విని సహింపలేక యీ యమరసింహుని మీ చెంతకుఁ బంపించితిని. కావున, మీరు నాయందున్న ద్వేషబుద్ధిని విడిచి నన్నుఁజేరి నాకానందముఁ గూర్పుఁడు.' అని పలుకఁగా నామాటలు విని గోకులదాసు మిక్కిలి యానందించి భీమదేవునియం దీపాటిమంచిగుణ ములుఁగూడ నున్నవియా యని యనుకొని 'అన్నయ్యా! నీవు మా కాశ్రియ మిచ్చినచో నిఁకఁ గావలసిన దేమి! పరరాజుల నేల యాశ్రయింతుము? అతని సేవించుటకు మాకుఁగూడఁ జిన్నతము లేకపోలేదు. నిఖిలరాజుల కవమాన కరముగాఁ జోహానవంశజులఁ బొగడుచున్నప్పు డెల్ల మా మనస్సు పరితాపమును బొందకపోలేదు. ఆపరితాపమును సహింపలేక యేకదా మన ప్రతాపుఁ డట్లు గావించెను!

వేఱొకగతి లేకపోవుటచే నాతనిఁ గొల్చుచుంటిమి గాని యనురాగమునఁ గాదు. నీవు మమ్మింతగా నాదరించుచుండ నిది కాదని శత్రువుని జేరి జీవించుటకు నే మంత యవివేకు లమా’ యనుచుండ భీమదేవుఁ డతనిఁ జూచి ‘సోదరా! మీరు సంకోచమును విడిచి యిచ్చటికి రండు’ ఈ యుద్ధానంతరమున మీకు గొప్పపదవులనుగూడ నిచ్చెద’ నని చెప్పి సంతసింపఁజేసి యతనిని లోనికిఁ గొని తగిన యుపచారములుచేయుటకు సేవకులను నియమించి మరలివచ్చి యమరసింహునితో నిట్లు ప్రసంగించెను.

భీ—అమరసింహా! వీరు దేశమును విడిచిపోయి నందు కానందించుచుండ నీవు వీరిని మరలఁ దెచ్చిపెట్టుచున్నావు “జ్ఞాతిశ్చే దనలేన కి” మ్మనెడి పండితోక్తిని దలంచి భయపడుచున్నాను.

అ—ప్రభూ! మీరు భయపడ నవసరములేదు. వీరిలో నసహాయశూరులగు ప్రతాపారిసింహులు మరణించినారుగదా! వా రుండినచో మీరు భయపడుట న్యాయమే! కాని, వీరివిషయమై మీ రింత చింతింపవలదు. మన మెట్లు చెప్పిన వీ రట్లే నడతురు. పృథ్వీరాజు నాశ్రయించి యున్న వీరివలన మనకార్యము సులభముగా నెఱవేఱునని యట్లు తలంచితిని. వీ రెప్పుడు పృథ్వీరాజుచెంత నుందురు గాన నచ్చట రహస్యములన్నియు మనకు సులభముగాఁ దెలియును. మఱియు సమయముచిక్కినప్పుడు పృథ్వీరాజును

బంధించుకొనివచ్చుటకాని లేక యతనిఁ దుదముట్టించుటకాని చేయుదురు. అందులకై వీరిస్నేహము చేసితిమి, తప్పేమి? ఇదిట్లుండనిండు. మధుమంతమునకు వచ్చి యిచ్ఛినీకుమారిని దర్శింపవలయు నని నేను మీకు వార్త పంపితిని గదా! మీ రెందులకు రాలేదు? ఇచ్ఛినీసందర్శనసుఖ మనుభవింపకుండ నిన్నిదినము లిట్లు నిరర్థకముగా నేల కడపినారు?

భీ—(అది విని యాశ్చర్యముతో) ఆఁ! ఏమీ! ఇచ్ఛినీకుమారిని గొనివచ్చితివా! సత్యమే! సత్యమే! ఈ శుభవార్త నిన్నిదినములదాఁక నా కెందులకుఁ దెల్పలేదు? ఆయువతి నిచ్చటికిఁ దీసికొనిరాక యచ్చట నేల దాఁచితివి?

అ—స్వామీ! ఆమె నొకనాఁటిరాత్రిఁ గొనివచ్చి యందు విడియించితిమి. ఆమరునాఁ డచ్చటనుండి యామె నిటకుఁ దీసికొని రావలసినది. కాని, జైతపరమారుఁడు భటులచేఁ గూఁతును వెదకింపకమానఁడనియు, మే మిచ్చటికి వచ్చుచు మార్గమధ్యమున వారికంటఁబడినచో మనప్రయత్నము విఫలమగుననియుఁ దలంచి యట్లు చేసితిని. ఆశుభవార్తను దమకుఁ దెలుపుచు సైన్యసమేతముగా మధుమంతమునకు రమ్మని యుత్తరము వ్రాసి మధుమంతునిచేతి కిచ్చి యిక్కడికిఁ బంపితిని. మీ రీశుభవార్త వినఁగానే యచటికి వత్తురనియు నాలోపుననే యీరాజకుమారులను దీసికొని రావలయుననియుఁ దలంచి యట్లు చేసితిని. నే నీతనితో

మధుమంతమునకుఁబోయి చూచి మీ రచ్చటి కేల రాలేదో యని విచారించుచు నిచ్చటికి వచ్చితిని.

భీ—మధుమంతుఁ డేల రాలేదు?

అ—రాకపోవుట యాశ్చర్యమే!

భీ—ఇచ్ఛిని యట క్షేమముగా నున్నదా?

అ—అవును, మే మిచ్చటికి వచ్చునపు డామెను జూచియే వచ్చితిమి. ఇఁక మీరు తడయరాదు. ఇచ్ఛినిని గొనివచ్చిన మఱునాఁటినుండియుఁ బరమారునిభటులు దేశమును గాలించుచున్నారు. ఇచ్ఛినీసమాచారముఁ గనుఁగొన్నచో వా రవలీలనే వచ్చి యాదుర్గమును ముట్టడింతురు. రాజపుత్రులలోఁ బెక్కండ్రతనికి సాయము చేయనున్నారు. మనము త్వరగాఁ బోయి యాదుర్గమును రక్షింపకపోయిన నిచ్ఛినీకుమారి మనకుఁ దక్కుట కష్టము. లెండు, వేగముగా సైన్యములను వెడలింపుఁడు.

ఈవచనములు విని భీమదేవుఁడు తనమిత్త్రునిఁ గౌఁగిలించుకొని యతనిబుద్ధిచాతుర్యమును మెచ్చుకొని యిచ్ఛినీకుమారినిజూడవలెనన్న కుతూహలమునకు నమరసింహుని ప్రోత్సాహము తోడ్పడ నా దినముననే చతురంగములతో మధుమంత మను దుర్గమునకుఁ బోయెను.

## పదునెనిమిదవ ప్రకరణము

### బిచ్చగాఁడు

మధుమంతమున నొక దివ్యమందిరములోఁ బదునెనిమి దేండ్లప్రాయము గలయువతి యొకతె కూర్చుండి యుండెను. ఆమెముఖము పగటిపూటచందురునివలెఁ గాంతిఁదక్కి యుండెను. సంస్కారము లేకపోవుటచేఁ జెదరినముంగురులు ఫాల భాగమును గప్పుచుండెను. ఆమెకన్నులు వర్షకాలమేఘము వలె జలధారల నవిచ్ఛిన్నముగాఁ గురియుచుండెను. నిరంత రమును వెడలుచున్న వేఁడినిట్టూర్పులచే బింబఫలసదృశమగు కెమ్మోవి పొగచూరి యుండెను. ఆమె దేహలత యెండ వేఁడిమిచే వాడి కాంతిదక్కినమల్లెపూలదండవలెనుండెను. పెక్కేల! ఆయువతి స్త్రీరూపమునొందినశోకమువలెఁ గన్పడుచుండెను. ఆ దురదృష్టవంతురాలు వేఱొకతె కాదు, ఇచ్ఛినీకుమారియె.

ఇచ్ఛినీకుమారి బైరాగిచెప్పినచొప్పున నా మందును ద్రావి జపింపనారంభించెను. కాని, వెంటనే మూర్ఛక్రమ్మి యామెను జైతన్యహీననుగాఁ జేసెను. ఆమె యామఠమున నట్లే పడియుండఁగా రూపవతి బోయీలకును, ద్వారపాలుర కును ననుమానము గలుగకుండుటకై యావట్టివారినే కన్యాంతఃపురమునకుఁ గొనిపోయి కొంతసేపటికి మఠమునకుఁ దిరిగివచ్చి యమరసింహునియాజ్ఞప్రకార మచ్చటికి వచ్చి మఱియొక సవారీయందు మూర్ఛాధీనయై యొడలెఱుంగక

యున్న యాబాలిక నుంచుకొని రహస్యముగా మధుమంతము నకుఁ గొనివచ్చి యాదివ్యసౌధమున విడియించెను. అభయ సింగును వెంటఁబెట్టుకొనిపోయినబైరాగి మఱికొంతసేపటి కమరసింహుఁడై వచ్చి యాదుర్గమును జేరెను.

మఱునాఁ డుదయకాలమున నిచ్ఛినీకుమారి మేల్కొని నలుగడలం జూచెను. ఎటుచూచినను గ్రొత్తవస్తువులే చూపట్టెను. ఆమె యాశ్చర్యముచే మ్రానుపడెను. అది స్వప్నమేమో యని భావింపఁదొడఁగెను. కాని, కొంతసేపటి కాసందేహము తీఱెను. ఆమె నలువంకలను బరిశీలించి తన్నెవ్వరో మోసపుచ్చి యీనూతనపురమునకుఁ గొనివచ్చి యుందురని నిశ్చయించుకొనెను.ఆమందిరమును విడిచి నాలుగడుగులు నడచి యీవలకు రాఁగానే రూపవతి ప్రత్యక్షమయ్యెను. దానిని జూడఁగానే యారాజకుమారికిఁ గొంత ధైర్యము గల్గెను. రూపవతియే మోసపుచ్చి తన్నచ్చటికిఁ గొనివచ్చెనని యామె యెఱుఁగదు. చతురురాలగు రూపవతి సాయ ముండినచో నాపదవచ్చినను దప్పించుకొనవచ్చునని యూహించుకొనుచు నిచ్ఛిని దానిచెంతకు వచ్చి యిట్లు ప్రశ్నించెను.

ఇచ్ఛి—రూపవతీ! మన మిప్పు డెచ్చట నున్నాము?

రూ—అమ్మా! ఇదేదియో మాయగాఁ నున్నది! ఆపాడుబైరాగిముండకొడుకు మనల మోసపుచ్చి యిచ్చటికిఁ

దీసికొనివచ్చిన ట్లున్నది! అమ్మా! ఇదేమియో నా కేమియు బోధపడకున్నది.

ఇచ్ఛి—అభయసింగేఁడీ ?

రూ—ఏమో ! అతనిసమాచారమే తెలియలేదు.

ఇచ్ఛి—మన మిప్పు డెచ్చట నున్నాము ?

రూ—అన్హిలపుర భీమదేవుని దుర్గమున.

ఇచ్ఛి—రూపవతీ ! ఈపేరు వినఁగానే నాకు భయము వొడముచున్నది. అయ్యో ! ఎంతప్రమాదము ! ఎంతప్రమాదము ! ఆబైరాగి యెంతమోసము చేసినాఁడు' అయ్యో ! ఇఁక మనగతి యేమి ? సుందరీ ! మనము తప్పించుకొనుట కుపాయ మేదియును లభింపదా ?

రూ— లభింపకేమి ! ఏదయిన నాలోచింతము.

ఇచ్ఛి — సుందరీ ! నిన్ను బతిమాలుకొనుచున్నాను. ఇటనుండి తప్పించుకొనుమార్గ మాలోచించి యట్లు చేసితివా నీకుఁ బెద్ద బహుమానము జేసెదను. ఈవార్త మాతండ్రి విని యెంతదుఃఖించునో ? మాచుట్టము లెంతవిలపింతురో ? రూపవతీ ! ఎట్లుతప్పింతువో వేగముగాఁ దప్పింపుము.

రూ—అమ్మా ! అదెంతసేపు! అని పలికి యట నుండి లేచిపోయెను. రూపవతిమాయలాడితనమునకును, నా రాజకుమారి యమాయికత్వమునకును నచ్చటిస్త్రీలు నవ్వుకొనఁజొచ్చిరి. ఇచ్ఛిని వారిని జూచి "యువతులారా! ఏల నవ్వుచున్నారు ? రూపవతి యెచ్చటికిఁ బోయినది ?"

అని యడిగెను. వారామెను జూచి "అమ్మా! నీ వింత యమాయికురాల వేమి? రూపవతి నింకను నీకు హితురాల నియే తలంచుచున్నావా? ఆబూగడమునకు వచ్చి యతి ప్రయత్నముచేసి మోసపుచ్చి నిన్నుఁగొనివచ్చి భీమదేవు నకుఁ బెండ్లిచేయనెంచుచున్న రూపవతి నిన్నిందుండి తప్పించునా? భీమదేవునివలన నెంతో బహుమానముఁ గొననున్న రూపవతి నీ విచ్చుస్వల్పబహుమాన మాసించునా?' అని పల్కిరి.

ఆమాటలు విని యిచ్ఛినీకుమారి పెనుగాలితాకున నేలఁ గూలినలతవలె నొకచోఁ గూలఁబడెను. మిక్కిలి దుఃఖించెను. ఎంతసేపు దుఃఖించిన నేమిప్రయోజనము? ఆర్చువారా? తీర్చువారా? ఓదార్చువారా? ఎట్టకేల కామెయే తనకుఁ దా ధైర్యముఁ దెచ్చుకొని యతికష్టముచే దినములు గడపుచుండెను. ఇట్లుండ నొకనాఁడు రూపవతి యామెకంటఁ బడెను. అప్పు డిచ్ఛినికిఁ గల్గినకోపమునకు మేరలేదు. నిప్పులుగురియునేత్రములతో దానిని జూచి 'ఓసీ! మాయావినీ! ఎంత దుష్టురాలవే! అప్పటి నీపరిసంగము వలన నీవు భీమదేవునిపరిచారకురాలవేమో యను ననుమానము గల్గుచుండెడిది. వెంటనే నీకపటవచనములకు మోహితనై యాయనుమానమును దొలంగించుకొనెడిదానను. అంతియేకాని, నీవు నాకు మహోపకారము చేయఁబోవుకాల సర్పమునుగాఁ దలంపనైతి. ఓదుష్టురాలా! ఓకృతఘ్ను

రాలా! ఇంతకాలము నాయన్నముఁ దిని నాబట్టఁ గట్టి నీవు చేసెడి యుపకార మిదియా? ఇట్టి నిన్ను ఖండఖండము లుగాఁ గోసి కాకులకువైచినను బాపముండునా? అని యిట్లు పలుదెఱంగుల నిందించుచుండఁగా రూపవతి పక పక నవ్వుచు 'రాకుమారీ! నేను నీ కపకార మేమియుఁ జేయలేదు. చక్రవర్తి యనందగిన యొక మహారాజునకు నిన్నుఁ గూర్చు చున్నాను. ఇది నీ కపకారమా! నేను జేసినయుపకారమున కానందించుటకుమాఱు నీ వేల యిట్లు విచారించెదవు' అని యేమో చెప్పఁబోవుచుండ 'ఓసీ! దురాత్మురాలా! నాకుఁ బెండ్లిచేయుటకు నీ కేమి యధికారము గలదు? ఇఁక నీవిష యము నాయెదుట మాటాడకుము. మాటాడితి వేని సిగ పాయదీసి తన్నెదను' అని గట్టిగాఁ గసరెను. ఆమె భయం కరాకారమును జూచి రూపవతి జంకి యేమియుఁ బలుక లేక యటనుండి వెడలిపోయెను.

అనంతర మిచ్ఛినీకుమారి క్రోధము శాంతించి తక్కినస్త్రీలను మంచిమాటలాడి వారితో స్నేహముచేసి యెట్లో కాలము గడపుచుండెను. ఇట్లు కొన్నిదినములు గడచెను.

ఒకనాఁ డామె దాసీజనముతో నొకచోఁ గూర్చుండి సంభాషించుచుండఁగా నామెచెవి కేదో యొకశబ్దము వినఁ బడెను. ఆ యువతి సంభాషణము విడిచి వినుచుండఁగా

సాధ్వని మఱింత దగ్గఱగా స్పష్టాక్షరములతో వినిపించెను. అది యీక్రింది శ్లోకము.

శ్లో. నమాతుం శక్యా మే నయనయుగ మాళీకరతలై
స్తనుజ్యోత్స్నా చేయం విఘటయతి గాఢాంధతమసం
సఖీనా మాహూతిం రచయతి చ మే గంధనివహాః
రుదంతీం తాం మాతా హసితవదనా చుంబతి ముఖం.

సీతాదేవి బాల్యమును వర్ణించు నీశ్లోక మామెచెవిని బడినప్పు డిచ్ఛనీదేవికిఁ గల్గినయానందమునకు మేర లేదు. ఆమె కాశ్లోక మనఁ బ్రాణముకంటెను బ్రియతమమైనది. ఇంటనుండునప్పుడు తఱచుగా దానినే చదువుచుండెడిది. ఆమె దాసీజనమును జూచి 'ఆపాడెడివా రెవ్వరు?' అని యడుగఁగా వాండ్రు 'అమ్మా! ఎవ్వఁడో బిచ్చగాఁడై యుండును' అని చెప్పి యటనుండి వెడలిపొమ్మని కేక వేసిరి. ఆబిచ్చగాఁ డట్లు చేయక యింకను నాశ్లోకమునే పఠింపఁ జొచ్చెను.

అతనికంఠధ్వనికి సౌధములు ప్రతిధ్వనులిచ్చుచుండెను. ఇచ్ఛనీకుమారి కాకంఠస్వరము పరిచితమైన ట్లుండుటచే న దెవ్వరిదై యుండును? అని యాలోచించుచున్నసమయమున నొకదాసి బిచ్చగానితో 'ఓరీ! ఎందుల క ట్లఱచుచున్నావు? ఇక్కడ నీకు బిచ్చముపెట్టువా రెవ్వరును లేరు. కందాకొట్టు దగ్గఱకుఁ బొమ్ము' అని చెప్పెను. అది విని వాఁడు 'అమ్మా! నే బిచ్చమునకు రాలేదు. నేను గాశికిఁ బోవుచున్నాను.

మార్గవ్యయమునకు నాకు ధనము కొంచెముకావలసియున్నది. మా రాణిగా రిక్కడ లేరు. నీకు ధనము దారవోయువా రెవ రున్నారు ? పో పొమ్ము' అని పలుకునంతలో నిచ్ఛినీదేవి యచ్చటికి వచ్చెను. ఆమె యాబిచ్చగానిని జూడఁగానే యామెముఖమున వికాస మంకురించెను. ఆమె సంతోషవికా రములేమియుఁ బైకిఁదోఁపనీయక దాసిని జూచి 'ఓసీ! యింటికి వచ్చినయాచకున కొకకాసైన నియ్యకుండఁ దఱిమివేయఁ జూచుచున్నావా? మా ప్రభువుగారు మా కిట్టి హితోపదేశముఁ జేసినారా యేమి? ఇంతధనము, ఇంతరాజ్యము, ఇంతలేసి సంపదలును నొకబిచ్చగాని కింతో యంతో యిచ్చినంత మాత్రముననే పట్టిపోవునా ? ఐశ్వర్యమునకుఁ బుట్టినింటివలె నున్న యీదివ్యభవనమునకు వచ్చినయాచకుఁడు విఫలమనో రథుఁడై పోయినచో నిఁక నంతకన్న శోచనీయ మేమి ? అని తన యొంటనున్నయాభరణము నొకదానిని దీసి యాబిచ్చ గాని కిచ్చి 'అయ్యా ! దీనితో మీతీర్థయాత్ర చేసికొనిరండు. మరలివచ్చునపుడు నాకు దర్శన మొసంగుఁడు. మీరు మహానుభావులవలె నున్నారు. మీవంటివారిదర్శనము మాకు సకలఫలప్రదాయి యగును' అని పల్కెను.

ఆ రాజకుమారి దయతోనిచ్చిన యాబహుమాన మతి వినయముతో నందుకొని కనుల కద్దుకొని యామెను బరిపరి విధముల దీవించుచు వెడలిపోయెను. చుట్టునున్న దాసీజన మామెయుదారబుద్ధికిని, దీనవాత్సల్యమునకును మిక్కిలి

యచ్చెరువొందసాగిరి. నాఁటినుండియు నారాజపుత్రిదయను సంపాదించి యేదయినను బహుమానము పుచ్చుకొనవలెనని తలంచి వకుళ యను పరిచారిక తక్కినవారికంటె మిక్కిలి యడఁకువతో వర్తించుచు నాయిచ్ఛినియభిప్రాయము ననుసరించి నడచుచు నామెకుఁ దగినయుపచారములు చేయ నారంభించెను. అందులకు రాజకుమారి యానందించుచు దానిపై నెక్కుడుదయ చూపుచుండెను.

## పదునాఱవ ప్రకరణము

---

### ఇచ్ఛినీ భీమదేవుల సంవాదము

మధువంతమునఁ గైలాసశిఖర మను నొక మహా సౌధము గలదు. ఉన్నతమైన సుధాకాంతులచే నతి ధవళమై కైలాసశిఖరమువలె నుండుటచేతనే దాని కాపేరు గలిగెను. దానియుపరిభాగమున నిచ్ఛినీకుమారి వకుళతోఁగూడ విహరించుచుండెను. ఆపరిచారిక యచటికి దూరముగాఁ గనఁబడు చున్న పల్లెలను, బట్టణములను, నదులను, గొండలను జూపు చుండ నిచ్ఛినియుఁ దదేకాగ్రచిత్తముతోఁ జూచుచుండెను. అంతట నాసౌధమున నెవరో యెక్కి వచ్చుచున్న ట్లడుగుల చప్పుడు వినఁబడఁగా నాయువతులిరువురును శబ్దమువినవచ్చు చున్నవైపు దిరిగి చూచిరి. మొదట రూపవతియు దానిననుస రించి భీమదేవుఁడును వచ్చుచుండిరి. ఇచ్ఛిని భీము నిదివఱ

కెఱుఁగమిచే నెవఁడో పురుషుఁడు వచ్చుచున్నాఁడని తలంచి దాసి నడుగఁగా నన్నిలపురభీమదేవుఁ డతఁడే యని యది తెలిపెను. ఆమాట వినఁగానే యారాకుమారికిఁ గలవరపాటు హెచ్చయ్యెను. గాలితాకునఁగదలు తీఁగెవలెను, మీటిన వీణాతంత్రివడువునను నొకమాటామె కంపమొందెను. భీముని వెఱ్ఱితన మిదివఱలో వినియుండుటచే నాఁడతనివలనఁ దనగౌరవమున కెక్కడ భంగముగల్గునోయని మిక్కిలి పరితపింపఁదొడఁగెను. అయిన నామె యొక్కించుక ధైర్యమును జిక్కఁబట్టి మేల్ముసుఁగును సవరించుకొని వకుళను మాటు గొని యుండెను.

అంతట రూపవతియు, భీముఁడును నచ్చటికి వచ్చిరి. భీముఁ డచట నున్న స్ఫటికశిలావేదికపై నుపవిష్టుఁ డయ్యెను. రూపవతి యతని చెంత నిలువఁబడి యిచ్ఛానీకుమారిని గొనివచ్చుటగుఱించి మనవిచేసికొనుచుండెను. భీముఁ డామెమాటలను వినుచున్నట్లు నటించుచుండెను. కాని, యవి యతని చెవిని బడలేదు. అతనిమనస్సు చూపులతోఁగూడఁ బోయి వకుళచాటుననున్న యిచ్ఛనిపై విహరించుచుండ దానిమాట లెట్లు వినఁగలఁడు? రూపవతి యిఁకఁ దనప్రసంగము కట్టిపెట్టి యిచ్ఛానీకుమారిచెంతకుఁ బోయి యామె యెదుట మోఁకరించి 'అమ్మా! భీమదేవుఁడు వచ్చి నీకరుణాకటాక్షలేశమునొంద వేచియున్నాఁడు. పరిపూర్ణచంద్రబింబమును మేఘమండలమునవలె నీసుందరవదనమునావరించియున్న

మేల్కొనుఁగు నాకించుక యొత్తిగించి నీకడకంటిచూపులచే నతనిఁ దానమాడించి యతనిఁ గృతార్థునిఁగాఁ జేయుము. అమ్మా! నీవు చక్కఁగాఁ బరిశీలింపుము. ఈరాజువంశమా క్షత్రియకులములలో నుత్తమమగు చాళుక్యవంశము! ఇతని రాజ్యమా యనంతమైనది! పరాక్రమమా శత్రురాజులను గడగడలాడింపఁజాలినది! సైన్యములా సముద్రమువలె నతి భయంకరమైనవి! సకలసంపదలకునిధియగు నీతని వరించుట కేల సంశయింతువు? తల్లీ! నామనవి వినుము. ఇతరుల కెవ్వారి కిని లోఁబడక వీరాధివీరుఁ డనిపించుకొనియున్న యీరాజ కుమారుని ఘూర్జరరాజ్యలక్ష్మితోఁగూడ నీదాసునిఁగా నేలు కొమ్మ' అని పలికెను.

రూపవతి మాటలాడుచున్నంతసేపును భీముఁడు రెప్ప వాల్పకుండ నారాజకుమారినే చూచుచుండెను. అంత మృదు వుగా, నంత మధురముగా, నంత సరసముగా, నంత చమత్కా రముగా, నంత వినయముగాఁ బలికిన రూపవతివాక్యముల కామె యేమిసమాధానము చెప్పునో యని యతఁడు కని పెట్టుకొని యుండెను.

త న్నన్యాయముగా మోసపుచ్చి తెచ్చి యిట్టి యిక్కట్టులపాలుగావించిన రూపవతి కంటఁబడినప్పు డిచ్చినికిఁ బొడమినకోపమునకుఁ బారములేదు. ఆకోపాగ్నికి దాని ప్రసంగ మాజ్యధారయగుటచే నాకుమారి యిఁక సహింపలేక తనయెదుట మోఁకరించియున్న రూపవతిగుండెలపై గాలితో

గట్టిగాఁ దన్నెను. పిడుగుదెబ్బవంటి యాతన్నుఁ దిని యా దాసి దూరముగాఁ దూలిపడెను. ఆతాపువలన గుండె బరు వెక్కి బాధించుచున్నను నది యెట్లో సహించి లేనినగవుఁ దెచ్చికొని మెల్లగా లేచి భీమునిఁ జూచి 'అయ్యా! ఈ యువతిని మీరే వశపఱచికొనుఁడు. నే నీమెచెంత మాటాడ లేను. మాటాడిన నీమె యూరకుండదు. ఈతాపునకే నా గుండె కందిపోయి మిక్కిలి బాధించుచున్నది. ఇంకను నీమెకు హితోపదేశముచేసిన నాప్రాణములు దక్కవు' అని పలికెను. భీముఁ డందులకు నవ్వుచు నిచ్ఛినీకుమారికి వినఁబడునట్లు 'రూపవతీ! నీపల్కు లసందర్భములు. పూలబంతితోఁ గొట్టిన శరీరము కందునా? నొప్పి చెందునా? పూలబంతికంటె నతి మృదువగు నీమెపాదతల మెక్కడ? అది తాకినంతమాత్ర మున నీకు నొప్పిజనించు టెక్కడ? వట్టిమాట! అట్టి మృదు పదతాడనము లభించినందులకు నీ వెంతయో యానందింప వలసియుండఁగా విచారింతు వేల? ఆపాదఘాతము నాగుండె యందే తగిలిన నే నపరిమితానందమును జెందుదును. కృతా ర్థుఁడ నగుదును. కాని, నా కట్టిభాగ్యము లభింపలేదు. నీ వెంత భాగ్యవంతురాలవు!' అని పల్కుచుండ రూపవతి విని 'అయ్యా! నాభాగ్యము మండినట్టేయున్నది. మోహాంధు లై యున్న మీ కీమెపాదతలము పుష్పముకంటె నెక్కుడు మృదువుగా నున్నట్టు తోఁపవచ్చును. కాని, నా కిది వజ్రము కంటెను గొంచెము గట్టిగా నున్నట్లే యున్నది. ఈమెపాద

తాడనములు మీకుఁ బూలబంతిదెబ్బలవలె నుండునని తోఁచి నచో మీరే యామె కుపదేశముచేసి యాభాగ్యము నొందుఁడు. జన్మము కృతార్థతనొందించుకొనుఁడు' అని చెప్పెను.

భీముఁ డప్పు డారాజకుమారిని గొంచెము సమీపించి 'యువతీ! నీమృదుపాదముతో నీదీనురాలినిగాక నన్నే తన్ని నచో నెంతో యానందింతును గదా! ఎంతో కృతార్థుఁడ నగుదును గదా! నిన్ను మోసపుచ్చి తెచ్చుటచేఁ గృతాపరాధుఁడ నగు నాగుండెలపైఁ దన్నుము. నీబాహుపాశములచే బంధింపుము. నీకడగంటిచూపులను తూపులచే నాహృదయమును జీల్పుము. పాప మేమియు నెఱుఁగని రూపవతిని దన్నితి వేల? సుందరీ! చిరకాలమునుండి నీసౌందర్యమునుగూర్చి వినుచు నీ సుందరరూపమును జూడలేకపోవుటచే నెడతెగని తాపముఁజెందుచుఁ గాలమును గడుపుచుండ నీయస్త్రవిద్యానైపుణ్యమును దెలుపు నీబాణము కంటఁ బడినది. అప్పటినుండియు నామనస్సు చెందుచున్నసంతాపమున కంతము లేదు. నా కస్త్రవిద్యయందుఁ బ్రీతి హెచ్చు. దాని నభ్యసించినవారియందు నా కెంతో గౌరవము. ఇట్లుండఁ, బవిత్రమగు పరమాకువంశమునఁ బొడమి సౌందర్యమునకును, సద్గుణములకును నిధానమవై ప్రాయమునఁ జిన్నదానవయ్యు నస్త్రవిద్యాభ్యాసమునందు-అభ్యాస మున్నఁ జాలదు. అస్త్రవిద్యాచాతుర్యమునందు - అందులోను నావంటివీరుహృదయము మెప్పొదవించిన చాతుర్యమునందుఁ-బెద్దవై యున్న నీయందు

నా కెట్టిగౌరవ ముదయించునో, యెట్టి యనురాగము మొలక లెత్తునో చెప్పవలయునా? నీకడగంటిచూపులు నాపైకి మలపి నన్ను వరించి కృష్ణునకు సత్యభామవలె యుద్ధరంగము లందు నీవు నా కెన్నఁడు బాసటవై యుందువో యని కొండంతాస వెట్టుకొన్నాను. కోమలీ! నామనోరథము లీడేర్పుము' అని పలికెను.

ఇదివఱకు భీమునిచర్యలు విన్న యిచ్ఛినీకుమారి కా పలుకులు మిక్కిలి యాశ్చర్యమును గలిగించెను. అతనిమాటల యందుఁ దా ననుకొన్నట్లు దుందుడుకుఁదనముగాని, మోటుఁదనముగాని యామెకుఁ జూపట్టలేదు. అతఁ డంత పొందికగాను సరసముగాను మాటాడునని యామె యనుకొనలేదు. తన కట్టి యిక్కట్లు గల్గించినందుల కతనిపై నామెకుఁ గోపము హెచ్చు పెరుఁగుచున్నను నతఁ డంత మృదువుగా మాటాడుచున్నపుడు తాను గఠినముగాఁ బ్రత్యుత్తర మిచ్చుట తగవుగాదని తలంచి వీణాస్వరమువంటి మృదు మధురమగుకంఠముతో నతని కిట్లనియె. 'ఓ రాజా! నీకు నా యం దనురాగముజనించిన జనింపవచ్చును. మానవస్వభావము నెవరు కాదనఁగలరు? కాని, మాతండ్రి నన్ను నీ కీయనని స్పష్టముగాఁ జెప్పినను, నాకు నీయం దనురాగము లేనట్లు నీపరిచారిక యగురూపవతివలనఁ దెలిసియున్నను విముఖుఁడవు కాక మొండిపట్టుపట్టి మోసపుచ్చి నన్నుఁ గొనివచ్చుట నీ కెంతమాత్రమును దగదు. నీవు నాయస్త్ర

చాతుర్యమును వలచినట్లే నేనును నొక రాజకుమారునియస్త్ర నైపుణ్యమునకుఁ బట్టువడి వలచితిని. ఇదివఱకే నామన స్సతని కర్పించితిని. ఇఁక నీవు నీపట్టుదల విడిచి నన్ను విడుదలచేసి సగౌరవముగాఁ బంపివేయుము. అట్లయిన నీకుఁ బెద్ద గౌరవ మును గీర్తియును గల్గును.'

ఆమాటలు భీముఁడు విని 'నీవు వరించినరాజు నెఱుఁ గుదును. అతఁడు నాకుఁ బరమశత్రువు. వాని నేఁకఁ గొలఁది దినములలోఁ జంపెదను. అట్టివానిని జేపట్టి యేమి సుఖించె దవు? కావున, నీమనస్సు మరలించి నన్ను వరింపుము' అని పలికెను.

ఇచ్ఛి—నిజముగా నీ వాతనిఁ జయింపలేవు. అయి నను నతఁడే నాకు భర్త.

భీ—యువతీ! నీవు మొండిపట్టుపట్టి వ్యర్థముగాఁ జెడి పోకుము. నీమూలమున నీ తండ్రిరాజ్యమున కపాయము గల్గింపకుము. నీవు నన్ను వరింపనిచో మీతండ్రిని నిముసము లోనేజయించి, పృథ్వీరాజునుజంపి యారాజ్యమును నావశము గావించుకొందును. అప్పుడు నీవు చేయునది లేక నన్నే వరింతువు.

ఇచ్ఛి—అది వట్టిమాట! నీ వేమి చేయఁగలవో చేయుము. శక్తి గల్గినచో వారినందఱను జయించి సామ్రా జ్యము స్థాపించుకొనుము. నీవు సార్వభౌముఁడ వైనను, ముల్లో కముల కధిపతి వైనను నిన్ను వరింపను.

భీ—అట్లయిన నీ వెన్నటికిని నిందుండి విముక్తిఁ జెందలేవు. నీ విం తేనియు సుఖింపలేవు.

ఇచ్ఛా—విముక్తి లేకున్నఁ బోనిమ్ము. నాహృదయము నందున్న నాపతిని నారాధించుకొనుచు సుఖముగాఁ గాలము గడిపెదను.

భీ—బల్మిని వరించిన నేమి చేయుదువు ?

ఇచ్ఛా—ఉత్తమస్త్రీలను బలాత్కరించినవారిగతియే నీకును బట్టును.

భీముఁ డావచనములు విని పక పక నవ్వుచు 'ఓ వెఱ్ఱి దానా ! మంచిమాటలచేఁ దప్పించుకొనిపోవలె నని తలంచుచున్నావు. భీమదేవుఁ డంత యమాయికుఁడుగాఁ' డని పలికి రూపవతితో నచ్చోటు గదలిపోయెను.

## ఇరువదవ ప్రకరణము

### ఆబూగడము — అభయసింగు

రూపొందిన రాజ్యలక్ష్మివలెఁ దనభవనమునఁ జరించుచుఁ దన సత్ప్రవర్తనముచే నెల్లరహృదయముల కానందముఁ గొలుపుచుఁ దన చతురవచనములచేతను, యుక్తుల చేతను యుక్తసమయములఁ దండ్రికిఁ దోడుపడి యతనివలన నెక్కుడుగౌరవము చెందుచునుండు నిచ్ఛానీకుమారి మాయమైనప్పటినుండియు జైతపరమారుఁడు రేయింబవళ్ళు దుఃఖిం

చుచు నాహారముఁ గొనక, నిద్రవోవక, రాజ్యవ్యవహారములు చూడక, యాప్తులతోనైనను భాషింపక క్రిమక్రమముగాఁ జిక్కి శల్యమై గుర్తింపఁదరముగాని యవస్థను బొంది భూతము సోఁకినవానిభంగి వికారచేష్టలు చేయుచు వర్తించుచుండెను.

ఇచ్ఛినీకుమారిజాడలు దెలిపి పరమారునివలనఁ బెద్ద బహుమానముఁ బొందవలెనని తలంచి దేశమును వెదకఁ బోయినవా రొక్కరొక్కరే వచ్చి యాబూగడమును జేరిరి. మార్గాయాసము దక్క వారికి వేఱొకలాభము లేకపోయెను. ఆహారసంపాదనార్థము నలుదిక్కులకుఁ జెదరిపోయినపక్షులు తిరిగి తమకులాయములు చొచ్చునట్లు సులభముగానే యిచ్ఛినీ కుమారిని వెదకి తెచ్చెద మని ప్రగల్భములు పలికి పోయిన వారిలోఁ బెక్కండ్రు చాటుచాటున వచ్చి తమతమగృహము లను జేరిరి. అంతియకాని యొక్కఁడును నిచ్ఛినివార్తను దెలి పినవారు లేకపోయిరి.

అంత నొకనాఁడు కొందఱుపురుషు లొకపురుషుని భుజములపై నైచికొని వచ్చి పరమారునిముందుఁ బడ వేసిరి. ఆపురుషుఁడు మిగులఁ గృశించిపోయెను. చుట్టునున్నవా రతనిఁ జూచి యతికష్టముచే గుఱుతించి 'అభయసింగు, అభయసింగు' అని కేకలు వేయనారంభించిరి. అది విని ప్రజ లందఱు నాశ్చర్యపడి యభయసింగువృత్తాంతముఁ దెలిసి కొనఁ గుతూహలులై గుంపులుగుంపులుగాఁగూడి వచ్చి యభయసింగుచుట్టును మూఁగిరి. పరమారుఁ డతనిజూడఁగానే

యతనివలనఁ దనకూఁతుజాడ లేమయినను దెలియవచ్చునని యనుకొని యత్యాతురతతో నతని సమీపించి 'అభయసింహా ! ఈరూప మేమి ? నీ కిట్టియాపద యెట్లు సంభవించెను? ఇచ్ఛినీకుమారి యెక్కడ ? నీ వామె కేమయిన నపకారము చేయఁదలంచితివా ? నీవృత్తాంత మున్న దున్నట్లు చెప్పివేయుము. లేనిచో నీప్రాణములు నీకుఁ దక్కవు' అని పలికెను.

అది విని యభయసింగు చేతులు జోడించి మెల్లని కంఠస్వరముతో 'మహాప్రభూ ! నాతప్పు మన్నింపుఁడు. నేనిందుఁ జేసిన నేర మేమియును లేదు. ఇచ్ఛినీకుమారిని బెండ్లాడవలె నను తలంపు నాకుండెడిది. ఆరాజకుమారియొద్ద మిక్కిలి చనవుతో వర్తించుచున్న రూపవతితో నేను స్నేహముఁ జేసి నాయం దామె కనురాగము జనించునట్లు చేయవలెనని కోరితిని. మాయలాఁడి యగు నాదుష్టురా లట్లే చేసెద నని చెప్పి నావలన ధనమంతయు లాగి తుదకు నన్ను మోసపుచ్చి యచలేశ్వరాలయమునకుఁ బోవనున్న రాజకుమారి కీరాత్రి నీవు సాయముచేయు' మన నేనందుల కంగీకరించితిని. రాజకుమారి సవారీతో వెడలి స్వామిదర్శనార్థము వెళ్ళినది. ఆమె కపాయముగలుగకుండుటకై నేనును ఖడ్గపాణినై యామెను వెంబడించితిని. స్వామిదర్శనముచేసికొని బైరాగిని జూడఁ దలంపుతో నామె తన్మఠమునకుఁ బోయెను. నేనును బోయితిని. కాని, నన్నుఁ జూచి యామె సిగ్గుపడు నేమో యని తలంచి నేను లోపలి కరుగక ద్వారమునొద్ద నే

నిలిచిపోయితిని. లోపల నేమిజరిగెనో నా కేమియు బోధపడ లేదు. కొంతసేపటికి నేను బైరాగిచెంత కేగితిని. అచ్చట నిచ్చిని నా కగపడలేదు. రూపవతిమాత్రమే యుండెను. బైరాగిమాటలవలన రాజకుమారి లోపల నేమియో జపించు చున్నట్లుమాత్రము గ్రహించితిని. ఆబైరాగి రూపవతితో నిచ్చినీకుమారిని దుర్గమునకుఁ గొనిపొమ్మని చెప్పి 'యొక వనమూలిక యిచ్చెదను నాతో ర'మ్మని నన్నొడఁబఱిచి తన వెంటఁ గొనిపోయెను. ఆరాజకుమారి నొంటిగా విడిచిపోవు టకు సందేహించితిని. కాని, రూపవతి రాజకుమారి కేమియు భయములేదు నీవుపోవచ్చునని యనుటచే నతని వెంబడించి పోయితిని. రూపవతీ - రాజకుమారుల తరువాతవృత్తాంత మేమియో నాకుఁ దెలియదు. ఆదుర్మార్గుఁ డగు బైరాగి యాకొండపై నన్నుఁ గొంతదూరము గొనిపోయి యొక రాతిపైఁ గూర్చుండఁబెట్టి 'ఇదిగో! నిప్పుడే వచ్చెద' నని చెప్పి వెడలిపోయెను. అతఁడు వెడలిపోయిన యొక నిముసము నకే పదుగురుమనుజులు వచ్చి నన్నుఁ బట్టుకొని బంధించి యొక కొండగుహలోఁ బడవైచిరి. అప్పుడు బైరాగి వచ్చి నన్నుఁ జూచి 'ఓయీ ! నిన్ను వదలినచో నీ వాబూగఢము నకుఁ బోయి నల్వురతోను జెప్పి రాజకుమారిని దీసికొని పోకుండ నేదోయాటంకముఁ గల్పింతువు. నీ విట్లే యుండుము' అని పల్కి . నే నేదో మొఱపెట్టుకొనుచున్నను వినక యా మనుజులతో వెడలిపోయెను. నే నట్లే పడియుండి యాఁకటిచేఁ

ప్రాణములు విడుచుటకు సిద్ధముగా నున్నసమయమున వీరు వచ్చి నాకట్లు విప్పి నాయాఁకటిని దీర్చి బ్రతికించిరి. 'రాజేంద్రా! ఆబైరాగియు, రూపవతియుఁ గలసి మోసముచేసి యీరాజకుమారి నెచ్చటికో గొనిపోయినారు. దుష్టురాలగు రూపవతియు నాధనమంతయు లాగికొని తుదకు నా కెట్టియవస్థ గల్గించినదో చూడుఁడు. నేను జేసినయపరాధమును సైఁపుఁడు' అని ప్రార్థించెను. పరమారుఁ డది విని యం దతనియపరాధ మేమియు లేకపోవుటచే నతని క్షమించి 'ఓ యభయసింహా! నీ వాబైరాగిని, రూపవతినిఁ గూడ బాగుగా నెఱుఁగుదువు. కావున, నీవు స్వస్థుఁడ వైనపిమ్మటఁ బోయి వారిజాడ లరయు' మని చెప్పి యింటికిఁ బంపివేసెను. అది మొద లభయసింహుఁడు రూపవతిని, బైరాగిని బట్టుకొనుటకై ప్రయత్నము సలుపుచుండెను.

## ఇరువదియొకటవప్రకరణము

## ఈశ్వరభట్టు

ఇచ్ఛానీకుమారివృత్తాంత మరసివచ్చెద నని చెప్పి పోయిన యభయసిం గింకను రాకపోవుటచేఁ బరమారుఁడు సంతతవిచారముచే దిగులొంది యతికష్టముచేఁ గాలము గడపుచుండెను. తనకూఁతును మోసపుచ్చికొనిపోయిన దురాత్ముఁ డెవఁడో తెలిసిన-చో నొక క్షణముననే వానిని

గడిఖండములు గావించి యాకన్యను సాధించి తేవలె నని సైన్యమును సిద్ధపఱచుకొని యుండెను. అభయసింగు సూచించినట్టు లాదురాత్ముఁడు భీమదేవుఁడే యైనచో మహా బలిష్ఠుఁడగు నతని జయించుట పరమారున కసాధ్యమే! అయినను, నతఁడు మిగులఁ గుపితుఁడైనందునఁ గన్యాపహర్త భీముఁడే యైనను, లేక పినాకపాణియగు సోముఁడే యైనను, దనకు జయమే లభించినను, నపజయమే లభించినను, దన కేమైనను నాశత్రువు నెదుర్కొనవలెననియె నిశ్చయించుకొనెను. ఒకనాఁడు జైతుఁడు తగు పరివారముతో నొకచోఁ గూర్చుండఁగాఁ బదుగురుమనుష్యులు బద్ధుఁడగు నొకపురుషునిఁ గొనివచ్చి రాజసన్నిధి నుంచిరి. అందులకు రాజాశ్చర్యముతో వీఁ డెవఁ డని వారి నడుగఁగా 'అయ్యా! వీఁడెవఁడో మే మెఱుఁగము. ఈశ్వరభట్టుగారు వీనిని దమ సన్నిధికిఁ గొనిరావలయునని మా కాజ్ఞయిచ్చుటచే మాపని మేము గావించుకొంటిమి' అని వారు మనవిచేసికొనిరి.

'అట్లయిన నీశ్వరభట్టెచ్చట ?' అని పరమారుఁడు మరలఁ బ్రశ్నింప 'వా రింట నున్నారు. ఇప్పుడే వచ్చెద మని యన్నారు' అని పలికిరి. పరమారుఁ డీశ్వరభట్టువచ్చునంతకును మనస్సును బట్టియుంపలేక సమాచారమేమియో తెలిసికొనవలె నని బద్ధుఁడగు నాపురుషునిఁ జూచి 'ఓరీ! నీవెవఁడవు ? ఎవని సేవకుఁడవు ? నాకుమారిక నపహరించినదురాత్ముఁడ వీవు కావు గదా ? చెప్పుము చెప్పుము' అని పలు

మాఱు గద్దించి యడిగెను. ఎన్నిమాఱు లడిగినను వాఁడు మౌనియై మిన్నక చూచుచుండెనే కాని యొకప్రశ్నమునకుఁ బ్రత్యుత్తర మీయలేదు.

ఇంతలో నీశ్వరభట్టచ్చటికి వచ్చెను. పరమారుఁ డతనిఁగాంచి నమస్కరించి యుచితమర్యాదలుచేసి కూర్చుండఁ బెట్టి 'అయ్యా! ఈశ్వరభట్టూ! బద్ధుఁడగు నీపురుషుఁ డెవఁడు? వీఁ డెక్కడ లభించెను? వీఁ డేమియపరాధము చేసెను? మనయిచ్ఛానిని మోసపుచ్చినవాఁడు వీఁడేనా? ఇచ్ఛానీ వార్తలు నీ కేమయినఁ దెలిసినవా? తెలిసినచో నాశుభ వార్తచే నాకు వీనుల విందొనర్పుము' అని మిగులఁ గుతూహలుఁడై యడుగుచున్నరాజుం గాంచి యీశ్వరభట్టు 'రాజేంద్రా! ఇచ్ఛానీకుమారి కనఁబడనినాఁడు తా మనుభవించుచున్నదుఃఖమును జూచి సహింపలేక యెట్లయినను శక్తి కొలఁది నీయాపత్సమయమునఁ దమకుఁ దోడుపడవలె' నని యెంచి నల్వురతోపాటు నేను నిచ్ఛానిని వెదకుటకును వెడలితిని. ఇదివఱలో నిచ్ఛానీకుమారి దన కీయవలెనని కోరి విఫలమనోరథుఁడయినవాఁ డన్హిలపుర భీమదేవుఁడే; కావున, మాయావియగు నతఁడే యీకన్యాపహరణము చేసియుండు నని యూహించి నేను ఘూర్జరదేశమున కరిగి యందలి పట్టణములవృత్తాంతము లరయుచు మధుమంత మనుదుర్గమున కరిగితిని. పగటిపూట నచ్చట నుండి పరిశీలించితిని. కాని, యిచ్ఛానిజాడలు చెప్పువా రెవ్వరును లేరయిరి. నేను విఫల

మనోరథుఁడనై యారాత్రి ధర్మసత్రములో విడిసి తెల్లవారు జామున లేచి వేణూకపురమునకుఁ బోవుచుంటిని. నాకంటె ముందుగాఁ గొన్నిగజములదూరమున నడచుచున్న యీపురుషునితో నితనిభార్య 'తామొనర్చిన ఘనకార్యమునకు రాజు గొప్పబహుమానము చేయును' అని చెప్పఁగా నది నేను విని 'వీరు చేసినఘనకార్య మేమైయుండును? రాజువలన బహుమాన మొందఁదగినకార్య మేమైయుండును?' అని నే ననుమానించి యది యేదియో కనుఁగొనవలెనని తలంచి యాదినమెల్ల వీని ననుసరించి స్నేహముచేసి నాయందు వీనికి నమ్మకము కలుగునట్లు చేసితిని. వీఁడు తనమాటనున్న యీయుత్తరమునుదీసి నా కిచ్చి తన కం దెంత బహుమానమిమ్మన్న ట్లున్నదో చెప్పు మని కోరెను. నే నది చదివికొని లోలోపల నమందానందము జెంది వీని నారాత్రి నామిత్రుని యింటికిఁ గొనిపోయి యతనిసాయమున వీని బంధించితిని. వీఁడు గొనిపోవుచున్నయుత్తరము నమరసింహుఁడనువాఁడు భీమదేవునకు వ్రాసినది. అని చెప్పి రాజున కిచ్చెను. పరమారుఁడు దాని నందుకొని యిట్లు చదివెను.

ఓ యణ్హిలపుర భూషణమా!

తమయాజ్ఞను శిరసావహించి బైరాగివేషమున నాబూగడమునకుఁ బోయి రూపవతిసాయమునఁ దమకుఁ బ్రియురా లగు నిచ్ఛినీకుమారిని గొనివచ్చితిని. ఈమధుమంతమున రాజభవనములో నామెను బ్రవేశింపఁజేసి జాగరూక

తతోఁ గాచుచున్నాము. ఈవృత్తాంతముఁ దెలిసి పరమారుఁడు సైన్యసమేతుఁడై వచ్చి దీనిని ముట్టడించునేమో యన్నభీతి వొడముచున్నది. కావున, మీరు సేనాసమేతులై త్వరగా వచ్చి యీపురిని గాపాడి రాజకుమారిని వరింతురుగాక! నే నీదినముననే రెండవకార్య మాచరించుటకు ఢిల్లీకిఁ బోయి మనవారితో మాటాడి వచ్చెదను. దానినిగూడ సులభము గానే నెఱవేర్చి వత్తును. ఈమధుమంతుఁ డిచ్ఛినీకుమారిని గొనివచ్చుటలో మిక్కిలి తోడుపడినవాఁడు గాన నితనికి రెండు వేలరూకలకుఁ దక్కువకాకుండ బహుమానము చేయఁ గోరుచున్నాను. మీ రతిశీఘ్రముగనే మధుమంతమునకు వత్తురుగాక!

ఇట్లు,

భవన్మిత్రుఁడు, అమరసింహుఁడు.

పరమారుఁ డాయుత్తరవృత్తాంత మరసి యిచ్ఛిని మధుమంతమున నున్నట్లు విని యానందించుచుండ నీశ్వర భట్టు లేచి యొక ముత్యాలహారము నతని కిచ్చెను. జైతుఁడు దాని నందుకొని యెగాదిగ చూచి యీశ్వర భట్టుతో ఓయీ! ఇది మాయిచ్ఛినీకుమారిది. నే నామె నిమిత్త మతిప్రయత్నముచేసి యీపెద్దముత్తెములు సంపా దించి యపూర్వపద్ధతిని దీనిఁ గట్టించితిని. ఇది నీ కెక్కడ లభించె నని యడుగ నతఁడు చేతులుజోడించి 'మహారాజా!

ఈమధుమంతుని నిచ్చటికిఁ బంపవలె నని నామిత్రునితోఁ జెప్పి రాజకుమారిని జూచి రావలయు' నని మధుమంతము నకుఁ బోయి బిచ్చగాని వేషమును దాల్చి యాదుర్గములోనికిఁ బోయి యిచ్చినికి మిక్కిలి ప్రియమగు నొక శ్లోకమును జదువనారంభించితిని. లోపలనున్న యామె సంగీతముచే హరిణకిశోరమువలె నా శ్లోకముచే నాకర్షింపఁబడి నన్ను గుఱుతించి యచ్చటనున్న చెలికత్తెల కనుమానము తట్టకుండు నట్లు మాటాడి నాకు దీని నిచ్చినది. ఆకుమారి మీకు దీని నానవాలుగా నిచ్చిన దని నేను గ్రహించితిని. 'రాజేంద్రా! ఇచ్చినీకుమారిని నేను జూచితిని. మిగులఁ గృశించి యున్నది. ఆమెదుర్దశ చూడ నాకు మిక్కిలి దుఃఖము వొడమెను. కావున, నామెను గొనివచ్చుటకుఁ దగినప్రయ త్నము చేయవలెను. నా కొక యుపాయము తట్టు చున్నది. అమరసింహుఁ డిచ్చినిని మధుమంతమునఁ బ్రవే శింపఁజేసి యాశుభవార్తను భీమున కుత్తరముఖమునఁ దెలుపుచు నేదో పని సాధించుటకుఁ బోయియున్నాఁడు. ఆయుత్తరమును గొనిపోవుచున్న వీనిని మనము బంధించి తిమి. కావున, భీముఁ డిచ్చినీకుమారి మధుమంతమునకు వచ్చిన దెఱుఁగఁడు. మధుమంతమున నిపుడు సామాన్య సైన్యము లున్నవి. మనము వెంటనే సైన్యసమేతులమై పోయి యాదుర్గమును ముట్టడించినచో సులభముగానే కార్యము నెఱవేఱునని తోఁచుచున్నది. భీముఁ డచ్చటికి రాకమున్నే మన మచటికిఁ బోవుట ముఖ్యకార్యము.

ఇందువిషయమై మీరుగూడ యోజించి కార్యనిశ్చయము చేయుఁ' డని పల్కి యూరకుండెను.

పరమారుఁ, డీశ్వరభట్టు తనకొనర్చినయుపకారమున కానందించి యతనిఁ జూచి 'ఓ మహానుభావా! నీ వొనర్చిన ఘనకార్యమునకు మెచ్చితిని. నీయుపకార మెప్పటికిని మఱవను. ప్రాణపద మగు నాకూఁతువృత్తాంతమును దెచ్చి నాజీవములను నిల్పితివి. ఆఘనకార్యమునకు బహుమతిగా నీముత్యాలహారము నిచ్చుచున్నాను. స్వీకరింపుము' అని పల్కి యీశ్వరభట్టుమెడ నలంకరించి యతనిని సంతసింపఁ జేసెను.

అనంతరము రాజు మధుమంతునిఁ గారాగారమున నుంప నాజ్ఞాపించి మంత్రులఁ జూచి 'ఈశ్వరభట్టుచెప్పినది యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. భీముఁ డచ్చటికి రాక మున్నే మనము సైన్యములతోఁ బోయి దానిని ముట్టడింప వలయును. అందులకు మీ యభిప్రాయము తెలుపుఁ' డని వారంద అందుల కేకగ్రీవముగా నంగీకరించిరి. జైత్రుఁ డామఱునాఁడే దండుతో మధుమంతమున కరిగెను.

## ఇరువదిరెండవప్రకరణము

## లక్ష్యభేదనము

ఉన్నతప్రదేశమునుండి పల్లమునకుఁ బాఱునదీప్రవాహమునలెఁ బరమారునిసైన్యము లాబూగడమును వెడలి

మహావేగముతో నెడతెగని ప్రయాణము లొనర్చి నిరాటంకముగా మధుమంతమును సమీపించెను. కాని, వానికష్టమునకుఁ దగినంతఫలమును బొందలేదు. పరమారుఁ డనుకొనుచట్లచ్చట సామాన్యసైన్యములు లేవు. భీమదేవుఁ డంతకుమున్నే చతురంగసైన్యములతో వచ్చి యాపురమును రక్షించుచుండెను. మహాసముద్రమువలె ముందుఁగన్పట్టు నాసైన్యమును జూచి పరమారుఁడు చేయునదిలేక తనబలముల నక్కడ విడియించెను. మధుమంతము నంటిపెట్టుకొని ఘూర్జరసైన్యమును, దానికి సమీపముగా నాబూగడసైన్యమును నిలిచి యొకదాని నొకటి చూచుకొనుచు వర్షకాలమందు జలపూర్ణము లగుకలమక్షేత్రములవలెఁ దొణఁకులాడుచున్నను దమయధిపతులయాజ్ఞలు గట్లవలె నడ్డుటచే నెక్కడి వక్కడ నుండిపోయినవే కాని యుద్ధమునకుఁ దలపడలేదు. ఇసుముపాఁతరవలెఁ దఱుగని ఘూర్జరసైన్యముతోఁ బోరాడినచోఁ బ్రాణనాశముతప్ప వేఱులాభము గలుగదని పరమారుఁ డెఱుఁగును. అందుచేఁ గుపితహృతయుఁడైనను, భీమదేవునితోఁగూడ నతనిసైన్యముల నొక్కముద్దఁ జేసికొని యొక్కమాఁటే మ్రింగవలె నని కోరుచున్నను యుద్ధమొనర్పఁ దనవారి నాజ్ఞాపింపలేదు.

పరమారునిసైన్యము నవలీల జయింపఁగల ననుధైర్యమున్నను భీమదేవుఁ డందులకుఁ బ్రయత్నింపలేదు. కాఁగల మానుగా రగు పరమారునిఁ దాను బరాభవించినచోఁ దన

ప్రియురా లగు యిచ్ఛినీకుమారి మనస్సున దుఃఖించి తన మనోరథ మెక్కడ వ్యర్థముగావించునో యనెడుభీతిగల యతఁడాసాహసమున కెట్లంగీకరించును? వెనుకటి సంభాషణమునందా నతని వరింపనట్లు స్పష్టముగా నిచ్ఛిని చెప్పినది. అయినను భీముఁడు నిరాశుఁడు గాలేదు. లేఁబ్రాయపుబాలికలు సిగ్గుభరమునఁ దన్నుఁ గోరవచ్చినవారిని మొదటిపర్యాయమున నిరసించినను క్రమముగా దర్శనసంభాషణాదులచే మచ్చికపడి యాపురుషునం దనురాగము వహించి పెండ్లియాడక మాన రని యతనియభిప్రాయము.

భీమదేవుఁ డొకనాఁ డిచ్ఛినీకుమారిని జూడ నామె మందిరమున కేగెను. కాని, యామె యచ్చట లేదు. వకుళతోఁగూడఁ గైలాసశిఖర మనెడిసౌధ మెక్కి తనతండ్రిగారిసైన్యములను, భీమునిసైన్యములను జూచుచుండెను. భీముఁ డది యెఱిఁగి మెల్ల మెల్ల నాసౌధమునకుఁ బోయెను.

ఇచ్ఛిని భీమదేవు నల్లంత దూరముననే చూచి మనస్సులో నిందించుకొనుచు మేల్ముసుఁగు సవరించుకొని వకుళ చాటున నిలువఁబడెను. అతఁడు వారిని సమీపించి 'వకుళా! ఇట నేమి చేయుచున్నారు?' అని యడిగెను.

వకు—మహాప్రభూ! అమ్మగారు చల్లగాలికై వచ్చినారు. ఆమె వెనుక నేనును వచ్చితిని.

భీమ—అంతియేనా? లేక, యాబూగడ ఘూర్జర సైన్యముల బలాబలములఁ బరిశీలించుచున్నారా?

వకు—రాజేంద్రా! వానిని జూచినంతనే గడగడ వడఁకు మావంటిభీరువుల కంతశక్తి యెక్కడ ?

భీమ—ఓసీ! వెఱ్ఱిదానా! నీవు వాస్తవముగా నట్టిదానవే కావచ్చును. కాని, యారాకుమారి యట్టిది కాదు. ఇట్టిసైన్యముల నిముసమాత్రమున నుఱుమాడ శక్తిగలది. విలువిద్యచే భీమదేవునంతవానినే వశపఱచుకొన్న యీ యువతి యెంతకు సమర్థురాలు కాదు!

అది విని వకుళ యూరకుండెను. ఇచ్ఛినీకుమారి తనలో 'ఈ దురాత్ముఁడు మంచిమాటలాడి నన్నుఁ బొంగించి లోఁబఱుచుకొనఁ జూచుచున్నాఁడు. ఇచ్ఛినీకుమారి వీనిముఖస్తుతులకుఁ బొంగిపోవునది కాదు. వీనిమంచిమాటలకు లొంగునది కాదు. వీనిభీకరవచనములకు జంకునది కాదు' అని తలంచుచు నూరకుండెను.

అపుడు భీముఁ డిచ్ఛినీకుమారినిఁ జూచి 'రాజపుత్రీ! చూడుము. నీతండ్రిసైన్యమునకును, నాసైన్యమునకును నెంత వార గలదో చూడుము. యుద్ధమునకుఁ దలపడినచో దాని జయించుట నా కెంతపని? అయినను నాకుఁ బ్రాణప్రియురాలవగు నీమనస్సు కలఁతఁజెందునేమో యని వెనుదీయుచున్నాను' అని పలికెను.

తనవచనములు విని యాయువతి తనతండ్రిసైన్యములను గాపాడవలె నని ప్రార్థించుననియు, నామె ప్రార్థించునట్లుచేసి తన్మూలముగా నామెదయను సంపాదించుకొన

వచ్చుననియుఁ దలంచి యామెవచనమునకై ప్రతీక్షించి యుండెను. కాని, యెంతసే పూరకున్నను బ్రత్యుత్తరము రాలేదు. భీముఁ డామెను జూచి 'రాజపుత్రీ! ఊరకుండు వేల? నీ విప్పుడు చక్కఁగా నాలోచింపవలసినసమయము. కార్యముమించిపోయినపిమ్మట నేమనుకొన్నను లాభము లేదు. మీతండ్రిగారికిఁ బ్రాణాపాయముసంభవించుచున్న పుడు దానిఁ దప్పించుట నీకు విహితకృత్యము. అది నీ కశక్యము కాదు. అది నీచేతిలోనే యున్నది. కన్నతండ్రి వంతలఁబడుచుండఁ జూచి నీవు సహింపఁగలవా? చెప్పుము, చెప్పుము' అని యడిగెను.

అందుల కామె 'సహింపలే' నని యుత్తరమిచ్చు నని యతఁ డనుకొనెను. కాని, యాయువతి యేమియును మాటాడలేదు.

భీముఁ డంతతో నూరకుండక 'యువతీ! మాటాడ వేమి? నేఁ దలంచిన నొక్కక్షణములోనే నీతండ్రిని, నీసైన్య ములను జయించి యాబూగడమును మంటఁ గలుపుదును. అయినను నే నాపని చేయనక్కఱలేదు. నే నిక్కడనుండి చేసైగ జేసినఁ జాలును. నా సైన్యములే సర్వమును జక్క పెట్టుకొనును. కావునఁ గార్యనిశ్చయముఁ జేయుము. నీ మూలమున నీతండ్రికిఁ బెద్దయపాయము వచ్చుచుండఁ గూఁతురవగు నీవు తప్పింపవలదా? నిన్నుఁ గని పెంచి పెద్ద జేసిన తండ్రి నిట్టియాపత్సమయమున విడుచుట నీవంటి

యుత్తమురాలికిఁ దగునా? నిన్నుఁ గన్నందులకు నీతండ్రికి నీవు గల్గించుప్రతిఫలమిదియా? ఆలోచింపుము, మీవారిని రక్షింపఁ గంకణముగట్టుకొనుము' అని హితోపదేశముఁ జేసెను.

ఆ వచనము లిచ్ఛని విని లోలోపలఁ బొంగివచ్చు కోపమును నతికష్టముచే నడంచుకొని తా నతనికిఁ దగిన సమాధాన మిచ్చి నోరుగట్టింపకున్న నీక నతఁ డిట్లే మాటాడుచుండు నని భావించి మెల్లగా 'మావిషయమై జాలిపడనవరము లేదు. ఇదివఱకుఁ గల్గించిన కష్టముకంటెఁ బెద్దకష్టమును మీరు గల్గింపలేరు. చేయవలసినది చేసికొనుఁడు. ఉత్తమక్షత్రియులకు వీరమరణము శ్లాఘనీయము. మా తండ్రిగా రట్లు చేసి మరణబాధకంటె మిగులఁ దీవ్రమయిన యిహలోకదుఃఖములను విడిచి శాశ్వతసుఖ మనుభవింతురుగాక ! మీయిష్టమువచ్చినట్లు చేసికొనుఁడు' అని పలికెను.

భీ—యువతీ! మీతండ్రి నట్టిదుఃఖములపాలుచేయుట తగునా!

ఇచ్ఛా—క్షత్రియునకు యుద్ధమరణము దుఃఖకరముగా దని చెప్పితి నే!

భీమ—తప్పింప నవకాశము నీకుఁ గల్గియు నట్టి మెట్ట వేదాంతపువచనములాడెద వేల?

ఇచ్ఛి——ఆఁడుదానివలన రక్షణమొందుటకు మా తండ్రి యంత పౌరుషహీనుఁడు కాఁడు. అంతవివేకశూన్యుఁడు కాఁడు. కానున్నది కాకమానదు. మీ రిఁకఁ బొల్లుమాటలాడక చేయఁదలఁచినది చేసికొనుఁడు.

భీముఁ డది విని తన హితోపదేశము వ్యర్థమైన దని తలంచి కొంతసేపూరకుండి యిట్లనియె. 'ఓ రాజపుత్రీ! మీతండ్రియందు నీ వంతకూ్రత వహించినను నేను వహింపలేను. యుద్ధమున నతని నెదుర్కొన సాహసింపఁగలనా?' అని పలికెను.

ఇచ్ఛి——ఇంత దయార్ద్రహృదయు లగుటనే కాఁబోలు మా కుటుంబము నింతగా సుఖింపఁజేయుచున్నారు.

భీ——యువతీ! నాకు మీయందు ద్వేషము లేదు. మిమ్ము బాధింపవలె నని లేదు.

ఇచ్ఛి——అట్లయిన మోసపుచ్చి న న్నిచ్చటి కెందులకుఁ దెచ్చినారు?

భీ——నిన్ను బాధించుటకుఁ దీసికొని రాలేదు. నీయస్త్రవిద్యానైపుణ్యమును జూచి యానందించుటకు.

ఇచ్ఛి——అదియే సత్యమైన నీస్వల్పమునకు న న్నీదుర్గమున బంధించి బాధింపవలెనా?

భీ——నీ కది స్వల్పమైనను నా కది ఘనమే! నీయస్త్రవిద్యాప్రవీణతం జూపు దేని చూచి యానందించి నిన్ను విడిచిపుచ్చెదను.

ఇచ్ఛి—విలునమ్ములనిటు తెండు.

భీ—'ఇచ్చెను.'

ఇచ్ఛి—వకుళచే వానిని దెప్పించుకొని నిముసములో నావింటి నెక్కిడి బాణముసంధించి 'ఓ రాజా! ఈబాణముతో నీశిరమును ద్రెళ్ళనేసిన నేమిచేయుదువు?' అనెను.

భీమదేవుఁ డామెభీకరాకారమును జూచి నివ్వెఱపడి స్తంభాకృతివహించి యుండెను. అది చూచి యారాకన్నియ 'ఓ రాజా! ఈబాణమున నీశిరమును ఖండించిన నీకు దిక్కు లేదు. అయినను, నిరాయుధుని జంపుట వీరధర్మము కాదు. మఱియు, నీవంటి దుష్టహృదయుఁడు వెంటనే మరణించుట మంచిదికాదు. కుళ్ళికుళ్ళి చావవలయును. ఇదిగో! బాణము సంధించితిని. దీనితోఁ గోటగోడపైనున్న నీజెండాను బడఁగొట్టెదను చూడుము' అని గుఱిచూచి కొట్టెను. వెంటనే యది తెగి నేలఁ బడెను. ఆమె యతనిఁ జూచి 'నా చాతుర్యమును గాంచితివి! ఇఁక నన్ను విడిచిపెట్టుము' అని పలికెను.

భీముఁ డది చూచి యాశ్చర్యపడి 'ఇంతచాతుర్యము నే నెక్కడను జూడలేదు. అమ్మయ్యో! ఇట్టి నిన్ను విడువఁ గలనా?' అని పల్కుచు నచ్చోటువాసి చనెను.

## ఇరువది మూఁడవ ప్రకరణము

## అస్త్రకౌశలము

మధుమంతమున కొక ప్రక్కఁ గోటగోడనంటిపెట్టుకొని యున్నతమగు నొకకొండ గలదు. దానిక్రిందిచఱియలిసుముచల్లినరాలనంత దట్టములగు వెదురుటడవులచేఁ గప్పఁబడియుండుటవలన గాలికైనను జొరఁ దరముగాకుండెను. అట్లుండ మనుష్యు లాయరణ్యమును భేదించుకొని యాకోటనెట్లును ముట్టడింపఁ జాలరని నమ్మకముండుటచే సైన్యములు తక్కినమూఁడుదిక్కులందునుమాత్రమే నివసించి దానిని గాపాడుచుందురు. ప్రస్తుతము భీమునిసైన్యములుగూడ నదే విధమునఁ గాచికొని యుండెను.

కైలాసశిఖర మనుసౌధము మిగుల నున్నతమైన దని చెప్పితిని. అది యాప్రక్కనున్నపర్వతమునకు సోదగునివలెఁ గన్పట్టుచుండెను. దానియుపరిభాగముననుండి యాపర్వతారణ్యమునెల్లను గన్నులవిందుగాఁ జూడవచ్చును. మఱియు, నటఁ గూర్చుండి యాకొండచఱియలయందుఁ దిరుగుమృగములను లక్షించి వేఁటాడుట కనువగుటచే నాసౌధశిఖరము మృగయావినోదమునకుఁ దగినస్థలమని కూడఁ జెప్పవచ్చును.

నాఁడు భీముఁడు విలునమ్ములచ్చటనే విడిచి పోయినప్పటినుండియు నిచ్ఛినీకుమారి వానినిదాల్చి యాసౌధోపరిభాగముననిలిచి యాయరణ్యమును జక్కఁగా బరిశీలించి

యే దేనిమృగము గనఁబడిన దానిని వేఁటాడుచుఁ గాలము
గడపుచుండెను.

ఒకనాఁ డామె యాసౌధశిఖరమునఁ గూర్చుండి
మృగముల నరయుచుండెను. ఆమె యాయరణ్యమును దదేక
దృష్టితోఁ జూచుచుండఁగా నొకచెట్టుకొనయం దొక తెల్లని
వస్తువు గానవచ్చెను. 'ఆవస్తువేమైయుండును? ఆచెట్టుకొన
యం దట్లుండుటకుఁ గారణమేమి?' అని ప్రశ్నించుకొను
చుండ నావస్తు విట్టటుఁ గదలనారంభించెను. అది యామె
కొక తెల్లపతాకవలెఁ బొడచూపెను. ఎవరో మనుష్యులు
తెల్లనిపతాక పట్టుకొని యాచెట్టున నున్నా రని గ్రహించి
యామె యాశ్చర్యపడుచుండ నింతలో నొకపురుషుఁడు గాన
వచ్చెను. ఆమె యటనుండి కదలక మెదలక యాపురుషు
నట్లె చూచుచుండ వాఁడు పొడువగు నొకవింటి నెక్కిడి
యందు బాణమును సంధించుచుండెను. 'ఆహా! ఏమి! వీఁ
డెవఁడో విలునమ్ములు దాల్చియున్నాఁడు. మఱియు, వింట
బాణము సంధించుచున్నాఁడు. నన్నే గుఱిగాఁ జూచి కొట్టు
టకుఁ బ్రయత్నించుచున్నట్టు లున్నది. వీఁ డెవఁ డై యుం
డును? నిరపరాధనగు నన్ను వీఁ డెందులకుఁ గొట్టును?
ఏమి జరుగునో చూచెదనుగాక!' యని యామెయు నట్లే
యుండెను. ఇంతలో నొకబాణము రివ్వున వచ్చి యామెకు
సమీపముగాఁ బడెను. ఆమె యాబాణమును దీసికొని
ఆహా! ఇ దేమి? వింతగా నున్నదే! ఇది మిగుల వాఁడి

బాణము. ఇది నాకుఁ దగిలినచోఁ దప్పక ప్రమాదించునే! వాఁ డెవఁడో లక్ష్యశుద్ధిగలవాఁడును, విలువిద్యయందు నేర్పుగలవాఁడును, దూరస్థములగువస్తువుల నేయఁజాలుబలము గలవాఁడును గాని సామాన్యుఁడు కాఁడు. కాకపోయిన నీ బాణము నింత నిరపాయముగా నాచెంతఁబడునట్లు సేయుట యసంభవము. మఱియు, వానికి నన్నుఁ గొట్టుఁదలంపున్నట్లు తోఁపదు. కానిచో, నంత లక్ష్యశుద్ధిగలవాఁ డాశరమును నాపైఁ బఱపలేకపోవునా? పూర్వ మర్జునుఁడు శత్రుబలము నడుమనున్న భీష్మద్రోణులను సమీపించి నమస్కార కుశలప్రశ్నములు చేయ వలనుపడక దూరమునుండియె బాణములు పఱపి వారిని గౌరవించె నని వినియున్నాను. అట్లే వీఁ డెవఁడో నాకుఁ గుశలప్రశ్నబాణములను బఱపుచున్నాఁడేమో!' అని యనుకొనునంతలో మఱియొక బాణము రివ్వున వచ్చి యామెచెంతఁ బడెను. ఇచ్ఛిని దాని కచ్చెరువందుచు దానిని దీసికొని పరిశీలింప దాని కొకయుత్తరము బంధింపఁ బడియుండెను. దాని నాత్రతోఁ దీసికొని తనలో నిట్లు చదువుకొనెను.

'కన్యకామణీ! నీకు సంభవించినకష్టమునకు మే మెంతయును విచారించుచున్నాము. అందులో నీతండ్రిదుఃఖమునకు మేరలేదు. ఆనాఁడు బిచ్చగానివేషమున వచ్చి నీజాడలను నీజనకునకుఁ దెలియఁజెప్పి నీవిచ్చినహారము నతనికిఁ జూపి కొంతదుఃఖమును దగ్గించితిని. భీముదేవుఁ డచ్చటికి

రాకముందే వచ్చి యీదుర్గమును సాధించి నిన్ను గొని పోవలెనని యనుకొన్నాము. కాని, దైవము మాకోర్కి వ్యర్థముగావించెను. మే మిచ్చటికి వచ్చినప్పటినుండియు నెట్లయినను నీదర్శనముచేసి మావృత్తాంతము నీకుఁ దెలుప వలెనని యెంతయో ప్రయత్నించితిని. కాని, భీముని సైనికులు రాకాసులవలెఁ గాచికొనియుండుటచే దుర్గప్రవేశము నాకసాధ్యమయ్యెను. అందుల కేదైననుపాయ మాలోచింపవలెనని తలంచి యీపర్వతము నెక్కి యీదుర్గమంతయు నవలోకించుచుండ నీవు నాకుఁ గానవచ్చితివి. 'ఒరులకుఁ జొర శక్యముకాని యీదుర్గమందున్ననీకు మావృత్తాంతమును దెలుపు టెట్లని యాలోచించి తుద కీయుపాయమును బన్నితిని. అపారసైన్యములతోఁగూడిన నీభీముని జయించుట యసాధ్యము. మఱి నిన్నీ చెఱనుండి యెట్లు తప్పించుటయో మాకుఁ దెలియకున్నది. ఈసమయమున మాయోపాయము తప్ప వేఱొకటి పనిచేయదు. బుద్ధిమంతురాలవు గదా! నీ వేదైన నుపాయము చెప్పుము. నీకస్త్రవిద్యయందు మిక్కిలి నేర్పుగలదు. కావున, నీవును నావలెనే బాణమునకు నీయభిప్రాయముఁ దెలుపునుత్తరమును గట్టి నాకుఁ బంపుము. నేను రేపు మరల వచ్చెదను. అప్పటికి నీవు సిద్ధురాలవై యుండవలయును.

ఇట్లు చదువుకొని యిచ్చిని యమితానందము నొంది యీశ్వరభట్టుబుద్ధివిశారదత్వమునకును, సమయస్ఫూర్తికిని,

దమకుటుంబమునందున్న ప్రేమకును మెచ్చుకొనుచు మరలఁ జెట్టువైపు చూచెను. కాని, వెనుకటిచోట నెవ్వరును గన్పడ లేదు. ఇచ్ఛినీకుమారి కొంతసే పేమియో యాలోచించుచు నందు విహరించు తన్ను వెదకుకొనుచువచ్చినవకుళను గూడి తనమందిరమున కరిగెను.

## ఇరువదినాల్గవ ప్రకరణము

## సందేశము

తనపినతండ్రి యగుకరుణరాజు ప్రతాపసింహుని, నాతనితమ్ముని నిష్కారణముగాఁ జంపె నన్న విచారము పృథ్వీరాజును సంతతమును బాధించుచుండెను. ప్రతాప సింహాదులు చేసిన నేర మేమియును బైటికిఁ గనఁబడలేదు’ కరుణరాజు చూపినయపరాధము ప్రాణములను దీయఁదగి నంతది కాదు. కావునఁ, గరుణరాజుచేసినది మిగులఁ గ్రూర కార్యమనుటకు సందియము లేదు. కార్యము మించినపిమ్మట విచారించిన నేమి ప్రయోజనము? చేతులుగాలినపిమ్మట నాకులు పట్టుకొనిన లాభ మేమి? ఇఁకఁ గరుణరాజును నిం దించినను, లేక సంహరించినను జచ్చినప్రతాపసింహాదులు బ్రతికిరారు గదా! ఆశ్రితులఁ జంపించె నన్నయపవాదము తనకుఁ బోదు గదా! ఇఁక నేమి చేయుట? పృథ్వీరా జీవిష యమై యాలోచించి యిఁక మిగిలినవారినైనను దగువిధమున

నాదరించి వారి భ్రాతృదుఃఖమును దొలఁగించి సంతసింపఁజేసి నచోఁ దనసన్నిధిని వర్తిల్లిన క్రూరకార్యమునకుఁ గొంత శాంతి కలుగునని మనస్సులో నిశ్చయించి పలుమాఱు వారి యిండ్లకరిగియుఁ బ్రత్యేకముగా వారిని దనయింటికిఁ బిలిచి గౌరవించియుఁ, బెద్దయుద్యోగముల నిచ్చియు వారిని బలు విధముల నాదరించి సంతుష్టులనుగాఁ జేసెను. వారును రాజు చేయుచున్న గౌరవమువలనఁ గ్రమక్రమముగా భ్రాతృదుఃఖమును మఱచి సంతుష్టులైనట్లు పైకి వర్తించి యరమర లేకుండ నారాజసత్తముని గొలుచుచుండిరి.

ఒకనాఁడు పృథ్వీరాజు నిండుకొలువుండెను. సభామండపము జనులచేఁ గ్రిక్కిఱిసియుండెను. అంత ద్వారపాలకుఁడొకపురుషుని రాజసన్నిధిని నిలువఁబెట్టి వెడలిపోవ వాఁడు రాజునకు నమస్కరించి యొక్కయుత్తర మతని పాదసన్నిధిని బడవైచెను. రాజు దాని నందుకొని యిట్లు చదువుకొనెను.

రాజేంద్రా! నేను మిమ్మును విధిప్రకారముగాఁ బెండ్లాడకపోయినను జిరకాలమునుండి మీసద్గుణములను వినుచు, మీపాదసేవ నొనర్చుటకే మదిలోఁ గాంక్షించుచు, మీసుందరరూపము నే నాహృదయపీఠమున నిల్పి పూజించుచు, నాప్రాణములకంటెను నెక్కుడు ప్రియముగాఁ జూచుకొనుచున్న మిమ్మును 'ప్రాణవల్లభా' అను పవిత్రాక్షరములతో— కాదు, అమృతమయాక్షరములతోఁ బిలిచి యానందించుట కాజ్ఞయిండు. ఓ ప్రాణవల్లభా! నే నుత్తమమగు పరమాను

వంశమునం బొడమితిని. అందులో నన్నివిధములను వాసి గాంచిన జైతపరమారుని కుమారికను. భవదీయగుణసంపదను విని నాహృదయకమలము నిదివఱకే యర్పించుకొని యున్నాను. మనమున నిశ్చయించుకొన్నపురుషుఁడు భర్తయగుననుటకు సందియము లేదు. ఇట్లుండ నీభార్య నగు నన్ను ఘూర్జరభీమదేవుఁడు మోహించి మాయోపాయముచేఁ దనపురమగు నీమధుమంతమునకుఁ గొనివచ్చి చెఱ పెట్టెను. మాతండ్రిగారు నన్ను విడిపించుటకై సైన్యసమేతులై వచ్చియుఁ బ్రబలుఁడగుభీమదేవు నెదుర్కొన వెను దీయుచున్నారు. వా రొక వేళఁ దెగించి పోరినను యుద్ధమున మడియుట తప్ప భీముని జయింపలేరు. నన్ను విడిపింపలేరు. కావున, మహాపరాక్రమశాలి వగునీవు వచ్చి శత్రువును జయించి నీభార్యను విడిపించుకొనుము. ఏవిధమునం జూచినను నే నీపట్టున మీ కుపేక్షింపఁదగినదానను గాను. త్రికరణములలో మనస్సే ప్రధానమగుట దానిచే వరింపఁబడిన మీరు భర్తలే యనుకొన్నచోఁ బరగృహీత నగునన్ను రక్షింపవలసినదని వేఱ చెప్పవలయునా? రావణుఁ డపహరించిన సీతను విడిపించుటకై రాముఁ డెంత కష్టపడెనో, యెట్లు విడిపించెనో దేవరకుఁ దెలియనివిషయము కాదు. ఒక వేళ నేను మిమ్మును బ్రేమించినను నన్ను మీరు ప్రేమింపక భార్యనుగాఁ జేసికొనుటకు మీ కిష్టములేకపోయి యుండ వచ్చును, అయినను నే నుపేక్షింపఁదగినదానను గాను.

శత్రువులచేఁ బీడితయగుచున్న రాజకుమారిక తన్ను రక్షింప సమర్థుఁడైన యొకరాజసత్తముని కొకపట్టుతోరమును బంపి శరణుజొచ్చుటయు, నా రా జాతోరమును జేతికిబంధించికొని శత్రువునిజయించి యాకన్యకను విడిపించుటయు రాజపుత్రాచారము. ఆ యాచారముచేతనైనను నేను రక్షింపఁదగిన దాననే ! మనక్షత్రియాచారమును బాటింపకున్నను శరణాగత నగునన్ను విడుచుట పాడిగాదు. శరణాగతరక్షణము మీవంటి యుదారపురుషులకు విహితకృత్యము గదా ! మఱియు, నేను పాలవంటి క్షత్రియవంశమునఁ బొడమిన దానను. హిందూయువతిని. ఇట్టి నన్ను జైనమతావలంబి యగు నొకఁడు బలాత్కరించి వరించి ధర్మసంక్షయముచేయఁ జూచుచుండ మీవంటిధర్మజ్ఞులు నాధర్మవ్యత్యాసమును దొలఁగింప సమర్థులయ్యు నట్లు చేయకపోవుట న్యాయము కాదు. కావున, రాజేంద్రా ! ఒక కన్నియను రక్షించుటకై బహుప్రాణనాశము గల్గించుయుద్ధమున కెలపూనవలయు నని యోజింపక సనాతనమగు ధర్మమును స్థాపించుటకు బద్ధకంకణుఁడవై శత్రువులఁ దునుమాడి నన్ను రక్షింపుము.

ఇట్లు,
మీ దాసురాలు,
ఇచ్ఛినీకుమారి.

ఆయుత్తరమును జదువుకొనుచున్నపుడు పృథ్వీరాజునకుఁ గల్గినయానందమునకు మేర లేదు. ఏయువతీమణి సద్గుణ

ములను జిరకాలమునుండి వినుచు మనసారఁ బ్రేమించియు నామెయనురాగ మెట్టు ప్రాఁకుచున్నదో తెలియక వెనుక దీయుచుండెనో యాకుమారిస్వహ_స్తముతోననురాగరసమును స్రవించుచున్న యట్టియు_త్తరమును వ్రాసి దీనాతిదీనముగాఁ బ్రార్థించుటయే కాక ధర్మస్థాపనముచేయ నుపదేశించు చుండ నా రా జందులకు విముఖుండగునా? పృథ్వీరాజు శరణాగతులను రక్షింపను, శత్రువులను శిక్షింపను, సనాతన ధర్మమును స్థాపింపను నెంతమాత్రమును జంకువాఁడు కాఁడు. ఈసమయమున నతనిహృదయాకాశమున నొక పూర్వవృత్తాంతము మెఱుపువలె మెఱసెను. తనతండ్రిని జంపి తనతోఁ దీఱనివైర మవలంబించియున్న భీము నెదుర్కొని కసిదీర్చుకొనుట కంతకంటె మంచిసమయ మింక దొరకదని యతఁడు నిశ్చయించుకొనెను. భీమునివృ_త్తము స్ఫురింపఁగానే యతని హృదయమునఁ బుట్టిన క్రోధాగ్నిజ్వాలలకు ద్వారములో యనున ట్లతనికన్ను లరుణకాంతులను గురియింపసాగెను. ఆయగ్నిజ్వాలలకుమీఁదుగా నెగయుచున్న ధూమరేఖలవలె నొప్పుచుఁ గనుబొమలు ముడిపడఁజొచ్చెను. తనయాత్మ నంటుకొనియున్న శాంతగుణము వదలించుకొనుటకోయన శరీరము కంపమొందఁజొచ్చెను. వెంటనే యతఁ డాతోరమును జేతికి బంధించుకొని సభ్యులను జూచి గంభీరభాషణముల నిట్లనియె. 'మంత్రులారా! సేనాధిపతులారా! హితులారా! వెంటనే పోయి యాయువతినిఁ గాంచుట మన కవశ్యక_ర్త

వ్యము. దానివలన మన కెన్నియో లాభములు గలవు. శరణాగతురాలిని రక్షించినవార మగుదుము. రాజపుత్రాచారమును బాటించినవార మగుదుము. సనాతనధర్మమును స్థాపించినవార మగుదుము. హృదయశల్యమువంటి భీముని జయించి కసిదీర్చుకొన్నవార మగుదుము. పితృఋణమును దీర్చుకొన్నవార మగుదుము. భీమునిఁ బరిమార్చుటకుఁ దగినసమయ మెప్పుడు లభించునా యని యోజించుచుండ దైవము నా కిట్టియుక్తసమయమును ఘటింపఁజేసెను. కావున వెంటనే రణభేరుల మ్రోయింపుఁడు, ఆయుధములను ధరించి సేనలను గదలింపుఁడు' అని యాజ్ఞాపించి సభ చాలించెను.

## ఇరువదియైదవ ప్రకరణము

### ప్రతీకారము

పృథ్వీరా జపారసైన్యములతో మధుమంతమునకు సమీపముగా నాబూసైన్య నివేశమున కొకతట్టు విడిసి యుండెను. జైతపరమారుఁడు పృథ్వీరాజున కెదురుగాఁ బోయి యెక్కుడుగా గౌరవించెను. పృథ్వీశ్వరుఁడును పరమారుఁడొనరించినమర్యాదలకు మిగుల సంతసించెను. అపుడు పరమారుఁడు పృథ్వీరాజుతో "రాజేంద్రా! నీవు సైన్యసమేతుఁడవై మాకుఁ దోడుపడ వచ్చినందుల కెంతయు సంతసించుచున్నాము. ఇఁక భీమునివలన మా కెంతమాత్ర

మును భయములేదు. మాయిచ్ఛిని నీదయకుఁ బాత్రురాలగు టచే ధన్యురా లయినది. మాయావిని మాయచేతనే జయింప వలెనని పెద్ద లందురు. మాయచే మనల వంచించి యిచ్ఛినీ కుమారిని భీముఁడు గొనిపోయెను. ఆభీముని మనము మాయచేఁ గన్నుఁగప్పి యిచ్ఛినిని గొనివచ్చుట యుచితము గాదా! మనకు భీమునితో నిప్పట్టున యుద్ధము తప్పదు. ముందుగా నిచ్ఛినీకుమారి నెట్లో మనశిబిరమునకు రప్పించి యుద్ధమొనర్చుటయా? మొదటిపక్షమును మనమవలంబించి నచో ముందుగా మనమే సమరమునకు దిగవలెను. రెండవ పక్షమైనచో నిచ్ఛినిని విడుచుట కిష్టములేక భీముఁడే ముందుగా యుద్ధ మారంభించును. ఇం దేదియుక్తమో యోజింపుము." అని పల్కెను. అది విని పృథ్వీరాజు 'భూపాలా! భీమునిసైన్యములు సామాన్యములు కావు. మనము ముందు యుద్ధమునకే కడంగినచో నెన్నిదినములు పట్టునో యెవ్వరు చెప్పఁగలరు. ఈలోపున మాయావి యగు భీముఁ డాకుమారి కెట్టియాపద పుట్టించునో; యెట్టిపరాభ వముఁ గల్గించునో; రాకుమారిని విడిపించుటయే మనకు ముఖ్యకార్యము. ఆమె చేఁజిక్కినపిమ్మట మననేమిచేసినను విచారముండదు. తగిన యుపాయ మలవడినచో నామెను విడిపించితెచ్చుటయే యుచితము.' అని ప్రత్యుత్తరము చెప్పెను. అందుచే నొకమూల నాబూసైన్యములును, నొక తట్టు ఢిల్లీబలములును విడిసియుండినవేకాని యుద్ధ మారంభింప

లేదు. ఆబూరాజునకు ఢిల్లీరాజు సహాయుఁడై వచ్చియున్నందున భీమరాజు మిగుల జాగరూకుఁడై దుర్గములో నుండియే పోరుసల్ప నిశ్చయించి శత్రువులు తమ్మెదిరించినప్పుడే యుద్ధముచేయుఁ డని సైనికుల కాజ్ఞాపించుటచే నాఘూర్జరులాయుధపాణులై కంటికి ఱెప్పవలె నాదుర్గమును గాచుచుండిరి. కాని, యుద్ధ మారంభింపలేదు. ఇట్లామూఁడు సైన్యములును నానావిధయుద్ధపరికరములను దాల్చి వర్షకాలమున నాకసముల బారులుదీర్చి స్వకీయమగు నీలకాంతులచే జగము నంధకారముగ నొనర్చుచు, నడుమ నడుమ మెఱపులచేఁ చూపఱకు మిఱుమిట్లు గొలుపుచు వర్షప్రారంభకారియగుచల్లగాలి కెదురుచూచుచున్న మేఘబృందములవలె మిగుల గంభీరములై రాజాజ్ఞ కెదురుచూచుచుండెను. శత్రుసైన్యములు తనదుర్గమును సమీపించి విడిసియున్నను ముట్టడి ప్రారంభింపక శిబిరములం దేలయుండిపోయినవో యని యాలోచించియు సరియగుకారణ మరయలేక భీముఁడు సైన్యములు దుర్గమును ముట్టడించుటకుఁ బూర్వమే గుజరాతునుండి మఱికొంతసైన్యమును రప్పించుకొన నిశ్చయించి యచ్చట కాజ్ఞాపత్రమును బంపెను. తనయనుమతి లేకుండఁ బైనున్నవారిని లోనికిఁగాని, లోనివారిని బైకిఁగాని పోనీయరా దని ద్వారపాలకులను గఠినముగా శాసించి దుర్గద్వారములు మూయించి భీమదేవుఁడు మిగుల జాగరూకుఁడై యుండెను.

ఒకనాఁ డతఁ డిచ్ఛినీకుమారినిఁ జూచుతలంపుతో నామెమందిరమునకుఁ బోయెను. ఆమె వకుళతో నేదియో సంభాషించుచు నాకస్మికముగా నటఁ బ్రత్యక్షమయిన భీమునిఁ జూచి చటాలున లేచి మేల్ముసుఁగు సవరించుకొని నిలువఁబడెను. అపుడు భీముఁ డామెను జూచి 'యువతీ ! నీవు లేచి ప్రత్యుత్థానము చేయనవసరము లేదు. నీవు నిలువఁబడియుండి యుండుటను జూచి చిగురువలె నతికోమలములగు నీపాదములెక్కడఁ గందునో యని నామనస్సు కుందుచున్నది. కూర్చుండుము, కూర్చుండుము. నిలువఁబడిన నేమి ? కూర్చుండిన నేమి ? సంతోషపూర్వకముగా నాతో సంభాషించినఁ జాలును. యువతీ ! నిన్ను విడిపింప ఢిల్లీశ్వరుఁడు గూడ వచ్చియున్నాఁడు. వచ్చుఁగాక ! ఏమిలాభము ? ఈచాళుక్యభీమునకు—శత్రుభయంకరుఁడగు నన్హిలపురమునకు—చేఁజిక్కిన వస్తువును విడిపింప ఢిల్లీశ్వరునకుఁ గాదు, సురగణములతోఁ గూడివచ్చిన సురేశ్వరునకైనను దరమా ? ప్రమథగణ సహితుఁడైన మహేశ్వరునికైనను దరమా ? నాపరాక్రమమును నెదుటివారిపరాక్రమమును బరిశీలింతువుగాక ! ఢిల్లీశ్వరుకంటె నే నెక్కుడుపరాక్రమశాలినైనచో వరింతువా ? చెప్పుము. పోనిమ్ము, నీవు నన్ను వరించినను సరియె. లేకపోయినను సరియె, ఏదీ నీధనుర్విద్యాపాండిత్యమును మఱి యొకసారి చూపుము. ఆనాఁడు సులభముగా నే నాటెక్కెమును బడఁగొట్టితివి. నీలక్ష్యశుద్ధికి మిగుల నానందించితిని.

హస్తలాఘవమునకు మెచ్చుకొంటిని. సుందరీ! నీ కింత నేర్పు—మావంటి వీరులుగూడ మెచ్చుకొనఁదగినంత నేర్పు—నీ కెట్లలవడెను? మఱియొకమాఱు వింటిని మోపెట్టి బాణమును సంధించి లక్ష్యమును భేదించి నా కానందముఁగూర్పుము' అని పలికెను.

ఇచ్ఛిని యాతనిపలుకులు విని 'రాజా! నీగంభీరవచనములకు జంకుదానను గాను. నిన్ను వరించుదానను గాను. నీదుర్గమున నన్నెంతకాలము నిర్బంధింతువో నిర్బంధింపుము. పుష్పకోమలగాత్రి నగు నన్నెంతకాలము బాధింతువో బాధింపుము. నా పురాకృతకర్మ మిట్టిదికదా యని తలంచుచు నీవొనర్చుబాధల ననుభవింతును. కానిమ్ము. యువతీజనమును బలాత్కరించి తెచ్చి నిర్బంధించెడు నీ రాక్షసకృత్య మీనాఁటికి క్షత్రియవంశసంభవుఁడు, అందులోఁ జాళుక్యవంశసంభవుఁ డొనర్చెనని విని తోడిరాజు లందఱానందింతురుగాక! త్రేతాయుగమునందువలె నీ కలియుగమందును స్త్రీజనకంటకుఁ డొకఁ డున్నాఁడన్నప్రఖ్యాతి నీవలనఁ గల్గుఁగాక!' అని పల్కుచుండ—

భీ—ఆఁ, ఏమేమీ! నేను స్త్రీజనకంటకుఁడనా?

ఇచ్ఛి—స్త్రీలను బాధించువారు మఱెవ్వరు?

భీ—నే నిన్ను బాధించుచున్నానా?

ఇచ్ఛి—కాక, నాకు సుఖమే కల్గించుచున్నావా?

భీ—సందేహమేమి? విహరించుటకు దివ్యసౌధములు, శయనించుటకు మృదుతల్పములు, కట్టుటకు దివ్యవస్త్రములు, తినుటకు మృష్టాన్నములు; ఇవి యన్నియు సుఖకరములా? దుఃఖకరములా?

ఇచ్ఛి—మనస్సు స్వస్థముగా లేనప్పుడు దుఃఖకరములే! సుఖమునకు మనస్సే కారణము కాని తక్కిన దివ్యసౌధాదులు కావు.

భీ—నీవు మనస్సు నేల పదిలపఱచుకొనరాదు?

ఇచ్ఛి—ఇచ్చట నుండ నది నాకసాధ్యము.

భీ—మఱి యెట నున్న సాధ్యమగును?

ఇచ్ఛి—మాతండ్రిగారిగృహమున.

భీ—నిన్ను విడిచి యుండలేను.

ఇచ్ఛి—స్వసంతుష్టికై యితరులను బాధించుట న్యాయమా?

భీ—బాధింపవలె నన్నతలంపు నాకు లేదు. నేను బాధింపను లేదు. దాని కేమి! అది యట్లుండనిమ్ము, నీయస్త్ర విద్యావిశేషమును మఱియొకపరి ప్రదర్శించి నా కానందముం గూర్పుము.

ఇచ్ఛి—నీ వానందింపకపోయిన నా కేమి?

భీ—నీ వట్లు చేయుదాఁక నే నిచ్చటనుండి కదలను. ఏమి చేయుదువో చూచెదనుగాక!

ఇచ్ఛిని కొంచె మూరకుండి యతనియభిలాషము దీర్ప నిచో నతఁ డక్కడనుండి కదలఁ డని తలంచి యెట్లో యా పిశాచమును వదలించుకొనుటయే మేలని యతనిఁ జూచి 'రాజా! అస్త్రవిద్య పురుషులది. పురుషులుచేయుపను లొనర్చునపుడు పురుష వేష మే యుండవలెను. నా కట్టిదుస్తులు తెప్పింపుము' అని పలికెను.

భీ—యువతీ! నీ విట్లు యువతివై యుండి విల్లెక్క వెట్టినపుడే నాకు మిగుల దర్శనీయవుగా నుందువు.

ఇచ్ఛి—అగుఁగాక! నే నీ వేషముతో వింటిని దాల్పను.

భీ—పోనిమ్మ, నీ 'వన్నట్లే కాని' మ్మని పల్కి యొకభటునిచే దుస్తులు తెప్పించి యామె కిచ్చెను. ఆయిచ్ఛిని యావస్త్రములను గ్రహించి లోనికరిగి ధరించి యీవలికి వచ్చెను. మీసములురాని రాకుమారునివలె నున్నయిచ్ఛినిని జూచి రా జాశ్చర్యముచెంది 'యువతీ! నీవు పురుష వేషముఁ దాల్చినను నీరూపము నాకు మోహజనక మే యగుచున్నది. అచ్చముగా రాకుమారునివలె నున్నావు. లెమ్మ, వింటి నెక్కిడుము' అని పలికెను.

అనంతర మిచ్ఛిని వింటి నెక్కిడి బాణము సంధించి యతఁడు చూపినలక్ష్యములను సరిగాఁ గొట్టెను. భీముఁ డామె నేర్పునకు సంతోషించి తనలో 'ఈమె యింతేనియుఁ దప్పకుండ లక్ష్యమును భేదించుచున్నది. ఒకప్పుడు నా కేమయి

నను బ్రమాదము సంభవించునేమో ? మఱియుఁ బురుష వేష
ముతో నీమె వింటెనిదాల్చినప్పుడు నాకు సంతోషమే కాక
భయముఁగూడ నంకురించినది. ఈమె సామాన్యురాలు కాదు.
ఈమె కోరిన ట్లాయుధములు చేతి కిచ్చి నేను జెంతనున్నచో
సింగపుఁగొదమవలె నాపైకిలంఘించి ప్రమాదముఁ గల్గింపక
మానదు. కావున, నే నిఁక జాగరూకుఁడనై వర్తింపవలెను.
అంతఃపురమున నున్నయీయువతి చెంతకు వచ్చినప్పుడు యుద్ధ
మునకుఁ బోవునట్లు సకలాయుధములను దాల్చి వచ్చుటయే
'మే' లని తలంచుకొనుచు నచ్చోటు గదలిపోయెను.

## ఇరువదియాఱవ ప్రకరణము

## ప్రతీకారము

తామరకొలఁకునడుమ నెఱ్ఱతామరపూవువలె సూర్యుఁ
డాకాశమధ్యమున వెలుఁగుచు క్షమ యనుపేరు వహిం
చిన భూదేవియోర్పును బరీక్షించుటకో యన మిడుఁగురుల
వంటికిరణములు లోకముపైఁ బఱపుచుండెను. ఆవేఁడిమిచే
మిగుల సంతప్తురాలయి భూదేవి విడుచుచున్ననిట్టూర్పులో
యనునట్లు వెచ్చనిగాడ్పులు వీచుచుండెను. ఆతీవ్రతకుఁ
దాళలేక ప్రాణికోటి చెట్లనీడలను, పొదరిండ్లలోను, గృహాం
తర్భాగములందును, జలాశయములలోను, భూవివరముల
లోను విశ్రమింపఁజొచ్చెను.

అట్టిసమయమున నొకపురుషుఁ డెచ్చటనుండియో మధుమంతమునకు వచ్చుచుండెను. పండుతమలపాకువంటి యతనిశరీర మెండ వేఁడిమికి మిగులఁ గందిపోయి యుండెను. అతనిముఖము మిక్కిలి కాంతిదక్కి యుండెను. వర్షానంతరమునఁ గొండశిఖరమునుండి ప్రవహించుసెలయేళ్ళవలెఁ జెమ్మటలతనిశిరోభాగమునుండి కాలువలుగట్టి పాఱుచుఁ గట్టువస్త్రములను బూర్తిగాఁ దడిపివైచెను. అతఁడు దీర్ఘ ప్రయాణముచేసినట్లు మిక్కిలి బడలియుండెను. అతఁ డేదో యత్యావశ్యక మగుపనిని నిర్వహింపఁ బోవుచున్నాఁడని నిశ్చయింపఁగలము. లేనిచో నట్టిభయంకరసమయమునఁ బ్రయాణము చేయునా ? అతఁడు దుర్గద్వారమును సమీపించి పెద్ద గొంతుతో 'అయ్యా ! రక్షకభటులారా ! తలుపుఁ దీయుఁడు. నేను ప్రభువుగారిని దర్శింపవలెను. ఒక యాపద్వార్త మోసి కొనివచ్చితిని. దానిని రాజుగారికిఁ దెలుపవలెను. మీ రెంత మాత్ర మాలస్యము చేయరాదు. చేసితి రేని మీకును, నాకును గూడ మాటవచ్చును' అని కేక వేసెను.

రక్షకభటు లది విని యేదో యాపద సంభవించియుండునని నిశ్చయించి తొందరపడి రాకపోకల కనుకూలముగా దుర్గకవాటమున కమర్పఁబడిన చిన్నతలుపును దెఱచి యతనితో నిట్లు సంభాషించిరి.

భ—అయ్యా ! నీ వెవ్వఁడవు ?

పు—నే నొక సందేశహారుఁడను.

భ—ఎక్కడనుండి వచ్చితివి ?

పు—అన్హిలపురమునుండి.

భ—నిన్నెవరు పంపిరి ?

పు—మధుమంతుఁడు.

భ—(ఆశ్చర్యముతో) మధుమంతుఁడా !

పు—అవును, మధుమంతుఁడు.

భ—అతఁడు పరమారుని కారాగృహమున నున్నాఁడని వినియున్నానే !

పు—అది నిశ్చయమే ! కాని, మాయోపాయముచేఁ దప్పించుకొనెను.

భ—అట్లయిన నతఁ డిచ్చటికి రాక యన్హిలపురమున కేల పోయెను ?

పు—(విసివికొనుచు) మీకు సమాధానము చెప్పినప్పటికి నాకు నోరు నొచ్చుచున్నది. అదంతయు మీ కేల ? నన్ను రాజసన్నిధికిఁ బోనిండు.

భ—ప్రభువుగారి సెల వైనఁ గాని నిన్ను లోనికి విడువ వలనుపడదు.

పు—అట్లయినఁ ద్వరగాఁ బోయి విన్నవింపుఁడు.

ఆభటులలో నొకఁడు వేగముగా రాజును సమీపించి 'మహాప్రభూ ! అన్హిలపురమునుండి యొకభటుఁడు వచ్చినాఁడు. మధుమంతుఁ డేదో యుత్తరమిచ్చి పంపె నఁట.

తమదర్శనము చేయఁగోరుచున్నాఁడు. ఏదో యాపద్వార్తను దెచ్చె నఁట!' అని మనవిచేసెను.

ఇచ్చినీకుమారిని వశముగావించుకొనుట కుపాయము లనుగూర్చి రూపవతితో సంభాషించుచున్నభీమరా జామాట విని యదరిపడి 'ఆఁ, ఏమీ! మధుమంతుఁడు పంపెనా! అతఁడు శత్రువులకారాగారమును దప్పించుకొని వచ్చెనా! అట్లయిన నది సంతోషవార్తయే కాని యాపద్వార్త యెట్లగును? అతనివృత్తాంతము తప్పక యరయవలయును. రూపవతీ! అతని విడిపింపవలయు నని నీవు నన్నెన్నోమాఱులు ప్రార్థించియున్నావు. మనము ప్రయాసపడకుండ నతఁడే తప్పించుకొనివచ్చెను. లెమ్ము; ఇట్టి బుద్ధిమంతుఁడు, ఇట్టి మాయావిశారదుఁడు శత్రువుల కెట్లు చిక్కిపోయినాఁడో యని నా కాశ్చర్య మగుచున్నది' అని పల్కి భటునితో సందేశహారుని లోనికిఁ బంపు మని యాజ్ఞాపింప వాఁడు వెడలిపోయెను.

రూపవతి మహారాజును జూచి 'ఓ మహాప్రభూ! ఈవార్త విన్నప్పటినుండియు నాగుండె దడదడ కొట్టుకొను చున్నది. మునుపటికంటెను నాకు భయము హెచ్చుచున్నది. అతని కెట్టియాపద సంభవించెనో యని నామనస్సు మిగులఁ బరితపించుచున్నది. ఏలినవారు చెప్పినపని సులభముగా నిరపాయముగా నెఱవేర్చుకొనివచ్చితి మని యానందించుచుండ భగవంతుఁడు మా కెట్టి యాపదను దెచ్చి

పెట్టెనో చూడుఁడు. ఎట్టి చెడువార్త వినవలసివచ్చునో యని యడలుచున్నాను' అని స్త్రీజనమునకు స్వభావసిద్ధ మగు కన్నీటిధారలు కపోలములందుఁ గాలువలుగట్ట నేడ్చుచుఁ బలికెను.

భీమరా జామాటలు విని జాలిపడి యేవో మాటలు చెప్పి యోదార్చుచుండ నాసందేశహరుఁడు వచ్చి రాజునకు నమస్కరించి నిలిచెను. రాజును, రూపవతియును నతని వికృతాకారమును జూచి గొప్పయాపద యేదో తటస్థించి యుండు నని యడలుచు సందేశహరునితో 'ఓరీ! నీ వెక్కడ నుండి వచ్చితివి? అన్హిలపురమునుండియా? మధుమంతుఁడు పంపెనా? అతఁడు కుశలియే కదా!' అని యాత్రముతో నడిగిరి. అతఁ డది విని 'మహారాజా! నన్ను మధుమంతుఁడు పంపియున్నాఁడు. అతఁడు కొనప్రాణముతో నున్నాఁడు. ఇదిగో! నీయుత్తరము నంతయు వ్రాయించియున్నాఁడు. అతనిభార్య రూపవతి యిచ్చట నున్నదఁట! అవసానకాలమున వచ్చి కంటఁబడి తృప్తినొందింపు మని యామెతోఁ జెప్పుమని యతఁడు నన్ను మఱిమఱి ప్రార్థించెను. ఇంతకంటె నా కేమియును జెప్పలే' దని పల్కి యుత్తర మిచ్చెను. ఆ మాట విన్నతోడనే కెవ్వునఁ గేకవేసి యేడ్చుచున్న రూపవతి నూఱడించి యాయుత్తరమును విచ్చి రా జిట్లు చదువఁ దొడఁగెను.

మహారాజా!

దేవరవారి పూర్ణానుగ్రహమునకుఁ బాత్రులగు సేవకులలో నొకఁడనైనను నందులకుఁ దగినఘనకార్య మాచరించి ప్రభుభక్తిని వెల్లడింపలేకపోయినందులకు విచారించుచున్నాను. ఇచ్చినీకుమారిని సాధించుటలో నే నమరసింహు నంతపని చేయకపోయినను గొంత చేయకపోలేదు. అయిన నేమి యందులకుఁ బదింతలు పెద్దనేరము చేసితిని. అమరసింహుఁడు తమ కిమ్మని నాచేఁ బంపినయుత్తరము శత్రువులపాలఁ బడవైచితిని. ఈ నా యపరాధమును సహింపుఁడు. మహాప్రభూ! పరిస్తుతాంశమును జిత్తగింపుఁడు. ఈ సందేశహారుఁడు నాకుఁ బ్రియమిత్రుఁడు. ఇతనిసాయమున నే శత్రువులకారాగారమునుండి తప్పించుకొంటిని. అయినను దుస్సహరోగపీడితుఁడ నగుటచే నడచుటకు శక్తిలేక పలుపాట్లుపడి యెట్లో యీపురమును జేరుకొంటిని. నేను మొదట మధుమంతమునకే రాఁదలంచితిని. కాని, యాబూసైన్యము మార్గమధ్యమున నుండుటచే మరల నెట్టియిక్కట్లు మూడునో యని భయపడి యట్లు చేయలేదు. కడకాలమునఁ దమ దర్శనభాగ్యము లభింపనందులకు విచారించుచున్నాను. నే నీరోగమునుండి విముక్తుఁడ నగుదునన్న నమ్మకము నాకు లేదు. మిమ్ము నీ కన్నులతో మరలఁ జూతునన్న నమ్మకము లేదు. ఇవియే నా కడపటి నమస్కారములు. వెంటనే నా ప్రియురాలగు రూపవతి నంపుఁడు. మరణకాలమున నామెను

జూచినచో నాకుఁ గొంతమనశ్శాంతి కలుగును. మఱియొక మనవి. ఈపురుషుఁడు జైత్రపరమారునిశత్రువు. ఇతనికి విశ్వాసార్హుఁ డయినయొకవీరుని సాయముగాఁ బంపుదురేని పరమారుని బంధించి తెచ్చెదనని చెప్పుచున్నాఁడు. ఆరాజును గూడఁ జెఱ నుంచినచోఁ దండ్రిదుఃఖము నరయలేక యిచ్ఛిని మిమ్ము వరించుట కంగీకరించును. ఈరూపవతి యాబూరాజునకు మహోపకారము చేసినది. అది వారిబారిఁ బడకుండ నొకవీరుని సాయమిచ్చి పంప వేఁడెదను. ఆ వీరుఁడే యితనితోఁ గలసి పోయి పరమారుని సాధించి తెచ్చును.

ఇట్లు విన్నవించుపాదసేవకుఁడు,
మధుమంతుఁడు.

భీమశా జిట్లు చదివి 'ఓయీ, మధుమంతా! నీప్రభుభక్తికి మిగుల నానందించితిని. చావ సిద్ధముగా నుండియు నా సౌఖ్యమున కుపాయముల నరయుచునే యున్నావు' అని ప్రశంసించి కంటికి మంటికి నేకధారగా నేడ్చుచున్న రూపవతి నోదార్చి 'యువతీ! విచారింపకుము. మధుమంతుఁడు దైవానుగ్రహమువలన రోగవిముక్తుఁ డగును. నీవుపోయి మందిప్పించి యుపచారములు చేయుదువేని నతఁ డవలీలగ నే యారోగ్యవంతుఁ డగును. విచారింపక యీరాత్రియే నీవు బయలుదేఱి యన్హిలపురమునకుఁ బొమ్ము. మధుమంతుఁడు చెప్పిన యాలోచనము నాకు నచ్చినది. పరమారుని బంధించి తెచ్చి

బాధించినచోఁ బితృభక్తిగల యీరాజకుమారి తండ్రిబాధలను దప్పింప నన్ను వరించిన వరింపవచ్చును. నీ వింటికిఁ బోయి ప్రయాణమునకు సన్నద్ధవుకమ్ము’ అని చెప్పి రూపవతిని బంపివేసెను. అనంతరమున భీమదేవుఁడు భూయాదుఁడను నొకరాజకుమారుని బిలిచి యన్హిలపురమునకుఁ బోయి మధుమంతుఁడు చెప్పినట్లు చేసి కార్యము సాధించుకొనిరమ్ము. ఈసందేశహరుఁడును నీవును గలసి రూపవతిని నిరపాయముగా నన్హిలపురమునకుఁ జేర్పుఁ’ డని యాజ్ఞాపింపఁగా నాతఁడు సందేశహరుని సమీపించి కొంతసేపు సంభాషించి యింటికిఁ బోయెను. సందేశహరుఁ డచ్చటనే విశ్రమించి యుండెను.

## ఇరువదియేడవ ప్రకరణము

### మోసము

సూర్యుఁ డప్పుడే తూర్పుకొండశిఖరమునఁ జూపట్టెను. అతని కిరణములు ముందుగా నున్నతప్రదేశములందుఁ గుంకుమపూఁత పూయుచుండెను. జ్ఞానులు సంసారముక్తులై స్వస్వరూపము నొందినట్లు ప్రజలు నిద్రాముక్తులై చైతన్యమును వహించి నిజకార్యాసక్తులయి పోవుచుండిరి. ఇట్టిసమయమున మధుమంతమున కొకతట్టుననున్న కొండపైకి జనులొక్కరొకరే పోవుచుండిరి. ఏదో యపాయము సంభవించి

నట్లు వారందఱును మిగుల రభసముతోనే పోవుచుండిరి. వారిలోఁ గొందఱకుఁ దత్కారణ మేమియో తెలియక పోయినను ముందు పోవువారి ననుసరించుచుండిరి. పదిబారల దూరము పోఁగా నక్కడ పెద్దచెట్టొకటి యుండెను. ప్రజలు దానిచుట్టును మూఁగి యుండిరి. ఒకరి నొకరు త్రోసికొని చెట్టువంకఁ జూచుచుండిరి. క్షణకాలములోనే యాప్రదేశము ప్రజలచే నిండిపోయెను. భీమరాజు దుర్గమంతయుఁ జుట్టి వచ్చుచు జను లంత ప్రోవై యుండుటకుఁ గారణ మేమై యుండునో యని యరయుచుండెను. ఒక యువతి యాచెట్టున కంటఁగట్టఁబడి యుండెను. అది యింకను బ్రతికియే యుండెను. త్రాళ్ళతోఁ జెట్టునకు బంధించుటచే దాని కాలు సేతు లాడలేదు. నోట గుడ్డలు క్రుక్కుటచే నది మాటాడ లేకుండెను. అది తనబాధ నంతను జూపులచేతనే ప్రజ లకుఁ దెలుపుచుండెను. ప్రజ లాలస్యముచేయక వెంటనే దానిబంధములు విప్పివైచిరి. బంధనములచే నవయవములు నలఁగిపోయి బాధించుటచే నాయువతి నిలువలేక భూమిపైఁ గూలఁబడెను. ఆయువతి యెవ్వరు? భీమదేవుని యనుగ్రహ మునకుఁ బాత్రురాలగు రూపవతి. మహారాజువలన విశేష గౌరవము నొందుచున్న రూపవతి కేమి, ఇట్టి దుర్దశ రానేమి యని యందఱును విచారింపఁజొచ్చిరి. కాని, యేమిచేయుదురు? దానిబాధను దొలఁగింపలేరుకదా! వెంటనే దానిని భుజములపై వైచికొని భీమదేవునెదుటఁ బెట్టిరి.

మిగుల నలఁగిపోయిన పూవుదండవలెఁ గాంతి దక్కి వికృతాకారముతో నున్నరూపవతిని జూచి యత్యాశ్చర్యము సూచించుచు భీమదేవుఁ డిట్లనియె. రూపవతీ! నీ కిట్టి యాపద గల్గించిన దురాత్ము లెవ్వరు? నిన్నిట్లు బాధించిన క్రూరు లెవ్వరు? పూలదండ కఱకుదర్భత్రాళ్ళచేవలె నీవంటి యోగ్యురాలిని, నీవంటి సుకుమారి నిట్లుబంధించిన కఠినహృదయు లెవ్వరు? అన్హిలపురమునకుఁ బోయెడు నీ వీచెట్టున కేల బంధింపఁబడితివి? సందేశహరుఁ డేమయ్యెను? నీకు రక్షకుఁడుగా వచ్చినభూయూదుఁ డేమయ్యెను? నీ విట్టి దురవస్థకుఁ జిక్కుచుండఁ జూచి యాకఠినాత్ముఁ డెట్లూరకుండెను? నీవృత్తాంత మేమియో చెప్పు మనఁగా నది పొంగి పొరలి వచ్చుచున్నదుఃఖమును గొంచెము తగ్గించుకొని చెక్కిళ్ళయందుఁ గాలువలుగట్టుచున్న కన్నీటిని దుడుచుకొని చెదరిన కేశపాశమును మెల్లన ముడివేసికొనుచు హీనస్వరమున నిట్లు చెప్పెను.

'ఓ మహారాజా! నాదురవస్థ నేమని చెప్పుకొందును? ఇట్టి కష్టము లనుభవింప భగవంతుఁడు నానుదుట వ్రాయు నది యేల తప్పును? నిన్న దమయొద్ద సెలవుదీసికొని వస్తువు లన్నియు సవరించుకొని భుజించి మనవారందఱతోను జెప్పి జాము రాత్రి యగునప్పటికి సందేశహరుఁ డున్నచోటికిఁ బోయితిని. వాఁ డెవ్వరితోనో భాషించుచుండెను. చీకటిలో రెండవవాఁ డెవ్వఁడో నేను బోల్పలేదు. కాని, యతఁడు

భూయాదుఁ డని యనుకొంటిని. నేను వారిని బ్రయాణము నకుఁ ద్వరచేసితిని. వారును బయలుదేఱిరి. దుర్గద్వారమును సమీపించితిమి. ఇంతలో నన్నిలపురమునకుఁ గొనిపోవలసిన వస్తు వింట మఱచుటచేఁ దెచ్చికొందునని చెప్పి నేను వెను కకుఁ బోయితిని. నేను మరలివచ్చులోపల వారు దుర్గద్వార మును దాఁటి యచ్చట నిలువఁబడిరి. తమయాజ్ఞయగుటచే ద్వారపాలురు వారి నడ్డలేదు. నేను ద్వారమును సమీపించి సందేశహరుఁ డేఁడి యని రక్షకభటుల నడిగితిని. వారు ద్వారమానల నీనిమిత్త మెదురుచూచుచున్నా రని చెప్పిరి. అది విని నేను ద్వారము దాఁటగానే సందేశహరుఁడు నన్నుఁ జూచి 'అమ్మా! రా, రా; నీ నిమిత్తమే యెదురుచూచు చున్నా' మని చెప్పెను. నేను నామాటను సందేశహరుని కిచ్చి నడవఁజొచ్చితిని. చీకటి దట్టముగా వ్యాపించి యుండెను. అయినను జుక్కలవెలుతురుచే దారి కొంచెము గానవచ్చుచుండెను. సందేశహరుఁడు ముందు దారి చూపుచు నడచుచుండెను. తరువాత నేను నడచుచుంటిని. నావెనుక భూయాదుఁడును నడచుచుండెను. మేము పది బారలదూర మేగునప్పటి కొక పురుషుఁడు మాకుఁ దార సిల్లెను. అతఁ డెవఁడని నేను సందేశహరు నడిగితిని. అన్నిల పురమునకుఁ బోవు నొక బాటసారి యని యతఁడు బదు లిచ్చెను. రాత్రిసమయమున మఱియొకఁడు తోడుగా నుండిన నిరపాయముగాఁ బోవచ్చునని తలఁచి సంతసించి వారిని

వెంబడించి పోవుచుంటిని. వారు దారి తప్పించి యీకొండ మీఁదికి నన్ను గొనిపోవసాగిరి. ఈకొండమీఁదికేఁ గొనిపోవుచున్నారే మని వారి నడిగితిని. ఇది యన్నిలపురమునకు దగ్గఱ త్రోవ యని వారు పల్కిరి. సత్యమే యనుకొని వారిననుసరించి మఱికొంతదూరము నడచితిని. ఇంతలో నీచెట్టును సమీపించితిమి. అపుడు నావెనుక నడచుచున్నవాఁడు నన్ను గట్టిగా నొకదెబ్బకొట్టెను. నేను మొఱ్ఱో మొఱ్ఱో యని యేడ్వనారంభించితిని. భూయాదుని బిలిచితిని. కాని, భూయాదుఁడు మాటాడలేదు. మరల నే నతని గట్టిగాఁ బిల్చుచున్నసమయమున నాసందేశహరుఁడు నన్నుఁ బడద్రోసి నోట గుడ్డలు క్రుక్కెను. వారు ముగ్వురును నన్ను గట్టిగాఁ దన్ని చెట్టునకు బంధించి నిర్దయులై పోయిరి. భూయాదుఁడు నన్నుఁ గాచునేమో యని యనుకొంటిని. కాని, యతఁ డేమియు నాకుఁ దోడుపడలేదు. ఆసందేశహరుఁ డెవఁడో పెద్ద మోసగానివలె నున్నాఁడు. మహాప్రభూ! భూయాదుఁ డేమయినాఁడో నాకుఁ దెలియదు. నాతో నడచిన రెండవ వాఁడు భూయాదుఁడు కాఁడేమో యని నా కిప్పుడు తట్టుచున్నది. అతఁడే యైనచో నా కట్టి యాపద సంభవించి యుండఁ జూచి యూరకుండునా? ప్రాణముపోయినను నతఁడు మనయెడ విరుద్ధముగా నడచువాఁడు కాఁడు. నావెనుక వచ్చినవాఁడు భూయాదుఁడు కానిచో వేఱొకఁ డెవఁడై యుండును? మనదుర్గము ప్రవేశింప వాని కెట్లు వీలైనది?

యను సందేహము బాధించుచున్నది. ఇదంతయు నా కింద్రజాలమువలెనున్నది. ఆలోచింపఁ బరమారుభటులు మారు వేషముతో వచ్చి మనలను మోసపుచ్చినారు. ఇచ్ఛినీకుమారిని మేము మోసపుచ్చి తెచ్చినట్లు వారును మనల మోసపుచ్చి నన్నుఁ గొనిపోయినారు. మన మిచ్ఛినిని బువ్వులలోఁ బెట్టి పూజించుచున్నాము. వారు నన్ను జెట్టునకు విఱిచికట్టి పూజించినారు. మనకును వారికిని గలవ్యత్యాస మిది' అని యామె చెప్పి యూరకుండెను. భీముఁ డిది యంతయు విని చిత్రరువుబొమ్మవలె నిశ్చేష్టితుఁ డయ్యెను. సందేశహారుఁడు శత్రువని నిశ్చయించుకొనెను. కాని, భూయాదుఁ డేమయినాఁడో యతనికి బోధపడలేదు. అతఁడు ద్వారపాలకులను బిలిపించి యిట్లు ప్రశ్నించెను.

భీ—నిన్నరాత్రి మనపురమునుండి యొందఱు వెళ్ళినారు ?

భ—ముగ్గురు. కాదు కాదు. నల్వురు.

భీ—వా రెవ్వరో యెఱుఁగుదువా ?

భ—సందేశహారుఁడు, రూపవతి, భూయాదుఁడు, నాల్గవవాఁ డతని యనుచరుఁడు.

భీ—ఆవీరుఁడు భూయాదుఁడేనా ?

భ—యోధవేషముతో నున్న యాపురుషుఁడు భూయాదుఁడే యని తలంచితిని.

భీ—నిన్న సందేశహారుఁడు గాక మఱియెవ్వరైన మనదుర్గములోనికి వచ్చిరా ?

భ—లేదు, మహాప్రభూ !

భీ—నిజము చెప్పుఁడు. లేనిచో మీతలల నఱికించెదను.

భ—మహారాజా ! నిన్న సందేశహారుఁడు తప్ప మఱెవ్వరును రాలేదు. తమసెలవు లేనిదే మే మెవ్వరిని విడువలేదు. లోనికి రానీయలేదు. నిన్నరాత్రి నాల్గవవానిని లోనికిఁ బోనీయ మని మే మెంతో నిర్బంధించితిమి. కాని, సందేశహారుఁడు 'భూయాదుననుచరుని విడువకపోయిన నెట్లు ? మీప్రభువుగారిందుల కంగీకరించినా' రని చెప్ప నూరకుంటిమి. ఆపురుషులు ముగ్వురును ముందుగాఁ బోయిరి. తరువాత రూపవతి వచ్చి ద్వారము దాఁటిపోయినది. అంతకుఁ దప్ప మాం కేమియును దెలియదు.

భీ—యువతీ ! నాల్గవవాఁడు వచ్చినట్లు నీ వెఱుఁగుదువా ?

రూ—మహారాజా ! నాకుఁ దెలియదు. నాతో రాలేదు. వచ్చుచున్నాఁడని కూడ నెఱుఁగను.

భీ—నీవు పోల్చుకోలేకపోతివి. కాని, మార్గమధ్యమున మిమ్ముఁగలసికొనెనని చెప్పితివే ? ఆతఁడు భూయాదుని ననుచరుఁడే కావచ్చును !

రూ—వా రిరువురును సత్యముగా భూయాదుఁడు, నతనియనుచరుఁడును నైనచో నన్ను శత్రువులనుండి రక్షిం

చుటకు మాఱుగా మున్ముందుగా వారే నన్ను దన్నుటకు యత్నింతురా ?

భీ—అట్లయిన నీయభిప్రాయ మేమి ?

రూ—ఏమియును లేదు. సందేశహారునితోపాటు మఱి యిర్వురు శత్రువు లెట్లో మనదుర్గమును బ్రవేశించియున్నారు. వారే సందేశహారునితోఁగూడి నా కిట్టిబాధ కల్గించియుందు రని.

భీ—రూపవతీ! నీవు చెప్పునది యెట్లును సరిపోకున్నది. నాయాజ్ఞ లేకుండ నితరులు మనదుర్గమును జొచ్చుట యసాధ్యము. సందేశహారుఁడుమాత్రమే శత్రువు. తక్కిన వారు మనవారే కావచ్చును. మఱియు వారందఱు శత్రువులే యనుకొందము. అట్లయిన నాయాజ్ఞను బొంది నీతో వచ్చుటకుసిద్ధమయిన భూయాదుఁ డేమయియుండును? అతఁడు పయనమై రాకముందే శత్రువులు నిన్ను మోసపుచ్చి తీసికొనిపోయినా రనుకొన్నను భూయాదుఁడు నీవు కనఁబడక పోవుటచే నాచెంతకు వచ్చి నిజస్థితి చెప్పకుండునా ? కావున, భూయాదుఁడు లోలోపల శత్రువులవలన లంచముఁ గొని వారిలో నైక్యమైయుండుట నిజము.

అని పల్కి భీమదేవుఁ డంతతో నూరకుండక ఒక భటుని బిలిచి భూయాదునింటికిఁ బోయి యతనివృత్తాంతము తెలిసికొనిర మ్మని చెప్పఁగా వాఁడు పోయి వచ్చి 'మహారాజా ! భూయాదుఁడు పయనమై రాత్రియే యిల్లు విడిచి

యన్హిలవురమునకుఁ బోయిన ట్లింటివారు చెప్పి' రని మనవి చేసెను.

భీమదేవుఁ డది విని 'భూయాదుఁడు శత్రువులలోఁ జేరి యున్నాఁ' డని నిశ్చయించి వారినందఱను బంపివేసి రూపవతినిజూచి 'సుందరీ! నీకుఁ బెద్దకష్టము సంప్రాప్తమైన' దని పల్కెను.

రూ—మహారాజా! ఇచ్ఛినిని మోసపుచ్చికొనివచ్చి నందుల కిది ప్రతిఫలము. ఫలమును దెచ్చి నోటిముందుంచి నను దేవరవా రనుభవింపలేకున్నారు. ఇచ్ఛినిని దీసికొని వచ్చుటవలనఁ గష్టము తప్ప మఱేమియును ఫలము లేక పోయెను.

భీ—మఱి న న్నేమిచేయుమందువు?

రూ—రాజేంద్రా! నీ వామెను బాధింపవలెను. లేనిచో నామె నీకు లొంగదు.

అది విని భీమదేవుఁడు కొంచెము యోజించెను. రూపవతి చెప్పినయుపాయమే యుచితముగా నున్నదని నిశ్చయించెను. అతఁడు రూపవతి నింటికిఁ బుచ్చి వెంటనే లేచి యాయుధమును దాల్చి యిచ్ఛినీకుమారిభవనమువంక నడవ సాగెను. అట్లు పోవునపుడు భీమదేవుఁడు 'నాఁ డెంతటి ఘోరకృత్య మొనరించియైనను నారాజకుమారిని వశపఱచు కొనితీఱవలె' నని నిశ్చయించుకొనెను. అతఁడు సరభసగమనముతో నొకనిముసములో నిచ్ఛినిభవనమును జేరెను. కాని,

యచ్చట నెవ్వరును లేరు. భీమరాజు వకుళను బిల్చెను. కాని, యామెకూడ నక్కడ నున్నట్లు తోఁపలేదు. వారిరువురును గలసి కైలాసశిఖరమునకుఁ బోయియుందు రని యా సౌధమునకుఁ బోయెను. వా రచ్చటను గానఁబడలేదు. అతఁడు మగిడి వెనుకటిభవనమునకు వచ్చెను. కాని, వారి జాడ లేమియుఁ గానరాలేదు. అతనిహృదయమున నాశ్చర్యతరంగము లెగయనారంభించెను. అతఁడు నిశ్చేష్టితుఁడై 'వీ రేమయి యుందురు ? ఎచ్చటికిఁ బోయియుందురు ? వకుళ కూడఁ గానరా దేమి ? నేను వచ్చుచున్నట్లు విని వీ రీమందిరములలో నెచ్చటనైన దాఁగియుండవచ్చు' నని యాలోచించి యొక్కొక్కమందిరమే వెదకనారంభించెను. అతఁడట్లు వెదకుచుండఁగా నొకగదిలోనుండి యెవ్వరో పిల్చుచున్నట్లు వినఁబడెను. తోడనే యారాజు శబ్దముననుసరించి యామందిరమునొద్దకుఁ బోయెను. కాని, యాయింటితలుపులు బంధించియుండెను. ఇంతలో మరల లోపలనుండి ధ్వని వినవచ్చినందున నెవ్వరో యున్నా రని నిశ్చయించి పైని బంధింపఁబడినబీగమును దీసి తలుపులు తెఱచెను. వెంటనే లోపలనుండి యొకపురుషుఁడు వచ్చెను. అతనిఁ జూడఁగా రాజున కాశ్చర్యము తలమునుక లయ్యెను. ఇంతలో నాపురుషుఁడు భయమున గడగడవడఁకుచు రాజుకాళ్ళపైఁ బడెను. రా జతనిఁ జూచి 'భూయాదా! లెమ్ము, నీ విచ్చట కేల వచ్చితివి ? ఇది యంతయు నింద్రజాలమువలెఁ గన్పట్టు

చున్నది. ఇట నిచ్చినీకుమారియు, వకుళయుఁ గనఁబడ రేమి? నీవృత్తాంతము స్పష్టముగాఁ జెప్పు' మని పల్క నాతఁడు చేతులుజోడించి యిట్లు చెప్పనారంభించెను.

'ఓ మహాప్రభూ! నేను నిన్న దమయాజ్ఞను దాల్చి యన్నిలపురమునకుఁ బోనఁ బయనమై సందేశహరుఁ డున్న తావునకుఁ బోయితిని. సందేశహరుఁడును భుజించి కూర్చుండి యుండెను. రూపవతి యింకను నచ్చటకు రాలేదు. రాత్రి భుజించి సందేశహరుఁడున్న తావునకు వచ్చెద' నని రూపవతి నిన్నసాయంసమయముననే చెప్పుటచే నామెయింటికి నేను వెళ్ళలేదు. ఆదూతయును, నేనును మాటాడుకొనుచుంటిమి. ఇంతలో వకుళ యచ్చటకు వచ్చి 'రాజకుమారా! మీ రన్నిలపురమునకుఁ బోవుదు రని తెలిసినది. అక్కడ మా సోదరుఁ డున్నాఁడు. అతని కొకవస్తువును బంపవలసియున్నది. మీరు నాయందు దయయుంచి యీవస్తువు నతనికిఁ జేర్పఁ బ్రార్థించుచున్నాను. నాకు మీ రీయుపకార మొనర్తు రేని మీ మే లెన్నఁడును మఱవను. అవి పెద్దబరువుగలవస్తువులు కావు. బంగారునగలు' అని మఱి మఱి ప్రార్థింప నే నందుల కంగీకరించితిని. ఈ చీకటిలోఁ గాదు. మీరు నామందిరము నకు దయచేయుదు రేని దీపపువెలుఁగున మీ కప్పగించెదను. అట్లయిన మీకును నాకును గూడఁ జిక్కుండ' దని చెప్పఁగా నేను గొంచెము యోజించి యం దేమితప్పున్నది, అని నిశ్చ యించి సందేశహరునితోఁ జెప్పి యామెవెంట నీమందిరము

నకు వచ్చితిని. నేను వచ్చునప్పటి కీగదిలో దీపము వెలుఁగు చుండెను. ఆవదుళ నన్నుఁ జూచి 'అయ్యా! ఈయాసనమునఁ గూర్చుండుఁడు. మారాజకుమారియొద్దనున్న వస్తువులు గొని వచ్చెద' నని వెడలిపోయెను. నే నాదీపపువెలుఁగున నిందున్న చిత్రపటములను జూచుచుంటిని. ఇంతలోఁ దలుపు వేయఁ బడినట్లు చప్పుడయ్యెను. నే నాతలుపువంకఁ జూచితిని. తలుపు బంధింపఁబడెను. నేను దటాలున ద్వారమునొద్దకుఁ బోయి పిలిచితిని. బొబ్బలుపెట్టితిని. కాని, నాయత్నమంతయు వ్యర్థ మయ్యెను. నారోదన మరణ్యారోదన మయ్యెను. ఇంతకుఁ దప్ప నా కేమియుఁ దెలియదని మనవిచేసికొనెను. భీముఁడది విని వెనుకముందుసంగతు లాలోచింప నాసంగ దేశహరుఁడు శత్రువనియు, రాజకుమారి యతనిసాయమునఁ దప్పించుకొని పోయెననియుఁ బొడకట్టెను. వెంటనే భీమదేవుఁడు వీఁపు విఱిగి నేలఁగూలఁబడి వికృతస్వరముతో 'అయ్యో! ఇచ్ఛినీ కుమారి పోయినది. తప్పించుకొని పోయినది. ఆహా! ఇఁక నేమున్నది! నారాజ్యలక్ష్మిపోయినది. నామనోహారిణి పోయి నది. నా కిఁక నీజీవన మేల? ఈరాజ్య మేల? ఈధనసంపద లేల? ఈసైన్యము లేల? ఈదాసదాసీనివహ మేల! చీ! నా కీతుచ్ఛదేహ మేల?' అని పలికి వెంటనే కోపోద్దీపితుఁడై భూయాదునిఁ జూచి 'ఓయీ! ఇంకను నిల్చి చూచు టేల? లెమ్ము, పొమ్ము, రణభేరులను మ్రోయింపుమనుము, సైన్య ములఁ గదలింప సేనానాయకులతోఁ జెప్పుము, పొమ్ము,

పొమ్మని' అని యతనిఁ బంపివేసి చటాలున నచ్చోటు గదలి పోయెను.

## ఇరువదియొనిమిదవ ప్రకరణము

## యుద్ధము

చాళుక్యభీమునకు 'భోలాభీముఁ' డనుపేరు గలదని యిదివఱకు వ్రాసితిని. అనఁగా వెఱ్ఱిభీముఁ డని దాని యర్థము. ఇతరకాలములం దావెఱ్ఱితనము చూపట్టదు. కాని, కోపము వచ్చినపుడుమాత్ర మది యతనిచర్యలందుఁ బూర్తిగాఁ బ్రతిఫలించును. పృథ్వీరాజన్నను, బరమారుఁ డన్నను భీమదేవుఁడు మండిపడుచుండును. అందులో వారిరువురును దనపైకి దాడివెడలి వచ్చి తనరాజ్యపుటెల్లయందు విడిసియున్నారని విన్నపు డతని కెంతకోపముదయించునో చెప్పవలెనా? అయినను ఇచ్ఛినీకుమారిని స్వాధీనముగావించుకొనుయత్నములలో మునిఁగియుండుటచేత భీముఁ డెట్లో సహించియుండెను. ఇచ్ఛిని తన్ను మోసపుచ్చి తప్పించుకొనిపోయినట్లు గ్రహించినపు డదివఱకే యుదయించి హృదయమను తటాకమును నిండించియున్న కోపరస మొక్కుమాఱు విజృంభించెను. అప్పటి యతనిరూపమును, చర్యలను వర్ణింప నలవి కాదు. భూయాదునిచే నతఁ డట్లు వార్తపంపి వెంటనే యుద్ధపరికరములను దాల్చి భయంకరరూపములతో సేనానివేశము

నకుఁ బోయి నిల్చెను. అదివఱకే సన్నద్ధులైయున్న యుద్ధభటు లతనిఁజూచి జయజయనాదములుచేయుచు సమరోత్సాహమును సూచించిరి. భీముఁడు వారినిఁ జూచి చేయెత్తి పెద్దయెలుంగుతో 'ఓ వీరభటులారా! మీరాజునకు సహాయముచేయవలసినసమయ మింతకంటె మఱొకటి లేదు. అతిప్రయత్నముచేసి సంపాదించుకొన్న నారత్నము నపహరించి యీపరమారుఁడును, నీపృథ్వీరాజును నాప్రాణములను స్వస్థానములనుండి కదలించినారు. ఆరత్నము నాకు మరల లభించినఁ గాని ప్రాణములు గుదుటఁబడవు. మీరంద ఱేకీభవించి సముత్సాహముతోఁ బోయి యాశత్రువును జంపి యారత్నమును గొనివచ్చి మీప్రభువుప్రాణములు నిలుపుఁడు. రెండు సమరమున వెనుకంజ వేయకుఁడు. సాహసము వదలకుఁడు. ఖడ్గములను దాల్పుఁడు. శత్రువులశిరోనాళములం దున్న నెత్తుటిచే భూదేవికి బలియిండు. రెండు, రెండు' అని వెఱ్ఱికేకలు వేయ నారంభించెను. తోడనే రణభేరులు మ్రోయింపఁబడెను. తదీయధ్వనులు దశదిశలును నిండించెను. ఆధ్వనులతోఁగూడ సైనికులపాదఘాతములచే నెగసినధూళులు దిశాంతములవఱకును వ్యాపించెను. సముద్రము పొంగిపొరలి ప్రవహించునట్లు ఘూర్జరసైన్యములు దుర్గమును విడిచి ముందునకు నడచి పోవుచుండెను.

అది చూచి యదివఱకే కృతసన్నాహులైన యాబూసైనికులును, ఢిల్లీసైనికులును వ్యూహములు పన్నుకొని

ధైర్యముతో నిలిచి యుండిరి. అతివేగముతోఁ బ్రవహించు
నదీప్రవాహము తన కెదురుగానున్నవస్తువును దాఁకినట్లు
ఘూర్జరసైనికులు రిపుసైన్యముల నొక్కపెట్టునఁ దాఁకిరి.
ఆయాటోపమున కాఁగఁజాలక యాబూ ఢిల్లీసైన్యములు
వెనుకకొరగి యాశత్రుసైన్య ఘనప్రవాహమునఁబడి కొట్టు
కొనిపోవలసినదేకాని యవి యతిధైర్యముతోఁ బర్వతము
వలె నిలిచియుండుటచే ఘూర్జరులే ముందునకు మాఱుగా
వెనుకకుఁ బోవలసివచ్చెను. అయిన వారు వెంటనే సేనాధి
పతిప్రోత్సాహముచే మరల ముందున కరిగి యుద్ధమునకుఁ
దలపడిరి. ఆబూ ఢిల్లీసైన్యములుగూడ ధైర్యముతో వారి
నెదుర్కొని పోరాడసాగెను. ఇరుపక్షములవారును బలవంతు
లును, ధైర్యవంతులును, సాహసవంతులును నగుటచేఁ బోరు
మిగుల భయంకరముగాఁ బరిణమించెను. ఆదొమ్మియుద్ధమున
నాయుధము లొండొంటితోఁ దాఁకి యగ్నికణములను
రాల్చుచు మెఱుపులవలె మెఱయుచుండెను. వానిధ్వను లుఱు
ముల ననుకరించుచుండెను. ఇంతలోఁ జిమ్మనగొట్టములతోఁ
జిమ్మినట్లు యోధులశరీరములనుండి రక్తధారలు పైకెగసి
పాదఘాతములవలన నెగయుచున్నధూళుల నడఁగించు
చుండెను. వీరభటులశిరములు బంతులవలెఁ దూలుచుండెను.
అవయవములు తుత్తుమురై నేల రాలుచుండెను. చెవులు
చెవుడ్పడునట్లు సింహనాదములు ప్రబలుచుండెను. హృదయ
మున జాలిపుట్టునట్లు నేలఁ బడిపోయి ప్రాణములువిడుచు

వీరులహరినామస్మరణము లంతటను వ్యాపించుచుండెను. ఒక ఘడియలో యుద్ధభూమి పీనుఁగుపెంట లయ్యెను. యోధులు నలుగడలకుఁ జెదరిపోయిరి. రంగమున భటులు పలుచనై చూపట్టిరి.

ఇట్లు చెదరిపోయినబలములు రెండును మరలఁ గూడుకొని పోరుసమయమున నమరసింహుఁ డభయసింగున కగపడెను. అతఁ డగపడఁగానే యభయసింహుఁడు మిక్కిలి కుపితుఁడై 'ఓరీ! మాయావీ! అమరసింహా! నీవు నాకు వనమూలికావైద్యము నుపదేశించి గురువవైతివి. అందులకు గురుదక్షిణ యొసఁగవలెను. నీవంటి గొప్పవాని కల్పదక్షిణ చాలదు. పరపదమునకుఁ బట్టాభిషేకము గావించెదను. ఇచ్ఛినీకుమారిని నాకుఁ గూర్ప మిగులఁ బ్రయత్నించితివి. అందులకుఁ బ్రత్యుపకారముగా దేవతాకాంతను నీకు సమకూర్చెదను' అని పలికి కత్తిని గిరగిరఁ ద్రిప్పుచు లేడిపైకి లంఘించుపెద్దపులివలె నాతనిపైఁబడి పట్టుకొని శిరము ఖండించుటకు సిద్ధపడి యుండ దూరమునుండి భీమదేవుఁ డది చూచి యొకపర్వున వచ్చి యభయసింగు నెదుర్కొనెను. ఆరాజకుమారుఁడును వెనుదీయక యతనితో యుద్ధముచేయ నారంభించెను. ఇట్లిరువురును జిత్రగతులతోఁ గొంతవడి భీకరయుద్ధ మొనర్చిరి. ఇరుపక్షములవారును వారియుద్ధచాతుర్యమును బొగడఁజొచ్చిరి. కాని, కొంతవడి కభయసింగు భీమబలుఁడయిన భీమదేవునిపరాక్రమమునకుఁ దాళలేక

క్రమముగా క్షీణబలుఁడై వీరస్వర్గముచెందెను. అయినను నతనిసాహసమును, శౌర్యమును, ధైర్యమును బొగడనివా రిరుపక్షములందు నొక్కరును లేరు. భీముఁడుగూడఁ దనతో నంతసేపు కడుఁజాతుర్యముతోఁ బెనంగిన యభయసింగుని మెచ్చుకొనక పోలేదు.

ఇంతలోఁ బరమారుఁ డభయసింగుదురవస్థను జూచి మిగులఁ గ్రుద్ధుఁడై భీమదేవు నెదుర్కొనెను. ఆబూసైన్యము లును దమప్రభువునకు బాసటయై నిలిచెను. అది చూచి భీముని సైన్యములుగూడ నతనికిఁ దోడై నిలిచెను. మరల ఘోరసంగ్రామ మారంభమయ్యెను. కాని, కొంతసేపటికి భీమునిపరాక్రమమున కాగఁజాలక పరమారుఁడును నతని సైనికులును వెనుకకు మరలి పోవుచుండిరి. పృథ్వీరా జది చూచి తనసైన్యములను మరలించుకొని వచ్చి పరమారునకు బాసటయై నిలిచెను. ఈసాయముచేఁ బర్విడిపోవు నాబూ సైనికులు ధైర్యము తెచ్చుకొని మరల శత్రువుల నెదిరించిరి. పృథ్వీరాజు మిగులఁ బరాక్రమించి ముందునకుఁ బోయి వాఁడి శరములచే భీముని సైనికులఁ గ్రిందెళ్ళనేయుచుండెను. విలువిద్యయం దతిచాతుర్యముగల యీరాజు నెదుర నిలువలేక ఘూర్జర సైనికులు వెనుకకుఁ బాఱిపోవుచుండిరి. ఢిల్లీశ్వరుండును, నతని సైనికులును వారిని వెంబడించి తఱుమఁజొచ్చిరి. ఇంతలో భీముఁడు తనసైన్యములను బ్రోత్సాహించి మరలించి పృథ్వీ రాజుసేనలతో యుద్ధ మొనర్చుచుండెను. పృథ్వీరాజు తన దళములపైఁ గవియుచున్న భీమునిఁ జూచి చిరకాలమునుండి హృదయమున రవులుకొనుచున్నకోప మొక్కపెట్టునఁ బ్రజ్వ లింపఁ బోయి వాని నెదుర్కొని వాఁడిబాణములచే నొప్పించి

వానిని దనవంకకు మరలించెను. భీముఁడు పృథ్వీరాజును జూచినంతనే క్రోధోద్దీపితుఁడై విల్లెక్కిడి బాణవర్షము గురియింపఁజొచ్చెను. ఒకరి నొక రెదుర్కొని ద్వంద్వయుద్ధమున కారంభించిరి. పరాక్రమశాలులును, ధనుర్విద్యయందుఁగుశలులును నగు వారియుద్ధచాతుర్యమును జూచుచు నిరుపక్షములవారలట్లే నిలిచిపోయిరి. బాణములు వింటఁగూర్చునపుడును, ప్రయోగించునపుడును నతిలాఘవమును జూపుచు నావీరులు చూపఱ కాశ్చర్యమును గొల్పుచుండిరి. నాఁ డా యుద్ధమును జూచినవారు భారతయుద్ధమునందు మిగుల వాసిగాంచిన కర్ణార్జునుల యెక్కటికయ్యమును స్మరింపకపోరు. ఇట్లొక గడియకాల మగునప్పటికిఁ బృథ్వీరాజు తనతీవ్రబాణములచే భీముని మూర్ఛిల్లఁజేసెను. భీమునిదురవస్థను జూచి మావటీఁడు తనయేనుఁగును యుద్ధభూమినుండి మరలించెను. భీముఁడు మూర్ఛిల్లినతోడనే ఘూర్జరులు ధైర్యమువిడిచి పాఱిపోవఁజొచ్చిరి. ఢిల్లీసైనికులు వారిని దుర్గముచొచ్చునంత వఱకును దఱిమితఱిమి కొట్టిరి. నాఁటిమహాయుద్ధమునఁ బృథ్వీరాజును జయలక్ష్మి వరించెను.

## ఇరువదితొమ్మిదవప్రకరణము

---

### రాజద్రోహము

యుద్ధము ముగిసిననాఁటిరాత్రి రెండుజాములకాలము గడచినపిమ్మటఁ బృథ్వీరాజు సేనానివేశమునకుఁ బదిబారల దూరమందున్న యొకచెట్టుక్రింద నొకమనుష్యుఁడు కూర్చుండి యెవరినిమిత్తమో యెదురుచూచుచుండెను. కొంతసేపటికి సేనానివేశమునుండి బయలువెడలి యైదుగురుమనుష్యులు

నిశ్శబ్దముగా నాచెట్టువైపునకు వచ్చిరి. అదివఱకచ్చటనున్న పురుషుఁడు వారికెదురుగాఁ బోయి వారిని మఱికొంతదూరము గొనిపోయి యొకచోఁ గూర్చుండఁబెట్టి యిట్లు ప్రసంగించెను.

పు—రాజకుమారులారా! మీరు చెప్పినట్లు చేయ లేదు. భీముఁడు మీకు వాగ్దానముచేసినట్లు పదవుల నీయఁ డేమో యను ననుమాన మున్నదా యేమి? అట్లయిన నాతో రండు. ఇప్పుడే మీ కాబహుమానముల నిప్పించెదను.

రాజ—ఓయీ! మా కాసందియము లేదు. నేఁడు దొమ్మియుద్ధమునఁ బృథ్వీరాజును నఱక నెన్నోమాఱులు ప్రయత్నముచేసితిమి. కాని, కరుణరా జెల్లప్పుడు నాతని చెంతనే యుండెను. మా కవకాశము చిక్కలేదు.

పు—పోనిండు, ఇప్పు డాపని చేయుఁడు.

రాజ—ఏమి చేయుమందువు?

పు—నేఁటియుద్ధమున సైన్యములు మిక్కిలి యలసి యుండుటచే గాఢముగా నిద్రించుచున్నవి. రాజుగూడ నేఁడు గాఢనిద్ర చెందియున్నాఁడు. కావున నతనిగుడారమును బ్రవేశించి సాధ్యమైనచో నతనిని గట్టి తీసికొనిరండు, లేనిచోఁ జంపుఁడు, ఇదియే మీరు చేయవలసిన కార్యము. ఇది నేఁడు కానిచో నది మీ కసాధ్యము. అతఁడు దుర్గమును బ్రవేశించినచో విశ్వప్రయత్నములు చేసినయైనను మీ రతనిని జంపలేరు.

రాజ—అవును, నీవుచెప్పినది సత్యమే! మే మీ రాత్రి నారాజు నెట్లయినను జంపవలెనని యోజించుచునే యున్నాము. ఈసాయంసమయమున నాబూసైనికు లిరువురు

వచ్చి కరుణరాజు నెచ్చటకో తీసికొనిపోయినారు. అతఁడు మరలివచ్చినట్లు లేదు. నేఁడు పృథ్వీరాజును జంపుట మన కనుకూలసమయము. నేము పోయి ప్రయత్నింతుము. నీ విచ్చట నుండుము.

పృ—సంతోషమే! పోయిరండు. సాధ్యమైనంతవఱకు బంధించి ప్రాణములతోఁ గొనివచ్చుటకే ప్రయత్నింపుఁడు.

రాజ—మన మందఱు మొక్కమాఱు పోరాదు. 'ఒక్కరమే పోయి రాజుగుడారమును బ్రవేశింపవలెను. గుడారము వెనుకభాగమునుండి దారిచేసికొని పోవుట మేలు. ఎవరైన నడిగినచోఁ బృథ్వీరాజునాజ్ఞచొప్పున గస్తుతిరుగుచున్నామని నిర్భయముగాఁ జెప్పుఁడు. నేను ముందుగాఁ బోయెదను. నే నచ్చటికిఁ జేరుదుననఁగా మీలో నొకఁడు వచ్చుఁగాక. ఇట్లే యందఱును రండు. ఆరాజును బంధించి తెచ్చుటయో లేక చంపుటయో యప్పటి స్థితిగతులఁబట్టి యాలోచించుకొందము.'

అని యుపాయము చెప్పి యొకవీరుఁడు వారి నందులకు సమ్మతింపఁజేసి యటనుండి బయలువెడలి పృథ్వీరాజు గుడారమునకు వచ్చుచుండెను.

ఆగుడారము మిగులఁ బెద్దది. రాజభవనమువలె నానాలంకారశోభితమై యది యొప్పులు గులుకుచుండెను. ఆ రాజవీరుఁడు గుడారము వెనుకభాగమునకు మెల్లమెల్లగా వచ్చి తాను లోపలికరుగుటకుఁ దగినద్వారము చేయనారంభించెను. కాని, యది యసాధ్యముగాఁ జూపట్టెను. ఆపట భవనమునకు నిలువెత్తుగలబల్లలు చుట్టును గోడవలె నమర్పఁబడియుండుటచే దానిని భేదించుట యసాధ్యమయ్యెను. అతఁ

డాలోచించి భూమిని ద్రివ్వి ద్వారముచేసికొనుటయే మంచి దని నిశ్చయించి ఖడ్గముతో భూమిని ద్రవ్వఁజొచ్చెను.అది యిసుక నేల యగుటచే నతఁడు విశేషము శ్రమపడకుండఁ గనే భూమికి నాబల్లలకును నడుమ మనుష్యుఁడు దూఱి పోవు నంతటిరంధ్రము చేయఁగలిగెను. ఆరాజవీరుఁడు లోనికిం బోవ నారంధ్రములోఁ దూఱెను. వాఁ డిట్లు లోపలికిఁ బోవు చున్నసమయమున రెండుప్రక్కలనుండి రెండు కత్తిదెబ్బలు తగిలి వానిశిరము భిన్నమయ్యెను. వాఁడు కిక్కురుమనకుండఁ జచ్చెను. గుడారములో నెవ్వరో యిర్వురు వీరు లుండి యీ కార్యము నాచరించినట్లు తోఁచుచున్నది. ఆయిర్వురువీరు లును, వాని మొండెమును లోనికీడ్చివేసి యాద్వారముచెంత నల్లె కాచుకొనియుండిరి. అంతట మఱియొక పురుషుఁ డా ద్వారమునఁబడి లోనికి రాఁబోయెను. వాఁడును లోనికిఁ వచ్చియురానిసమయమునందే యీవీరులు వానిశిరమును ఖం డించిరి.తక్కిన మువ్వురువీరులుగూడఁ గ్రమముగా నచటకు వచ్చి తమవారు తమనిమిత్తము గుడారమునఁ గాచియుందు రన్నతలంపుతో లోనికిఁ బోవ సమకట్టి లోపలివీరులచే హతులై "శతాంధాః కూపం ప్రవిశంతి" యను పండితోక్తిని సార్థకముగావించిరి. ఇట్లాయైదుగురును జంపఁబడినతరువాత నావీరులు మఱికొంతసే పచ్చట వేచియుండిరి. మఱియెవ్వరై నను వత్తురేమో యని వారితలంపు. కాని, యెవ్వరును రా లేదు. అంత వారిలో నొకఁడు రెండవవానితో "అయ్యా! ఈరాజద్రోహు లంతమందినారు. పై నింక నెవ్వరైన నున్నా రేమో చూచివచ్చెదను. మీ రిందు జాగరూకులయి యుండి యీమార్గమున నెవ్వరైనను వచ్చినచో సంహరింపుఁ" డని

పల్కి యాద్వారమునఁ బడి యావలకుఁ బోయెను. అతఁడట్లు సేనానివేశమును దాఁటి పోయెను. అతని కాచీకటిలో నెవ్వరు గనఁబడలేదు. శత్రువు లిఁక నెవ్వరును నట లేరని తలంచి సేనానివేశమును జుట్టివచ్చుచుండ నొకఁ డతని కెదురుగాఁ బోయి "ఓయీ! ఏమయినది? మనకార్యము నెఱవేఱినదా? లేదా? పృథ్వీరాజును మనవారు జంపినారా? లేదా? నీవెందుల కిట్లు వచ్చితివి? నాయున్నప్రదేశమును గుఱితింపలేక వేఱొకస్థలమునకుఁ బోవుచున్నట్లు గ్రహించి నానిమిత్తమే నీవు వచ్చియుందు వని తలంచి యిటు పర్విడి వచ్చితిని, ఏమయినది? మనకార్యము నెఱవేఱినదా? లేదా? ముందామాట చెప్పుము" అని యాపురుషుఁ డావచ్చువాఁడు తనవాఁడే యనుకొని యాతురతతోఁ బ్రత్యుత్తరమున కెదురుచూడక యిట్లు ప్రశ్నింపఁజొచ్చెను. ఈవీరుఁ డాతని ప్రసంగము ముగియులోపునఁ గత్తిని మెల్లగా నంకించుకొని యొక్క వ్రేటున నతని నఱికి 'దురాత్మా! చావుము. మావంటిసాధువుల నన్యాయముగా బాధించినపాప మూరక పోవునా' అని పల్కి యచ్చోటు గదలి పోయెను.

## ముప్పదవ ప్రకరణము

### పరిసమాప్తి

మఱునాఁ డుదయమునఁ బృథ్వీరాజు తనగుడారమునకు వచ్చి చూచెను. అది శవములతో నిండియుండెను. అతఁడు వారిని బరిశీలించిచూచి వారు తన్నాశ్రయింపవచ్చిన చాళుక్యులని నిశ్చయించి మిక్కిలి విచారింపఁజొచ్చెను. తన పినతండ్రి వారితో నిదివఱకు ద్వేషముపూనియుండెను గాన

నాతఁడే వారిని జంపియుండునని నిశ్చయించి మిగులఁ గుపితుఁడై తనపినతండ్రిని బిలువ నొక భటునిఁ బంపెను. కరుణరాజును వెంటనే పృథ్వీరాజుభవనమున కరిగెను. రాత్రియందు వర్తిల్లిన యాఘోరమును విని యాశ్చర్యముతో నాబూసైనికులు ఢిల్లీసైనికులును గూడ వచ్చియుండిరి. జైతపరమారుఁడుగూడ నావింతఁ జూడ వచ్చెను. పృథ్వీరాజు కరుణరాజుతో 'బాబాయీ! మీరు చేయు చర్యలన్నియు మిగుల విపరీతములును, మన కపకీర్తిస్థాకరములును, నామనస్సునకు రోఁతపుట్టించునవియు నై యున్నవి. ఈచాళుక్యులను జంపినవా రెవ్వరై యుందురు? ఇదివఱకు వారిలో నిద్దరను జంపినందులకే మిగుల విచారించుచుండ నిప్పుడు వీరిని జంపి నామనస్సునకు మఱింతసంతాపమునుగూర్చినవా రెవ్వరు? మీరు తప్ప వీరిని దెగటార్పసాహసించువారు మన సైన్యమున లేరు. మఱియు, నిన్నరాత్రి నన్ను మోసపుచ్చి మీపట భవనమునకుఁ దీసికొనిపోయి యిచ్ఛినీకుమారిని గొనివచ్చెదనని చెప్పి వెడలిపోయితిరి. మఱి నా కగపడలేదు. ఇచ్ఛినిజాడయే లేదు. నేను మీనిమిత్తము వేచియుండి యచ్చటనే నిద్రించితిని. ఈచాళుక్యులను జంపుటకే నన్నచ్చటికిఁ బంపివేసితిరా యేమి? మీరు నాకుఁ బూజ్యులైనను నిట్టిఘోరకృత్యములుచేయునప్పుడు సామాన్యముగా విడుచువాఁడను గాను. ఇందులకుఁ దగినసమాధానము చెప్పుఁడు. ఈచాళుక్యులజోలికిఁ బోవలదని యిదివఱ కనేకపర్యాయములు మీకు బోధించినను నావచనములు తృణప్రాయముగాఁజూచి నన్ను లక్ష్యపెట్టకున్నారు. మీ రింత నిరంకుశముగా వర్తించుచుందురేని నే నందులకు సమ్మతింపను. చెప్పుఁడు, నే నడిగినదానికి

సమాధానము చెప్పుఁడు' అని యడుగఁ గరుణరాజు మంద
హాసముచేయుచు నిట్లనియె. 'కుమారా! నీ వింకను లేఁబ్రా
యపువాఁడవు. రాజనీతివిషయములు నీమనస్సున కింకను
బట్టలేదు. నీకుఁ బరమశత్రువులగు చాళుక్యులను జేరఁదీయుట
కేవలము రాజనీతివిరుద్ధము. నా కది మొదటినుండియు నిష్టము
లేదు. నీవును, నీమంత్రులు నేదియో గుసగుసలాడి వారి
కాశ్రియ మిచ్చితిరి. నాఁడు సభలో వారియెదుటనే వారిని
జేరఁదీయరాదని చెప్పుట యయుక్త మని యూరకుంటిని.
అనంతరము నీతో వీరిని బంపివేయు మని యనేకపర్యాయ
ములు బోధించితిని. అయినను నీవు నామాటలు సరకుగొన
వైతివి. నాఁడు చాందుభట్టు మనవారిని వర్ణించునప్పుడు
వారిలోఁ బెద్దవాఁడగు ప్రతాపసింగు చూపినవికా
రము నాయనుమానమును, గోపమును మఱింత వర్ధించెను.
కనుకనే నేను వారిని జంపితిని. వారు చేసినయపరాధము
పైకిఁ గనఁబడదు. కాని, సూక్ష్మబుద్ధితో నరసినవారికి వారు
మనయెడఁ జూపుచున్న హేయబుద్ధి తెలియకపోదు. అయి
నను నాఁడు నీవు కోపించినప్పటినుండియు నేను వారిజోలికిఁ
బోవలేదు. వారిచర్యలను మాత్రము పరిశీలించుచుంటిని.
అట్టిదుష్టులను నీ వంగరక్షకులనుగాఁ జేసికొంటివి. నిన్నటి
దొమ్మియుద్ధమున నిన్ను వా రనేకపర్యాయములు జంప
యత్నించిరి. కాని, నేను సర్వదా నిన్నుఁ గంటికి ఱెప్పవలెఁ
గాచియుండుటచే వారియాటలు సాగినవి కావు. ఇట్లుండ నిన్న
సాయంసమయమున నిరువురువీరులు నాచెంతకు వచ్చి యీ
రాత్రి రాజభవనమునఁ బెద్దఘోరకృత్యముచేయ నాచాళుక్యు
లాలోచించుచున్నా రని చెప్పిరి. వా రెంత ఘోరకృత్య

మైనను జేయుదురని నాకుఁగూడ నమ్మకముండుటచే నాద్రోహుల నెట్లయిన నీదినమున నంతమునొందింపవలెనని నిశ్చయించి నీ కారహస్యమును జెప్పిన మామాటలు నమ్మ వని తలంచి మాయోపాయముచే నిన్ను నాకుటీరమునకుఁ గొనిపోయితిని. అటనుండి నేను, మఱియొక రాజకుమారుఁడును వచ్చి నీగుడారమున నుండఁగా రాత్రి రెండుయామములు ముగిసినపిమ్మట నాచాళుక్యులలో నొకఁడు వచ్చి లోనికిఁ బ్రవేశింప నీరంధ్రమును జేసి యిందుండి వచ్చుచుండ మేమిరువురమును వానిని ఖండించితిమి. అట్లే కాచికొనియుండి యాద్రోహుల నందఱను దెగటార్చితిమి. తరువాత మఱియెవ్వరును రాకపోవుటచే నారాజకుమారుఁ డెవ్వరైన ద్రోహులు పైనున్నారేమో చూచివచ్చెద నని చెప్పి పోయి యాకుట్రకంతకుఁ గారణుఁ డగునమరసింహునిఁ జంపి వచ్చెను. పిమ్మట మే మిరువురమును గలసి నీచెంతకు వచ్చితిమి. కాని, నీవప్పటికి నిద్రించుచుంటివి. నీకు నిద్రాభంగముఁ గల్గింప నిష్టములేక మేము మఱియొకస్థలమునకుఁ బోయి రాత్రిశేషమును బుచ్చితిమి. నిన్నటిదినమున నారాజకుమారుఁడు వచ్చి నన్నుఁ బ్రోత్సహించి నాకు సాయపడకపోయినచోఁ జెప్పవలనుపడనియంతఘోరకృత్యము నీగుడారమున సంభవించియుండునని చెప్పి యతనిగుడారములోనికిఁ దీసికొనిపోయి రాత్రియం దాదుర్మార్గులు చేసినపనిని జూపెను.

పృథ్వీరా జది విని యత్యాశ్చర్యము నొందెను. తక్కినసభ్యులు నావృత్తాంతము విని చిత్తరువులవలె నుండిరి. అప్పుడు రాజు 'నీకుఁ దోడ్పడిన రాజకుమారుఁ డెవఁ'డని ప్రశ్నించెను.

'నీప్రియురాలగు నిచ్ఛినీకుమారియే పురుష వేషముతో నట్లు వచ్చి నీప్రాణరక్షణమునకై యెక్కువ శ్రమ చెందెను' అని కరుణరాజనెను.

అందులకు రాజు మఱింత యాశ్చర్యముచెంది 'ఆఁ! రాకుమారియా! ఇచ్ఛినీకుమారియా! నిన్నరాత్రి నీతో నా చెంతకు వచ్చినది యిచ్ఛినియా? ఆమె కింతచాతుర్యము గలదా! మంచి నిశీథములందు శత్రువులను జంపుసాహసము గలదా యామెకు?' అని మఱి మఱి ప్రశ్నింపనారంభించెను.

'కుమారా! ఇచ్ఛిని తెలివి తేటలను, ధైర్యసాహసాదులను నామెగురువగు నీయీశ్వరభట్టుగదా వర్ణింపవలె' నని చెప్పి యొకపురుషునిఁ జూపెను.

ఆపురుషుఁడు లేచి పృథ్వీరాజున కభిముఖుఁడై నిలిచి 'రాజేంద్రా! ఇచ్ఛినిసద్గుణములు వర్ణింప నాతరముగాదు. నాఁ డామె తమకు వ్రాసినయుత్తరమె యామెచాతుర్యముఁ గొంతవఱకు వెల్లడించును. ఒకమా రస్త్రచాతుర్యమును జూపుచు భీమదేవుని టెక్కెమును దెగవ్రేసి యతని కాశ్చర్యమును గల్గించినది. మఱియు నామె బాణమున కుత్తరమును గట్టి నాచెంతకుఁ బంపినది. దానినే దేవరవారి కర్పించుకొంటిని. ఆమె నాదుర్గమునుండి తప్పించుటవిషయమై మే ముత్తరములవలన నొండొరులయభిప్రాయము తెలిసికొనుచు భీమరాజువలనఁ బురుషులుధరించుదుస్తులను బుచ్చుకొను మని నే నొకనాఁడు తెలుపఁగా నామె యట్లు చేసినది. మఱికొన్ని దినములకు నే నొక సేవకుని వేషముతో మధుమంతుడుపంపిన శ్లోకయుత్తరమును గల్పించి భీమరాజునకుఁ జూపి మోసపుచ్చితిని. అతఁడును, రూపవతియు నాయుత్తర

వృత్తాంతమంతయు సత్యమే యని తలంచిరి. ఆసాయంసమయమున నేను రహస్యముగా నిచ్చినీకుమారి చెంతకుఁ బోయి యావృత్తాంతమును విన్నవింప నామె చెలికత్తెయగు వకుళను భూయాఁదుని చెంతకుఁ బుచ్చి మాయచే వాని నచ్చటకు రప్పించి యొకగదిలోఁ బెట్టి తలుపు వేసి పురుష వేషముతో నాచెంతకు వచ్చెను. రూపవతియు, ద్వారపాలకులును నారాజకుమారిని భూయాదుఁడనియే నమ్మియుండిరి. మే మందుండి తప్పించుకొనివచ్చుటయేగాక మాకపకారిణి యగురూపవతికిఁ దగినప్రాయశ్చిత్తముఁ గావించితిమి. మఱియు నారాజకుమారి చాళుక్యులు మాయోపాయముచే మిమ్ముఁ జంపనున్నట్లు నావలన విని యాయపాయ మెట్లయినను దప్పించి మిమ్ము రక్షింపవలె నని నిశ్చయించి పలుపాట్లు పడి కరుణరాజుసాయమునఁ దనయభిలాషను నెఱవేర్చుకొన్నది. దుర్మార్గుఁడగు సమరసింహుని జంపి తనకసి దీర్చుకొన్నది.' అని యామెను వర్ణించుచుండఁ బృథ్వీరాజతనిఁ జూచి 'చాళుక్యులు నన్నుఁ జంపనున్నట్లు నీ కెట్లు దెలిసె' నని ప్రశ్నించెను.

అది విని యీశ్వరభట్టు 'మహారాజా! అమరసింహుఁడు భీమునకుత్తర మొకటి పంపుచు నందు నేను ఢిల్లీకిఁ బోయి రెండవపని నెఱవేర్చుకొని వత్తు' నని వ్రాసెను. ఆయుత్తరము నాచేతఁ బడినది. 'దానివలనఁ జాళుక్యులు పృథ్వీరాజునకు ద్రోహము తలంచుచుందురని నే ననుమానపడి రహస్యముగా వారిచర్యల నరయుచుంటిని. అమరసింహునకును, వారికిని రహస్యముగా నుత్తరప్రత్యుత్తరములు జరుగుచున్నట్లు తెలియవచ్చెను. అమరసింహుఁ

డీచాళుక్యులలో నొకరిని గొనిపోయి భీమునితో స్నేహము చేయించినట్లు వినియుంటిని. అందుచే నాయనుమానము మఱింత ప్రబలినది. మీరు సైన్యములతో నిచ్చటికి వచ్చిన పిమ్మట నేను మాఱు వేషముతోఁ దఱుచుగా వారియొద్దనే తిరుగఁజొచ్చితిని. అవృత్తాంత మెప్పటికప్పు డారాజకుమారికిఁ దెలుప నామె కరుణరాజునకుఁ దెలుపుచుండెను. నిన్న సాయంసమయమున వారు రాత్రి మిమ్ముఁ జంపఁదలంచుకొన్నట్లు నేను గ్రహించి యిచ్ఛినితోఁ జెప్పితిని. ఆ రాజకుమారియుఁ, గరుణరాజును నిన్న రాత్రి యాదుష్టులను జంపి తమ్ము రక్షించినారు' అని మనవిచేసెను.

ఈశ్వరభట్టునద్వితీయ రాజభక్తిని బృథ్వీరాజు మిగుల మెచ్చుకొనెను. జైతుఁడు తనయాసనమునుండి లేచి, ఈశ్వరభట్టును గౌఁగిలించుకొని తనకూఁతును రక్షించి తమ కుటుంబమునకుఁ జేసినయుపకారమును బ్రతికియున్నంతకాలమును మఱవనని చెప్పి తగిన బహుమానము లిచ్చి సంతసింపఁజేసెను. పృథ్వీరాజు, కరుణరాజుపాదములపైఁ బడి తన యవివేకమును క్షమింపవలయు'నని వేఁడికొనెను.

అనంతరము పరమారుఁడు, పృథ్వీరాజును దనపురమునకుఁ గొనిపోయి తనకూఁతు నతని కిచ్చి మహావైభవముతోఁ బెండ్లి గావించెను. Reddy 5-3-59

సమాప్తము.

మెజస్టిక్ ప్రెస్, రాజమండ్రి.